## తంటాలు

'రూపిణి' ముఖ చిత్రంతో వెలువడిన మా (మీ) పత్రిక బాగుంది. అయితే ఈమధ్య ఆలస్యమౌతుందన్న బాధతప్ప మిగతా లోపాలేమీ లేవు. మన కిష్టమైన వారు అనుకున్న సమయానికి రాకపోతే ఎంతబాధపడతామో ఇతరులకెలా తెలుస్తుంది. కవర్ పేజీమీద తేదీ వెయ్యకుండా........తెలివిగా మేనేజ్ చేయాలని ఆలోచిస్తున్నారా! ముఖ్యంగా శ్రీ చల్లా వారి 'లవ్ గేమ్' ప్రతివారం మమ్మల్ని వదలకుండా చదివిస్తూ, పత్రికకోసం తర్వాత కథకోసం ఎదురుచూసేలా చేస్తున్న ఘనత శ్రీ చల్లా మరియు శ్రీ వీరాజీగార్లకే దక్కుతుంది. ప్రతి పేజీ అత్యంత శ్రద్ధతో కథలు, కవితలు, శీర్షికల విష

## వీక్లీపోస్ట్

యంలో ప్రత్యేకంగా ఉండడం ప్రశంసనీయం. టిట్ ఫర్ టాట్ మంచి శీర్షిక, అలాగే సూపర్ హీరో సూపర్బ్, హిట్ లిస్ట్ ఫెంటాస్టిక్, వజ్రసంకల్పం వజ్రంలాంటిది, అలాగే క్రొత్తనవలిక 'కెరటాలు-కేరింతలు' ప్రారంభంలోనే ఆకర్షించింది. అన్నిరకాల పాఠకుల నలరిస్తున్న, ప్రశంసలను పొందుతున్న పత్రికలో విమర్శలకు గురయ్యేది ఒకటి - అదే పత్రిక ఆలస్యంగా రావడం. మీ తంటాలు ఏమైనా సమయానికి పత్రిక రావాలని కోరుతూ -

- పోలోజు వెంకటాచారి, బోడుప్పల్

( 73 వ పేజీ చూడండి)



## పదండి ముందుకి

ముఖచిత్రం :
హీరో బాలకృష్ణ

### ఈ వారం ప్రత్యేకం:



### కథలు:



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు:



**పై వారం :**
**"బంగారు నాణెం" (దెయ్యం కథ)**




ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తనమనంబునకగు దా నొరులకునవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్

THE ANDHRA PATRIKA GROUP OF MAGAZINES

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు

సంపుటము 82 సంచిక 50
3-8-1990
విడిప్రతి వెల నాలుగు రూపాయలు

శక సం. 1912 శ్రావణ మాసం 12వ తేది

PRINTER, PUBLISHER & SANCHALAKUDU:
CHAKRAPANI

EDITORS:
VEERAJI
M. MADHAVA RAO

ASSOCIATE EDITORS:
POTLURI VENKATA RAO
Dr. GUMMANURU RAMESH BABU

SUB-EDITORS:
P. PRAMEELA
K. S. B. TILAK
BHISETTY LAXMANA RAO

ARTISTS:
KASI
CHALAM

PRODUCTION & ADMINISTRATIVE MANAGER:
M. THYAGARAJ

SENIOR ADVERTISEMENT MANAGER:
K RAMACHANDRAIAH

CIRCULATION MANAGER:
S. APPADORAI

Printed and Published for Nageswara Rao Estates Ltd., by VAMARAJU CHAKRAPANI at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-520 003,
Editor: VEERAJI
Phones: Business: 61247, 61248,
Editorial: 75667.

# సంపాదకీయం...

# పంజాబ్, కాశ్మీర్ హమారే!

కాశ్మీర్‌లో రాష్ట్రపతి పాలన మార్గాంతరం లేని కారణంగా వచ్చింది. గవర్నర్ పాలన కన్నా దీనివల్ల కేంద్ర ప్రభుత్వానికి మరింత జోక్యం చేసుకోడానికి కొంతలో కొంత అవకాశాలు పెరిగాయి. దీనికన్నా ముఖ్యమయింది కాశ్మీర్ సరిహద్దుల వెంబడి పాకిస్తాన్ నుంచి దుండగులు దొంగ ప్రవేశం చేయకుండా కమిటీలు, కంచెలు- అదే విధంగా యేర్పాటు చేస్తున్న ప్రత్యేకమైన [illegible] నిఘా చర్యలు వగైరాలు-

పంజాబ్ వైనం కూడా అంతే- అక్కడ ప్రజా ప్రభుత్వం అన్న మాటకు తాజా యువతరానికి; శైశవదశలో వున్న విద్యార్థినీ విద్యార్థులకే అర్థమే తెలియదు. చాలా మంది ప్రజలకే అర్థమయినదల్లా, సిక్కు మతానికి కేంద్రప్రభుత్వం తీరని ఘోర అపచారం చేసిందని మాత్రమే!? కాశ్మీర్, పంజాబ్‌లలో దారుణ మారణకాండ, "నరవధ" నిర్విరామంగా కొనసాగుతూనే వున్నది. ఈ సమయంలో ఫ్రంటు ప్రభుత్వం రానున్న నవంబర్ మాసం మీదకే దృష్టి మరల్చవలసి వచ్చింది! నవంబర్ నాటికి రాష్ట్రపతి పాలన అంతం చేయాలి. అయితే యీ లోగా అక్కడ యేమి చేయాలి? ఆకాశవాణి దూరదర్శన్‌ల ద్వారా "నరబలి" లెక్కలు అందించటమేనా?-

ఇటీవల కేంద్ర హోంశాఖ సహాయ మంత్రి అక్కడ రెండు రోజుల పర్యటన చేశారు- ఆయన పంజాబ్‌లో ఈసారి రాష్ట్రపతి పాలనకి బదులుగా-ఎన్నికల ద్వారా గద్దెనెక్కే ప్రభుత్వం యేర్పాటు చేయబడుతుంది అని వాగ్దానం చేశారు- ప్రజలు నిర్భయంగా నాయకులు ధైర్యంగా ఎన్నికలలో పాల్గొనే అవకాశాలు నెలకొంటే యిదేమి అసాధ్యమూ అపురూపమూ అయిన చర్య కాదు గాని- "మీ గుమ్మం ముందుకు మీ ప్రభుత్వం" వస్తుంది అన్న కొత్త నినాదానికి ప్రాతిపదికగా కేంద్ర ప్రభుత్వం- అందులో భాగస్వామ్యం గల రాజకీయ పక్షాలు చేయగలిగేదెంత?- చేయనున్నది ఎంత? అని ఆలోచిస్తే వెనుకటి కాంగ్రెస్ గవర్నమెంట్ యెదుర్కొన్న సమస్యలే తిరిగి ఎదురు నిలుస్తాయి. ఈ సందర్భంలోనే కాశ్మీర్, పంజాబ్‌లను పాటి కున్న "చిక్కుల" సారూప్యం ద్వారా మనం కలిపి ఆలోచించాలి! రెండు ప్రాంతాలలోను "మతం" వెలుపల మహమ్మారి లాగ లోపల లోపల "దావాగ్ని"లాగ దాగి వుంది. రెండు రాష్ట్రాలలోను పాకిస్తాన్ ప్రచ్ఛన్న, ప్రత్యక్ష జోక్యం వున్నది. దురదృష్టవశాత్తు రెండు రాష్ట్రాలు కూడా సరిహద్దు రాష్ట్రాలు. అయితే పంజాబ్‌లో దుండగులు ప్రత్యేక "ఖలిస్తాన్" కావాలంటున్న "ఖలులు"- వీరికి సుమతీశతక కారుడంటున్నట్లు నిలువెల్ల విషమేకావచ్చును- వీరి సంఖ్య కూడా చాలా తక్కువ కావచ్చునుగాని- వీరి పడగనీడలోనే పంజాబ్‌లోని సిక్కు నాయకత్వం కాపురం వుంటున్నందువల్ల- యివాళ జాతీయ జనజీవన ప్రవంతిలో కలిసి పోవాలన్న కోరిక గల నాయకులు సైతం ధైర్యం చేసి ముందుకి రాలేకపోతున్నారు- పంజాబ్ వాసుల దేశభక్తి-నిష్టనియమం వగైరాల మీద శౌర్యప్రతాపాల మీద- భారతదేశ ప్రభుత్వం యితర ప్రాంతాలకు చేస్తున్న విపరీత ప్రచారం బహుశా పంజాబ్‌లోపల జరగటంలేదేమో?- లేదా జరిగినా వాటి ప్రభావం- దుండగుల వేర్పాటు "వాదా"నికే వూతం యిస్తున్నదేమోగాని యీ పదిసంవత్సరాలకాలంలో గవర్నర్‌లు మారారు- బాదల్, తోహ్రాలు లేచారు. పడ్డారు. సిమ్రాన్‌జిత్ మాన్‌లు కత్తులు దూశారు-ముడిచారు. కాని పరిస్థితి మాత్రం అట్లాగే వుంది మరో రాజకీయ పార్టీ అక్కడ బ్రతికి బట్టకట్టలేదు- కేంద్ర నాయకులు బందోబస్తుతో వెళ్లివచ్చి- చెప్పే చిలకపలుకులు అన్ని మామూలే! ఇవాళ అకస్మాత్తుగా అక్కడ ఎన్నికలు పెడతాము అంటూ ఒక ప్రకటన హోం శాఖ సహాయ మంత్రి చేయడానికి కారణం- దాని వెనుక మారిన పరిస్థితులుగాక- యీ కృష్ణకాంత్ సహాయ్‌గారు పంజాబ్ వ్యవహారాలను ప్రత్యేకంగా చూడటానికి నియమితుడైనాడు కనుకనే తాను యేవో ప్రాజెక్టులు పథకాలు ప్రకటిస్తున్నారు. అయితే యీ ఆశావాదాన్ని- కేవలం "తిమిరవాద" దృష్టితో ఖండించకూడదు. అక్కడ ఎన్నికల నిర్వహణకు తగిన వాతావరణం కల్పించే ప్రతి మిల్లీమీటర్ ప్రయత్నానికి, అన్ని వర్గాలు, అన్ని రంగుల వారి దోహదించవలసిందే! కాని దీనికి భిన్నంగా వస్తున్న ధోరణులున్నాయి. అవి కొత్త పోకడలు పోతున్నాయి కూడా- వాటిలో ముఖ్యమయింది పంజాబ్ నాయకులు కొందరు- "బ్లూస్టార్ ఆపరేషన్"ను తిరుగదోడుతున్నారు. అప్పటి యీ "అపవిత్ర చర్య"కి పార్లమెంటు కూడా ఆమోదం తెలియజేసింది కనుక - ఆ మహోన్నత వ్యవస్థ కూడా వారికి ఒక తీర్మానం ద్వారా క్షమాపణ చెప్పాలిట!- మరొక వంక అక్కడ "మంజిత్" గ్రూపు విద్యార్థి దుండగుల దళాలు- రానున్న ఎన్నికలలో పాల్గొంటామంటూ ప్రకటనలు చేస్తున్నాయి. కేవలం తీవ్రవాదులు ప్రజల్ని బెదిరించి వోట్లు పోలుచేయించుకొనే ఎన్నికలు- ఒకసారి పార్లమెంటు విషయంలో "చవి" చూశాం కనుక- అటువంటి ప్రమాదం రాకుండా, కడు మెలుకువతో-ప్రజాస్వామ్య పరమపదసోపానాలకి "పునాది పని" యిప్పటి నుంచే అందరూ చేయడం మంచిది. అదే విధంగా "కాశ్మీర్" విషయంలో భారత పాకిస్తాన్‌ల మధ్య అధికార స్థాయి చర్చల ద్వారానైనా- లేదా అంతర్జాతీయ వొత్తిడి ద్వారానైనా అక్కడ తీవ్ర పరిస్థితులకు ఉపశమనం కలిగించి- విరామం సాధించి- శ్రీనగర్‌ను వదిలి పారిపోయిన ప్రజలనైనా తిరిగి, అక్కడకు చేర్చడం కేంద్రప్రభుత్వ తక్షణ కర్తవ్యం!

పంజాబ్ కాశ్మీర్‌లలో ఒకటి జాతీయ గీతంలో ఉన్నది, మరొకటిలేదు కాని యీ రెండూ జాతీయ ప్రవంతిలో అతి ముఖ్యమైన అంతర్భాగాలు అంతర్వాహినులు అన్న మాట అందరూ గ్రహించాలి!



శాంతికోసం చేతులు కలుపుతున్న భారత్-రష్యాల మైత్రికి ప్రతినిధులు మాస్కోలో పరస్పరాభినందనలు తెలుపుకుంటున్న దృశ్యం.



## కంచె మేసిన చేను.....

బెల్లం ముక్కకి చీమలు పట్టడం మానేస్తా యేమో కాని- డబ్బుతో వ్యవహారమున్న చోట అవినీతి అంటకుండా వుండదు. ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధుల మీద- వారు మంత్రులు ప్రధాన మంత్రులు అయినా కూడా డబ్బుకు కక్కుర్తి పడ్డ సందర్భాలు పవిత్ర భారత దేశంలో కొత్తకాదు- అధికా రులు 'గడ్డి' తినటంలో లోకరీతికి భిన్నమైన రీతి ఏమీ లేదు. ఇది యిందుగల దందులే దను సందేహం వలదు అవినీతి అంతటా వున్నదే. ఇది ప్రజాస్వామ్య దీపం క్రింద "నీడ" లాంటిది కాని న్యాయ వ్యవస్థ అందులోను హైకోర్టు న్యాయమూర్తుల అవి నీతి మనం సర్వసాధారణంగా వినం. కాని యిటువంటి దౌర్భాగ్యం కూడా యిటీవల భారతదేశాన్ని వరించింది. "జస్టిస్"కి నాథుడు అయిన జస్టిస్ సి. రామస్వామి మీదనే అధికార సదుపాయాల దుర్విని యోగం కేసు వచ్చింది. ఏమే అవినీతి వ్యవహారాలు జరగకుండా చట్టం ద్వారా సంఘాన్ని కాపాడాల్సి వుందో అదే వ్యవస్థకి చెందిన ప్రతినిధి అట్టే ప్రలోభాలకి లోను కావటం- అది యించుమించు ప్రాథమిక విచారణలో బయటపడటం- దాంతో ఆ సుప్రీంకోర్టు న్యాయమూర్తిని నిర్బంధంగా శలవు మీద యింటికి పంపడం- స్వతంత్ర భారత చరిత్రలో మొట్టమొదటిసారి జరి గింది.

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ సవ్యసాచి తన రెండు చేతులా యెన్నో కేసులు విచారించి తీర్పు యిచ్చి వుంటారే మోగాని- తన సహచరుడు ప్రముఖ న్యాయ మూర్తి అయిన రామస్వామి మీద "డబ్బు" దుర్వినియోగం చేశాడన్న ఆరోపణల మీద విచారించవలసి రావటం చాలా విచార కరం. హైకోర్టు న్యాయమూర్తిగా శ్రీ రా మస్వామి చాలా సుప్రసిద్ధుడు- పంజాబ్ హర్యానా హైకోర్టుల 'పీఠం' మీద ఆయన చాలా కాలం కూర్చున్నారు- కాని ఆడిట్ నివేదికలలో ఆయన సాక్ష్యాధారాలతో దొరి కిపోయారు. పత్రికల కెక్కిన 'జస్టిస్' మీద "జస్టిస్" చెప్పవలసిన బాధ్యత ప్రధాన న్యాయమూర్తి మీద పడ్డది. ఆయన కేసు అంతా పరిశీలించి- జులై 23 నుంచి శ్రీ రామస్వామికి 'విశ్రాంతి' ప్రసాదిం చారు. ఈ కేసు దర్యాప్తు పూర్తి అయ్యే దాకా ఆయన యితర కేసులమీద విచా రించే హక్కు కోల్పోయారు.

శ్రీ రామస్వామి టెలిఫోన్ బిల్లులు, యింటి ఫర్నిచర్ బిల్లులు అనూహ్యంగా వుండేవిట- మోటారు శకటాల వాడకం సంగతి సరేసరి- న్యాయమూర్తి కదా ఆయ నను "తాక" గలవాడెవ్వడు?- అనుకున్నా రేమో కాని.... పత్రికల వాళ్లు తీగె దొర కంగానే డొంకంతా లాగే రకం కదా... న్యాయమూర్తి కూడా చట్టానికి అతీతుడు కాడు- అతని ఖర్చులు గూడా అపరిమితం కాకూడదు- ప్రజల వోట్ల కోసం- ఎన్నికల్లో తనకున్నదంతా అమ్ముకొని బయటపడ్డ ఎమ్మెల్యేలు, ఎం.పి.ల సంగతి వేరు. వారికి బలహీనతలుంటాయి. కాని- న్యాయమూర్తి పదవిని అంచెలంచెలుగా చేపట్టేటందుకు నీతినిజాయితీ ప్రతిభా సర్వీసు యివే పెట్టు బడులు. అటువంటి చోట యిలాంటి ప్రలో భాలు ప్రమాదకరాలు. జస్టిస్ న్యాయ మూర్తి కేసు దేశంలోని న్యాయమూర్తు లకు ఒక హెచ్చరికగా వుండాలన్నదే మన కోరిక.

## కాంగ్రెస్‌కి ఎన్నికలా?

కొన్ని వార్తలు తమాషాగా వుంటాయి. సంస్థాగత ఎన్నికలకు నోచుకోని అతి పెద్ద పార్టీ కాంగ్రెస్ పార్టీలో ఇప్పుడు సంస్థాగత ఎన్నికలు- అంతా ప్రజాస్వామ్య పద్ధతిలో జరుగుతాయని రాజీవ్‌గాంధీ తేదీలు గట్రా యిచ్చి మరి ప్రకటించడంతో కొంచెం నమ్మ కంగానే వున్నది. "హై కమాండ్"లో ఎవ రుంటే వారి యిష్ట ప్రకారమే ఢిల్లీలో అయినా పల్లెలో అయినా కాంగ్రెస్ అధ్యక్ష

కార్యదర్శులు కార్యకర్తలనుఏర్పాటు చేయబడుతుంటారు- అసలు ఆ మహావటవృక్షం వూడలు చాలా చోట్ల పుచ్చుపట్టిపోడానికి కారణం- అందులో ముఠాతగాదాలకి ఆశ్రిత పక్షపాతానికి ఉన్నంత చోటు ప్రజాస్వామ్య సిద్ధాంతాలకి లేకపోవడమేనని "వోల్డ్ కాంగ్రెస్" వారంటారు- చాలా మంది "వోల్డ్" కాంగ్రెసు వారు ఇతర పార్టీల సారథ్యం సంపాదించుకొని కాంగ్రెసుని విడిచిపెట్టేశారు- ఇవాళ మిగిలిన వాళ్లల్లో- "మానులేని దేశము నందు ఆముదవు చెట్టే మహావృక్షం" అన్న రీతి బడా నాయకులయిన వాళ్ళే! రాజీవ్‌గాంధీ చిత్తుగా ప్రజలచేతిలో వోడిపోయిన తర్వాత గాని- యిందిరా కాంగ్రెస్‌కి జ్ఞానదంతాలు రాలేదు. అక్కడ ముఠా రాజకీయాలు, రౌడీల ప్రాబల్యం ఎక్కువయిన తర్వాత గాని ప్రజలు కాంగ్రెస్‌ను వోడించలేదు- కాంగ్రెసు స్థితి యిలా వుండబట్టే- ఉత్తరాదిన వున్న వేడి చల్లారకముందే- ఛాన్సు చూసుకుందామా? అనుకున్నట్లుగా వుంది బి.జె. పి. ఉబలాటం. సమాచార శాఖామాత్యులయిన శ్రీ ఉపేంద్రకి ప్రత్యేకంగా శ్రీ అద్వాని మధ్యంతర ఎన్నికలకోసం ఇచ్చిన పిలుపు మరో రకంగా అనిపించటానికి ప్రత్యేక సమాచారం ఏమైనా అందిందో యేమో తెలియదుకాని- శ్రీ అద్వానిగారికి మాత్రం యీసారి ఎన్నికలు త్వరగా రావాలనే కోరిక సహజంగానే వుంటుంది. దక్షిణాదిన బి.జె. పి. జ్యోతి వెలగడం ఇంత త్వరగా సాధ్యం కాదని ఆయనకి తెలుసు. అంచేత దళ్‌లోను ఫ్రంట్‌లోను ఐకమత్యం కోసం ఆయన పబ్లిక్‌గా నోరు పారేసుకున్నాడనుకోడం భ్రమ- బాబ్రీమసీదు రామజన్మభూమి వివాదం విషయంలో దిగినా దిగకపోయినా కూడా నష్టమే కాంగ్రెసుకి. అందువల్లనే- రాజీవ్ గాంధీకి పాత జనసంమాన్ని జనం వేరుతో హెచ్చరించక



తప్పలేదు- రామజన్మభూమి విషయంతో 'ప్రతి ఉద్యమం' ప్రారంభిస్తామంటున్నాడు ఇందిరా తనయుడు- ఆ ఉద్యమం ఎన్నికలు అన్నీ కలిసి రాకుండుగాక! వస్తే మాత్రం కాంగ్రెసుకి మాత్రం కలిసిరాదు. తస్మాత్ జాగ్రత్త, జాగ్రత్త!

# శిలతో శిల్పం

కాకాని కమల

అసుర సంధ్యా సమయం.

ఇళ్లల్లో ఒకటొకటిగా దీపాలు వెలుగుతున్నాయి.

చిన్న మట్టిప్రమిదలో చమురుపోసి తులసికోట ముందు పెట్టింది వర్ధనమ్మ. లైటువేసి - వీధి తలుపులు తెరుస్తూ యధాలాపంగా తల ఎత్తిన వర్ధనమ్మ వులిక్కిపడింది.

ఆ దృశ్యం చూస్తూనే ఆవిడ గుండె ఒక్కక్షణం ఆగి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకోవటం మొదలుపెట్టింది.

"ఓరి భగవంతుడా" అనుకొంటూ ధడాలున తలుపులు మూసేసింది.

లయతప్పుతున్న గుండె వేగాన్ని అదుపు చేసుకొంటూ ప్రక్కనేవున్న కుర్చీలో కూల బడింది.

క్షణం క్రితం చూసిన దృశ్యం మళ్ళీ కళ్లముందు కదిలింది.

మోకాళ్ళమీదికి అడ్డంగా చుట్టుకున్న గళ్ళలుంగి, చారల బనీను, మెళ్ళో తాయెత్తు, జుత్తుపోలిగాడిలా జిబ్బినెత్తి, ఎర్రటి కళ్ళు..... కోర మీసం!

తన ఇంటి గుమ్మానికి ఎదురుగా రోడ్డుమీద కరెంటు స్తంభానికి అనుకొని బీడీ తాగుతూ ఎర్రటి కళ్ళతో యిటే చూస్తున్న ఆ రౌడీవెధవ ఎవరు?

రోజూ యిదేసమయానికి నిఘావేసినట్లు అదేపనిగా తన యింటిముందు ఎందుకు తచ్చాడుతున్నాడు?

అలాంటి పాపిష్టివెధవకి తన ఇంటితో ఏం పని?

రోజూ సాయంత్రం అయ్యేసరికి.....

ఇదే సమయానికి ఎవరో డ్యూటీ వేసినట్టు తన ఇంటికేసి అదేపనిగా ఎందుకు చూస్తున్నాడు?

సాయంత్రం చీకట్లు ముసిరే సంజె వేళ ఇంటిముందు దీపంవేసి వీధి తలుపులు కాసేపయినా తీసిపెట్టటం తమ సంప్రదాయం.

కాని......

ఈమధ్య తను ఎప్పుడూ వీధి తలుపు తెరిచినా వాడు ఎదురుగా ప్రత్యక్షం అవుతున్నాడు.

పోనీ..... ఏదో చూసీచూడనట్లు వది లేద్దామన్నా యిది "చిన్న" విషయంకాదు.

ముఖ్యంగా యిక్కడికి గత రెండు మూడు నెల్లుగా తను బాగా గమనిస్తోంది.

వాడు.......

ఆ రౌడీ వెధవ ఎవడోగాని.... సాయంత్రం అయ్యేసరికి తన ఇంటికి ఎదురుగా నిల్చుని అదేపనిగా ఇంటికేసి చూస్తున్నాడు.

తను ఆ విషయం గమనించిందన్న సంగతికూడా వాడు గుర్తించాడు. అయినా మీసంఎత్తు భయంలేకుండా అలాగే నల్లరాయిలా కదులు మెదులు లేకుండా నిల్చుంటున్నాడు.

రోడ్డు అన్నాక తొంభైమంది వెడతారు వస్తారు.

అదికాదు.

కాని వీడు ప్రత్యేకంగా తన ఇంటిపై కన్నువేశాడు.

అసలు వాడు ఏ ఉద్దేశ్యంతో సాయంత్రం అయ్యేసరికి తన ఇంటిముందు తయారవుతున్నాడు?

ఓ రౌడీవెధవ యిలా తన ఇంటి చుట్టు పహరా కాస్తున్నాడని ఇరుగుపొరుగు ఎవరైనా గమనిస్తే ఎంత అప్రతిష్ఠ?

వర్ధనమ్మ గుండె గుభేలుమంది.

"భగవంతుడు తనకి మళ్ళీ యిటువంటి పరీక్షలు కూడా పెట్టబోతున్నాడా?"

వర్ధనమ్మకి ఒక్కసారిగా తన పేదరికం, పెళ్ళికెదిగిన ముగ్గురు కూతుళ్ళు జ్ఞాపకంవచ్చారు.

వర్ధనమ్మకి కుడికన్ను అదిరింది.

నెమ్మదిగా కుర్చీలోంచిలేచి కిటికి దగ్గరకి వచ్చింది.

కిటికిరెక్క చాటుగా నిల్చుని వీధిలోకి తొంగిచూసింది. ఆ రౌడీవెధవ యింక లాభంలేదనుకున్నాడు కాబోలు...... అసహనంగా చేతిలో బీడీని కిందపడేసి, చెప్పుకాలితోరాసి, ఒకసారి మెళ్ళోని మఫ్లర్‌ని తీసి గట్టిగా దులపరించి, మళ్ళీ మెడ చుట్టూ చుట్టుకొంటూ వెనక్కి తిరిగివెళ్ళిపోతున్నాడు.

"హమ్మయ్య! ఈరోజుకి గండం గడిచింది" అనుకుంది వర్ధనమ్మ.

వాడు....అంగకి ఒక అడుగుచొప్పున వేస్తూ ప్రక్కసందు దిశగా వెళుతూ మళ్ళీ మధ్యమధ్య వెనక్కి తిరిగి తన ఇంటి గుమ్మంకేసి చూస్తున్నాడు.

వాడికి యిక్కడేంపని?

వర్ధనమ్మ కనుబొమలు ముడుచుకున్నాయి.

"ఎందుకేమిటి పిచ్చిదానా?" అన్నట్టు మనసు అవహేళనచేసింది.

తనకి ముగ్గురు ఆడపిల్లలు.

ముగ్గురూ పెళ్ళికి ఎదిగవచ్చారు.

తనకా నెత్తిమీద గొడుగు లేదు.

మగతోడు లేకుండా తినో తినకో గుట్టుగా రోజులు గడుపుకొని వస్తున్నారు.

తన కూతుళ్ళు రోజూ బయటికి వెళ్ళి చిన్నో చితకో ఉద్యోగాలుచేసి ఇల్లు గడుపుతున్నారు.

ఆ రౌడీవెధవ యిదంతా కనిపెట్టివుంటాడు.

"తన ఆడపిల్లలకి ఏ కీడన్నా తల పెట్టదుకదా? ఓరి భగవంతుడా? నాకేది

టానా-ఆంధ్రసచిత్ర వార పత్రికల సంయుక్త సాహితీ సంబరంలో

రు.500/- బహుమతి పొందిన కథ



దిక్కు.”

ఆ రౌడీవెధవ సందుచివరదాకా వెళ్ళి పొయ్యాడు.

సందుమలుపు తిరిగేముందు వాడు మళ్ళీ ఒకసారి వెనక్కి తిరిగి చూడటం వర్ధనమ్మ గమనించకపోలేదు.

వాడు సందుమలుపుతిరగ్గానే “హమ్మయ్య. శని విరగడయ్యింది” అనుకుంటూ గబగబ వీధి తలుపులు బార్లా తెరిచి ఇంటిముందు లైటువేసింది.

ఇంకా పూర్తిగా చీకట్లుపడలేదు.

“దీపాలు వెలిగించుకునే వేళ ఈ రౌడీవెధవకి భయపడి తలుపులు మూసుకోవాల్సి వస్తూంది” అని తిట్టుకొంటు బియ్యం చేట ముందుపెట్టుకుని గడపవారగా చతికిలపడింది.

యాంత్రికంగా బియ్యం ఏరుతోందన్న మాటేగాని వర్ధనమ్మ మనసు పరిపరివిధాలుగా ఆలోచిస్తూంది.

వర్ధనమ్మ పెద్దకూతురు రమణి తన గదిలో టేబిల్ముందు కూర్చొని ఆఫీసు కాగితాలు రాసుకొంటూంది.

రెండవ కూతురు జయ పెరట్లో వేప చెట్టుకింద చల్లగాలికి మంచం వాల్చుకుని కూర్చొని పిల్లల పరీక్షపేపర్లు దిద్దుకుంటూంది.

మూడవది జ్యోతి. పుస్తకాలు ముందెట్టుకొని లెక్కల్తో కుస్తీపడుతూంది. ఇంటర్ ఫైనల్ చదువుతూంది.

గడపవారగా కూర్చొని బియ్యం ఏరుతూ ఓరకంట ముగ్గురు ఆడపిల్లల్ని పరికించిన వర్ధనమ్మ గుండెలు గుబులు గుబులుగ మూలాయి.

పెద్దకూతురు రమణికి ఇరవైఐదు

వెళ్ళి ఇరవైఅరు వస్తున్నాయి. ఒక ప్రైవేటు కంపెనీలో టైపిస్ట్ కమ్ క్లర్క్‌గ పనిచేస్తోంది. రెండేళ్ళుగా దాని పెళ్ళి చెయ్యాలని తాపత్రయపడుతూంది. అయినవాళ్ళందర్నీ అడుగుతూంది ఎక్కడైనా మంచి సంబంధం వుంటే చెప్పమని.

అయినా యింతవరకు కుదరలేదు.

డబ్బుమూట చేతిలో పట్టుకుంటే కుదురుతుంది.

కాని అంత డబ్బు తనదగ్గరలేదు.

రెండోది జయ. వచ్చే భాద్రప దానికి దానికి ఇరవైమూడు వెళతాయి. బియిడి ట్రయినింగ్ పూర్తిచేసి గవర్నమెంటు ఉద్యోగంకోసం ప్రయత్నంచేస్తోంది. కాని ఇంతవరకు మోక్షంలేదు. ప్రస్తుతం ఒక ప్రైవేటు హైస్కూల్లో పని చేస్తోంది.

రమణి కంటె జయ అందంగా వుంటుంది.

చామనఛాయలో వున్నా బొమ్మలా కళ్ళు తిప్పకోలేని అందం దానిది.

పోనీ దానికి కుదిరినా చేసేద్దాం అని తాపత్రయపడుతూంది తను.

పాతిక యిస్తారా? ముప్పై యిస్తారా? లాంఛనాలు ఎలా జరిపిస్తారు? ఆడపడుచుకట్నం ఎంత....? అని అడుగుతున్నారు తప్పించి, పిల్ల అందచందాలు, గుణగణాలు గురించి అడగటంలేదు.

పై ఇద్దరికీ గతిలేదు.

ఇంక మూడవదాని గురించి ఏం ఆలోచిస్తుంది?

ఆరు సంవత్సరాల క్రితం తన భర్త హఠాత్తుగా మరణించాడు.

భర్త బ్రతికున్న రోజుల్లోకూడా వైభవాలు అనుభవించిందేం లేదు. అంతా అతుకుల జీవితమే.

కాని ఎందుకో.....ముగ్గురూ ఆడపిల్లలే అయినా భయం అనిపించేదికాదు.

"ఏదో ఒక విధంగా ఆడపిల్లల పెళ్ళిళ్ళుచేసి పంపించలేమా?" అనుకునేది.

కాని భర్త గతించాక ఆడపిల్లలు గుండెలమీద కుంపట్ల లాగ అనిపిస్తున్నారు.

వాళ్ల పెళ్లి గురించి ఆలోచిస్తే నిద్ర పట్టటంలేదు.

రోజులు బాగుండలేదు.

దెబ్బతిన్న ప్రాణం కావటంతో ప్రతిక్షణం ఎలా వుంటుందో అన్న బెంగ.

పైగా తన కూతుళ్ళు చదువుకుని ఉద్యోగాలు చేస్తున్నారు.

వాళ్ళ బ్రతుకు వాళ్ళు బ్రతుకుతున్నా లోకానికి కన్నెర్రగానేవుంది.

# శిలలో శిల్పం

"వర్ధనమ్మ కూతుళ్ళు గుర్రాల్లా ఎదిగారు. ఇంకా పెళ్లిళ్లు ఎప్పుడు చేస్తుందో" అని యిరుగుపొరుగు చెవులు కొరుక్కుంటున్నారు.

"వర్ధనమ్మా! నీకు తిండెల్లా సయిస్తోంది? నిద్రెల్లా పడుతూంది?" అని హేళనగా ఎకసెక్కాలాడుతున్నారు.

ఇంతకుముందు అంటే నాలుగు నెల్ల క్రితం కోవెల ప్రక్కన మెరకవీధిలో ఒక చిన్న ఇంట్లో అద్దెకి వుండేవారు. తన భర్త బ్రతికివున్న రోజుల్లో కంపెనీ క్వార్టర్సులో హాయిగా వుండేవారు.

కాని ఆయన గతించాక ఆ క్వార్టర్సు ఖాళీ చెయ్యాల్సి వచ్చింది. అందుకని క్వార్టర్సు కంపెనీకి అప్పగించి ఆ మెరక వీధిలో అద్దెకి దిగారు.

నాలుగు సంవత్సరాలపాటు ఆ ఇంట్లో బాగానే వున్నారు. కాని వున్నట్టుండి ఆ ఇంటి గలాయన ఇల్లు ఖాళీ చెయ్యమన్నాడు.

ఇంటికి రిపేర్లు చేయించి రీమాడలింగ్ చేయిస్తాట్ట. అందుకని ఆ ఇల్లు ఖాళీ చేసి గాంధీబొమ్మవీధిలో వున్న ఈ చిన్న ఇంట్లోకి అద్దెకి వచ్చింది.

ఈ ఇంటికొచ్చాక ఒక నెల రోజులు బాగానే హాయిగా గడిచిపోయింది. మూడు నెల్లనుంచే... ఈ రౌడీ వెధవ బాధ పట్టుకొంది.

రోడ్డు చివర మలుపు దగ్గర వున్న కిళ్ళీబడ్డీలో ఎప్పుడూ కూర్చుంటాడని, ఉదయం, సాయంత్రం తను బస్సు కోసం స్టాపులో నిల్చున్నప్పుడు అలా చూస్తూ వుంటాడని, సాయంత్రాలు తన వెనకాల ఫాలో అయి ఇంటిదాకా వస్తాడని జయ చెప్పినప్పుడే మనసు కీడు శంకించింది.

తరువాత సాయంత్రాలు కనుచీకట్లు ముసిరే వేళ ఇంటిముందు కాపుకాసినట్టు హాజరవ్వటం మొదలుపెట్టాడు.

దాంతో వర్ధనమ్మ గుండెల్లో రైళ్ళు పరిగెట్టటం మొదలెట్టాయి.

పోనీ ఇల్లు మారుద్దామా అంటే....

అద్దెకి ఇల్లు ఓ పట్టాన దొరుకుతుందా?

ఆ రౌడీవెధవకి జయ పనిచేసే స్కూలు తెలుసు. అలాగే రమణి పని చేసే ఆఫీసు, జ్యోతి చదివే కాలేజీ కూడా తెలిసే వుంటాయి.

ఒకవేళ తెలియకపోయినా పనిగట్టుకొని ఈపాటికి తెల్సుకొనేవుంటాడు.

ఆలోచనలమధ్య కొట్టుకొనిపోతున్న వర్ధనమ్మ "అమ్మా" అన్న కూతురు పిలుపుకి వులిక్కిపడింది.

"ఏంటమ్మా! బియ్యం అన్ని గుప్పెళ్ళతో కింద పోస్తున్నావ్?" అంటూ కూతురు జ్యోతి పకపకా నవ్వుతుంటే వర్ధనమ్మ తబ్బిబ్బుపడింది.

"అయ్యయ్యో! ఏవిటో చూసుకోలేదే!" అంటూ నేలమీద చిలికిన బియ్యం ఎత్తి చాట పట్టుకొని వంటగదిలోకి వచ్చి వంట పనిలో నిమగ్నం అయ్యింది. ఆ రౌడీవెధవ బారినుంచి ఎలా బయటపడాలా అన్న ఆలోచన మాత్రం వదల్లేదు.

** ** ** ** ** **

చూస్తూ వుండగానే మరో నాలుగు రోజులు గడిచిపొయ్యాయి.

ఆ రౌడీ ఇంటిముందు సాయంత్రాలు హాజరు వేసుకోవటం మాత్రం మానలేదు.



శ్రీమతి కాకాని కమల

'శిలలో శిల్పం' కథానిక రచయిత్రి శ్రీమతి కాకాని కమల ఆంధ్ర సచిత్ర వార పత్రిక పాఠకులకు అన్ని వీక్లీలకు సుపరిచితురాలే! వీరు తనను పరిచయం చేసుకుంటూ-

"నన్ను ఒక రచయిత్రిగ నిలబెట్టింది, నా రచనలకి ఒక గుర్తింపు నిచ్చింది నా ప్రియమైన ఆంధ్ర సచిత్ర వార పత్రిక. అందుకని ఆంధ్రపత్రిక వీక్లీకి నేనెంతైన ఋణ పడి వున్నాను. ఎక్కువగా కథలు వ్రాయటం, మంచి సబ్జెక్ట్ దొరికినప్పుడు నవల వ్రాయటం నా కిష్టం. టూనా ఆంధ్ర సచిత్ర వార పత్రికలకి నా కృతజ్ఞతలు" అని మాత్రం రాశారు. అవును వారు అందరికీ తెల్సుగా.

ఆరోజు ఆదివారం

వర్ధనమ్మ చిన్న పిండివంటతో తిరిగ్గా వంట చేసింది

అంతా కల్సి సరదాగా భోజనాలు చేసి విశ్రాంతిగా పడుకొని కబుర్లు చెప్పుకొంటున్నారు

టైము మధ్యాహ్నం రెండు దాటుతూంది

సరిగ్గా ఆ సమయంలో వీధి తలుపులమీద టకటక శబ్దం అయ్యింది

ఆఖరి పిల్ల జ్యోతి ఛంగున లేడిలా దూకుతూ వెళ్లి తలుపు తీసింది

పోతపోసిన రాతి విగ్రహంలా గడప అవతల నిల్చున్న వ్యక్తిని చూస్తూనే కెవ్వున కేకపెట్టి "అమ్మా " అంటూ లోపలికి పరిగెత్తుకొని వచ్చింది

ఆ కేకకి అదిరిపడిన వర్ధనమ్మ, "ఏమయిందే తల్లీ" అంటూ గభాల్న వీధి వసారాలోకి వచ్చింది

ఖంగారుతో జయ, రమణి తల్లిని అనుసరించారు

బెదిరిన గొడ్డులా లోపలికి పరిగెత్తి వస్తున్న జ్యోతి ఒళ్ళంతా చెమట పట్టేసింది మనిషి గజగజా వణికిపోతూంది

ఎదురుగా

గడప దగ్గర నిల్చున్న ఆ రౌడీ వెధవని చూడగానే కూతురు ఎందుకు కేకలు పెడుతోందో వర్ధనమ్మకి అర్థం అయిపోయింది

"ఓరి భగవంతుడా! తను అనుకొన్నంత అయ్యింది వీడు సరాసరి తన ఇంట్లోకే వచ్చేశాడు " అనుకోగానే వర్ధనమ్మలో రోషం ఎగజిమ్మింది

ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది

మూలనున్న చీపురు అందుకుని దూకుడుగా ముందుకి వెళుతూ నోరంతా తెరిచి గట్టిగా ఏదో అరవబోయింది.

కాని .

భయంతో గొంతు పిడచకట్టుకొనిపోయింది

అది గమనించిన ఆ రౌడీ "భయం లేదు" అన్నట్లు చేతుల్తో సైగచేస్తు గడప దాటి గదిలోపలికి వచ్చాడు

అభ్యర్ధనగా రెండు చేతులు జోడించి వర్ధనమ్మకేసి చూస్తూ - "అమ్మా! మీరు నాగురించి అనవసరంగా భయపడకండి నావల్ల మీకు ఎలాంటి కీడు జరగదు" అన్నాడు.

గగన తలంలో నీలినీలి మబ్బుల్లోంచి అదృశ్యంగా దేముని మాటలు వినిపిస్తున్నట్లు

## మళ్లీ సినిమాల్లోకి ముంతాజ్



పదహారు సంవత్సరాల తర్వాత మళ్లీ చిత్రరంగంలోకి అడుగుపెడుతోంది ముంతాజ్. పహ్లాజ్ నిహ్లానీ నిర్మిస్తున్న 'ఆందియన్' చిత్రంలో సెక్సీగా నటించిందట, అదీ కొడుకుని వెంటేసుకొని పార్కులో పాటపాడుతూ. ఇది ఎబ్బెట్టుగా వుందని అనటంతో నిహ్లానీ కొద్దిగా మార్పు చేశాడట. ఆ చిత్రం ఏ మాత్రం విజయవంతం అవుతుందో మరి!

అతను ఆ మాటలు పలుకుతున్నప్పుడు ఆ గదిలో సూది కిందపడితే వినిపించేటంతటి నిశ్శబ్దం ఆవరించింది

"అమ్మ" అన్న అతని పిలుపు ప్రపంచంలోని మమకారాన్నంత వడగట్టినట్లు అనుభూతి రగిలించింది

కరుకుదేలిన నల్లరాయిలాంటి అతని మొరటు రూపంలోంచి అంతటి తియ్యదనం వినిపిస్తుంటే ఖంగుతిన్నట్లు అప్రతిభులయిపోయ్యారు

అంతలోనే -

అతడు వెళ్లి రెండు అడుగులు ముందుకి వేసి గదిమధ్యకి వర్ధనమ్మకి నాలుగ్గజాల దూరంలోకి వచ్చి నిల్చున్నాడు

ప్రాధేయ పూర్వకమైన దృక్కులతో వర్ధనమ్మకేసి చూస్తూ-

"అమ్మా! నా రూపాన్ని నా ప్రవర్తన్ని చూసి మీరు భయపడటం సహజమే నిజంగానే నేను ఈ పేట రౌడీని కానీ నావల్ల మీకు ఏకీడు జరగదు చాతనయితే మీకు మేలు చెయ్యాలన్నదే నా తాపత్రయం నాకూ తల్లి-చెల్లి అనే బంధాలు తెలుసు ముందు భయం లేకుండా నేను చెప్పేది సావధానంగా వినండి " అభ్యర్ధిస్తున్నట్లు చేతులు జోడించాడు

వర్ధనమ్మకి కాస్త వూపిరి వచ్చినట్లు అయ్యింది

"అబ్బే భయపడటం లేదు నాయనా! ఏదో చిన్న పిల్లకదా ఇంతకీ నీ పేరేమిటి బాబూ!" అంది కాస్త నిబ్బరం తెచ్చుకుంటు

తల్లి వెనకచాటుగా నక్కిన ఆడపిల్లలకి కూడా కాస్త ధైర్యం వచ్చినట్లు అయ్యింది

బిగుసుకున్న ముఖాల్ని కాస్త సడలించారు

"ఇంతకీ నీ పేరు " వర్ధనమ్మ అడిగింది

"నా పేరు గంగాధరం అమ్మా! కాని ఒకప్పటి నా అసలు పేరు అది ఇప్పుడు నా పేరు గంగులు పేట రౌడీ గంగులు "

వర్ధనమ్మ చూపులు తేలిపొయ్యాయి నాలిక తడబడింది

"అ అలాగా కాని ఈ రౌడీ "

గంగులు చిన్నగా నవ్వాడు

"అది చెప్పటానికే వచ్చాను తల్లీ నా కథ వినేముందు మీరు ఈ ఫొటోలు చూడండి " అంటూ ఒకసారి జయకేసి అభిమానంగా చూసి జేబులోంచి ఒక చిన్న కవరు తీసి వర్ధనమ్మకి అందించాడు

అదుపు తప్పుతున్న గుండె వేగాన్ని సముదాయించుకుంటు వర్ధనమ్మ కవరు విప్పి అందులోని ఫొటోలని బయటకి తీసింది

"హాయ్! అవన్ని నా ఫొటోలు" అంది జయ వుత్సాహంగా

వర్ధనమ్మ ముఖం వెలాతెలా బోయింది

అవును

అవన్ని జయ ఫొటోలు

ఆఫ్ శారీలో ఆకుచాటు పిందెలా అందంగా వయ్యారాలు పోతున్న జయ ఫొటోలు రంగురంగుల్లో వివిధ భంగిమల్లో

వర్ధనమ్మ ఎర్రబడుతున్న కళ్ళతో

చివ్వున తల ఎత్తింది.

"ఇ...ఇవన్ని మా.... అమ్మాయి ఫోటోలు. నీ.... దగ్గరకి ఎలా వచ్చాయ్?" కసురుతున్నట్లు అడిగింది.

గంగులు చిరునవ్వు నవ్వాడు.

"ఇంకొకసారి జాగ్రత్తగా చూడండమ్మా. అవన్ని మీ అమ్మాయి ఫొటోలా?"

వర్ధనమ్మ కళ్లు చికిలించి మళ్ళీ ఒక సారి తేరిపార ఫొటోలకేసి చూసి కూతుళ్ళకి అందించింది.

"అబ్బే! సందేహం లేదు బాబూ! ఇవ్వి మా అమ్మాయి ఫొటోలే" అంది.

"చెల్లెమ్మా! నువ్వు చూడు తల్లి" అన్నాడు గంగులు జయకేసి చూస్తూ. జయ ముందుకి వెనక్కి ఆ ఫొటోలని తిరగేసి చూస్తూ- "అవును. ఇవి అచ్చంగ నా ఫొటోలే. కాని.... ఈ డ్రెస్.... నాదికాదు. అసలు ఈ ఫోజుల్లో నేను ఎప్పుడూ ఫొటోలు తీసుకోలేదు. నాకసలు డాన్సు రాదు" అంది గంగులు కేసి కోపంగా చూస్తు.

గంగులు మళ్ళీ వేదాంతిలా చిరునవ్వు నవ్వాడు.

వర్ధనమ్మ కేసి తిరిగి "అవునమ్మా! ఆ బట్టలేకాదు. ఆ అమ్మాయి కూడా మీ అమ్మాయి కాదు. అది నా చెల్లెలు తులసి...."

"........" తల్లికూతుళ్ళు ఒక్కసారే ఆశ్చర్యపొయ్యారు.

"ఆ.... నిజంగానా?" అన్నారు విభ్రాంతిగా.

"నిజంగానే తల్లి. ఆ ఫొటోలన్ని సాక్షాత్తూ నా బంగారు చెల్లి తులసివి.

# శిలలో శిల్పం

అది చదువుకున్న స్కూల్లో డాన్సు నేర్పించేవారు. నా చెల్లెలు అందాలభరిణి అని ముచ్చటపడి వాళ్ళ డాన్సు టీచరు కోరి కోరి మా తులసికి డాన్సు నేర్పించింది. అప్పుడు తీసుకున్న ఫొటోలే అవ్వి...."

"అలాగా? మరి ఇప్పుడు నీ చెల్లెలు ఎక్కడుంది?"

తల అటు ఇటు కదిలిస్తు "అది...ఇప్పుడు లేదమ్మా. అది వుంటే నేను ఇలా అయ్యేవాడినే కాదు. గంగాధరం పేరుతో గౌరవంగా బ్రతికేవాడ్ని."

అయోమయంగా చూసింది వర్ధనమ్మ.

"అదేమిటి?"

"అది చెప్పాలనే వచ్చాను తల్లి. నాకు వూహలు తెలిసే వయసుకే మా నాన్న చనిపొయ్యాడు. పొలంలో కూలిపన్లు చేస్తూ మా అమ్మే రెక్కలు విరుచుకొని నన్ను చెల్లిని పెంచి పెద్ద చేసింది. అప్పుడు నేను ఇంటరు చదువుకొనేవాడ్ని. చెల్లి పదవతరగతిలోకి వచ్చింది. మేం ఊరిచివర ఒక గుడిసె వేసుకొని వుండేవాళ్ళం. చెల్లి అందం ఎలాంటి వారినీ అట్టే నిలబెట్టేది. కాని.... దాని అందమే దాని బ్రతుక్కి శాపమైపోయింది. అమ్మగారూ! దాని జీవితాన్ని బలితీసుకుంది. దానిమీద కన్నేసిన కొంతమంది ధనవంతుల అబ్బాయిలు, మా పేదరికాన్ని లోకువగా తీసుకొని, పొంచి అవకాశం చేజిక్కించుకొని దాని బ్రతుకుని కాలరాసేశారు. చిరుతపులి వాతపడ్డ జింక పిల్లలాంటి దాని శవాన్ని పోలీసులు రెండు రోజుల తరువాత మా గుడిసె ముందు పడేశారు. డబ్బు పలుకుబడి లేనివాళ్ళం దాని శవాన్ని చూసి ఏడవటం తప్పించి ఏమి చెయ్యలేక పొయ్యాం. అమ్మకి చెల్లి అంటే ప్రాణం. దాని హఠాత్ మరణం చూసి తట్టుకోలేని అమ్మకి మతిభ్రమించింది. ఇప్పుడు మా అమ్మ పిచ్చాసుపత్రిలో వుందమ్మగారూ...."

"అయ్యో" అంది వర్ధనమ్మ.

"నేను.... ఆరోజుల్లో ఎంతో మృదువుగా, సాత్వికంగా వుండేవాడిని.

కాని చెల్లి మరణం, అమ్మ అనారోగ్యం... నాలో ఏమయ్యిందో తెలియదు. నాలో మృదుత్వం చచ్చిపోయింది. చదువుమీద ఆసక్తి నశించిపోయింది.

మెత్తటి వెన్నపూసలాంటి నా మనసు కరుకురాతి శిలగా మారిపోయింది. దాంతో పాటు నా రూపాన్ని మార్చుకున్నాను.

మెత్తటివాడ్ని కత్తిలాగ అయ్యాను.

ఇదివరకు కంటే ఇప్పుడు నా జీవితం బాగుంది.

అందరూ నన్ను చూసి భయపడతారు.

ఒంగి ఒంగి సలాము చేస్తారు.

అడగకుండానే నా అవసరాలు చూస్తారు. ఈనాములు ముట్టచెపుతారు. ఇదివరకు డబ్బిచ్చినా కసురుకొంటు సరుకులు ఇచ్చే షావుకారు ఇప్పుడు "డబ్బు దేముంది" అంటు ఇంటికే సరుకులు పంపుతాడు.

బండబారిన మనసులోంచి బ్రతుకుతెరువు నేర్చుకొన్నాను.

కాని.....మా అమ్మ చెల్లిపోయిన దిగులుతో ఆవిడ మంచం పట్టేసింది. మతిస్థిమితం తప్పిన ఆవిడపై డాక్టర్ల వైద్యం పనిచెయ్యటంలేదు...." గంగులు కంఠం రుద్ధం అయిపోయింది. రెండు చేతుల్తో ముఖం దాచుకొంటు శక్తి లేనివాడిలా గభాల్న నేలమీద కూర్చుండిపొయ్యాడు.

అంతవరకు అతను చెప్పున్నది వింటు వూపిరి విడవటం కూడా మర్చిపోయి బొమ్మల్లా వుండిపోయిన వర్ధనమ్మ, కూతుళ్ళల్లో చలనం వచ్చింది.

"అయ్యయ్యో! ఏడవకు బాబూ" అంటూ వర్ధనమ్మ అతడికి కాస్త దగ్గరగా వచ్చి ఓదారుస్తున్నట్టు చెప్పింది.

గంగులు దుఃఖాన్ని అదుముకొంటూ "అమ్మా! నాలుగునెల్ల క్రితం బస్సుస్టాపు దగ్గర మీ అమ్మాయిని చూశాను. చచ్చిపోయిన నా చెల్లెలే ఆ అమ్మాయో లేక ఆ అమ్మాయే నా చెల్లెలో... అర్థంకాని భ్రమతో వెంబడించాను. మనిషిని పోలిన



## అనిల్‌పట్ల మాధురి విముఖత

మాధురీదీక్షిత్ యిటీవల అనిల్ కపూర్ పట్ల విముఖత చూపుతోంది. అమీర్‌ఖాన్‌తో నటిస్తున్నంత ఫ్రీగా అనిల్‌కపూర్‌తో నటించటం లేదట. అమీర్‌తో నా జోడీ సరితూగుతుందికాని అనిల్ జోడీ సరిపోదంటోంది. పాతొక రోత కొత్తొక వింత అని అందుకే అన్నారు కాబోలు. ఈ విముఖతకి కారణం అనిల్- శిల్పా శిరోద్కర్ అంటే యిష్టపడు తున్నాడు. అందుకే మాధురి- అనిల్ అంటే విముఖత చూపుతోందేమో?!

మనిషి వుంటాడంటారు. సృష్టిలో ఒక పోలికల్తో వున్న మనుష్యుల్ని ఏడుగుర్ని సృష్టిస్తాడుట భగవంతుడు. మీ అమ్మాయిని చూశాక ఆ మాట ఎంత నిజమో తెల్సివచ్చింది. ముఖ్యంగా దిగులుతో మంచం పట్టిన మా అమ్మ కళ్లముందు ఒక్కసారి మీ అమ్మాయిని నించోపెడితే మా అమ్మకి తప్పకుండా జబ్బు తిరుగుముఖం పడుతుందన్న ఆశ నాలో రోజు రోజుకి ఎక్కువైపోతూంది. మీ కుటుంబం గురించి వివరాలన్ని తెలుసుకొన్నాను. మగదిక్కు లేకుండా ఒంటరిగా వుంటున్నారని తెల్సి జాలిపడ్డాను. ఇవాళ కాకపోతే రేపయినా ఏదో ఒక నాడు ఈలోకం మీకు కీడుచేస్తుందన్న భయం నాది. నా రక్షణ మీకు వుంటే మంచిదని తాపత్రయ పడుతున్నాను. ఆ కిళ్లీబడ్డీ దగ్గర పోకిరికుర్రాళ్లు నిల్చుని రోజు బస్సుస్టాపుకి వచ్చే మీ అమ్మాయి గురించి అవాకులు చవాకులు విసురుకోవటం నాకు తెల్సు. ఇప్పటికే ఒక చెల్లిని పోగొట్టుకొన్నాను. ఇంకో చెల్లిని కూడా పోగొట్టుకోలేను తల్లి. నా మాట నమ్మండి....." అన్నాడు.

"అయ్యో ఎంత మాట నాయనా! ఈరోజుల్లో కూడా నీలాంటివాళ్లు వున్నారనుకుంటేనే ఆశ్చర్యంగా వుంది" అంది వర్ధనమ్మ.

"అమ్మగారూ! ఇంతకీ నేను మీ ఇంటికి వచ్చిన కారణం అసలు చెప్పనే లేదు. కాదనకుండా మీరు నాకు ఒక సహాయం చెయ్యాలి. ఆ తరువాత మీకు ఇష్టం వుంటే మీ ఇంటికి వస్తాను. లేకపోతే ఈ ఛాయలకి కూడా రాను. మృత్యుముఖంలో వున్న నా తల్లిమీద, చచ్చిపోయిన నా చెల్లిమీద ఆనగా చెప్తున్నాను. దయవుంచి ఒక్కసారి నావెంట ఆసుపత్రికి మీ అమ్మాయిని పంపండి. కడతేరిపోతున్న ఒక వృద్ధురాలి ప్రాణాన్ని కాపాడండి. దయవుంచి కాదనకండి." గంగులు వొంగి వర్ధనమ్మ పాదాలమీద చెయ్యి వెయ్యబోయ్యాడు.

వర్ధనమ్మ ఖంగారుతో గభాల్న కాళ్లు వెనక్కి తీసుకొంది. మళ్లీ గంగులే అన్నాడు "ఇప్పుడు నాకు ఈ లోకంలో నా అనుకొన్న బంధం మా అమ్మ ఒక్కర్తే. డాక్టర్లు శారీరక అనారోగ్యం ఏది లేదని, మానసికంగా ఆవిడ దెబ్బతిందని, పోయిన కూతురు కళ్లబడితేగాని కోలుకోదని అది అసాధ్యం గనక ఇంటికి తీసుకెళ్లి పొమ్మని చెప్పారు. చచ్చిపోయిన చెల్లిని నేను ఎలాగూ తేలేను. అందుకే నాలుగునెల్లుగా మీ అమ్మాయితో పరిచయం చేసుకోవాలని, మిమ్మల్ని ఒప్పించి ఎలాగైనా ఒక్కసారి మీ అమ్మాయిని మా అమ్మ కళ్లముందు నిల్చోపెట్టాలని తాపత్రయపడుతున్నాను. మీ అమ్మాయిని చూస్తే మా అమ్మ తప్పకుండా కోలుకుంటుంది...."

"అలాగా?" వర్ధనమ్మ చిత్రంగా బుగ్గలు నొక్కుకుంది.

"అవునమ్మా. అందాక దయవుంచి ఒక్కసారి మీ అమ్మాయిని నావెంట ఆసుపత్రికి..." గంగులు నీళ్లు నిండిన కళ్ళతో తల్లి ఆరోగ్యం కోసం తపిస్తున్న వాడిలా రెండు చేతులు జోడించాడు.

మనిషిని రూపాన్ని బట్టి కాక స్వభావాన్ని అంచనా వెయ్యగలగటమే అసలైన వివేకం.

నల్లనివన్ని నీళ్ళు, తెల్లనివన్ని పాలు అనుకుంటే పొరపాటేనేమో!

బండరాళ్లు శిలలుగా వున్నప్పుడు వికృతంగానే కనిపిస్తాయి. కాని మంచి నైపుణ్యం గల శిల్పి చేతిలో అవి అందమైన శిల్పాలుగ ఆకృతులు దాలుస్తాయి. రసహృదయుల ప్రశంసలు పూజలు అందుకొంటాయి.

సంఘం అనే శిల్పి చేతిలో మనిషి జీవితం కూడా అంతే!

సమాజం గంగులు రూపాన్ని వికృతంగా మార్చింది. సుకుమారమైన అతని మనసుని బండబారేలా చేసింది. కాని ఆ బండలోను కారుణ్యం ఇంకా ఇంకిపోలేదు. మనసు మమత ఇగిరిపోలేదు. అందుకే తల్లికోసం , చనిపోయిన చెల్లికోసం బాధ పడుతున్నాడు."

మనసు స్పందిస్తుంటే జాలిగా చూసింది వర్ధనమ్మ.

అప్పటికే జయ గంగులు దగ్గరగా వచ్చి "అమ్మని చూడటానికి హాస్పటల్‌కి వెడదాం పదన్నయ్యా" అంది అభిమానంగా.

గంగులు కళ్ళల్లో మెరుపులు మెరిశాయి.

"అమ్మా....తు....చెల్లెమ్మా....జయా" అన్నాడు.

"అవును గంగాధర్. పద నేనూ వస్తాను" అంది వర్ధనమ్మ చెమ్మగిల్లిన కళ్ళు ఒత్తుకుంటూ.

చనిపోయిన చెల్లి తిరిగి వచ్చినంత ఆనందంగా గంగులు లేచి ఉద్వేగంగా ఆసుపత్రివైపు అడుగులు వేశాడు.

●



సీరియల్

# సూపర్ హీరో



మన్నెం శారద

(గత సంచిక తరువాయి)

సుధీర్ పెళ్లి రాయుడి చెల్లెలు కూతురితో ఘనంగా జరిగి పోయింది. పెళ్లికి వెళ్లి ఇంటి దారి పట్టేడు శ్యామసుందర్.

అతని మనసంతా కల్లోల సాగరంలా వుంది.

మనిషి ఆయుషు నూరేళ్లే! అదీ పూర్తిగా బ్రతుకుతామన్న గ్యారంటీ లేదు. రోడ్డు మీద కొస్తే ఇంటివరకూ వెళ్లే నమ్మకంలేదు. ఎటు చూసినా ఏక్సిడెంట్సు, అల్లర్లు, తపానులు, – మనిషి చావుకి దోహదం చేసే ఎన్నో అరాచకాలు జరుగుతున్నప్పటికీ మనిషి విరక్తోన్ముఖుడు కావాల్సింది పోయి అత్యంత స్వార్ధపరుడై పోతున్నాడు. ధనదాహం, పదవీ దాహంతో పిచ్చెక్కి పోతున్నాడు. తమ స్వలాభాల కోసం ఇతరుల శవాలపై నుండి నడుస్తున్నాడు. ఆత్మని చంపేసుకొని ఆనంద పడుతున్నాడు. సృష్టిలో మస్తిష్కమున్న ఒక్క మనిషి తప్ప మిగతా ప్రాణికోటి అంతా తమ ధర్మానుసారమే నడుస్తున్నాయి. మనిషి మాత్రం ఎంత వున్నా సంతృప్తి అనే తీరం లేని అగాధంలా తయారయి అరిషడ్వర్గాలతో అలమటించి ఛస్తున్నాడు.

సుధీర్!

ఎంత అమాయకంగా సిటీకొచ్చి ఏమీతెలీని దమయంతిని ప్రేమ పేరుతో వంచించి ఆమెని నిచ్చెనగా చేసుకొని అందలమెక్కి పోయేడు!

దమయంతి బ్రతుకుని అల్లరి చేసి ఆత్మహత్య చేసుకునేలా చేసేడు. ఈ రోజు అతనిలో ఏ మాత్రం మనిషి అంశ లేశమాత్రమున్నా దమయంతి గుర్తొచ్చి వుండేది! పాప భీతితో అతను నిలువెల్లా వణికి పోయి వుండేవాడు. ఈ రోజు మనిషికి దేవుడంటే నమ్మకమూ లేదు. దయ్యమంటే భయమూ లేదు. అవును. మనిషికన్నా భయంకరమైంది కాదు దయ్యం!

అతను బాధ సహించలేక రోడ్డు మీద కనిపించి, బార్‌లోకి వెళ్లి ఓ టేబుల్ దగ్గర కూర్చుని విస్కీ ఆర్డర్ చేసేడు. అతని కెదురుగా కూర్చున్న వ్యక్తి అప్పుడే రెండు రౌండ్లు లాగించేసి తూలుతున్నాడు.

శ్యామసుందర్ ఏదో జ్ఞాపక మొచ్చిన వాడిలా తుళ్లిపడి అతన్ని పట్టి చూశాడు.

'అవును! సందేహం లేదు. అతను అతనే!'

వెంటనే శ్యామసుందర్ అతన్ని పలుకరిస్తూ "నమస్కారం సార్! బాగున్నారా?" అన్నాడు చనువుగా.

అతను మూసుకు పోతున్న కళ్లని తెరచి చూస్తూ "ఎవరు మీరు?" అన్నాడు మత్తుగా.

"నన్నే మరచి పోయారా! ఇదే బార్‌లో ఎన్నిసార్లు కలిసి తాగేం! తమది అనకాపల్లి కదా! బెల్లం అమ్ముడయి పోయిందేంటిలా వచ్చేరు!" అన్నాడు శ్యామసుందర్ చనువు నటిస్తూ.

ఇంతలో బేరర్ విస్కీ తెచ్చి పెట్టేడు. అది కూడ ఎదుటి వ్యక్తికి ఆఫర్ చేసి "తీసుకోండి సర్!" అన్నాడు.

"ఇంతకు.... మించి వద్దు సర్! నిజం మాట్లాడేస్తాను" అన్నాడతను ఏడుపు గొంతుతో.

శ్యామసుందర్ కళ్లు తళుక్కున మెరిసేయి.

"నిజం మాట్లాడకుండా దాచుకుంటే అది కేన్సర్ లానో, టి.బి. లానో గుండెని తినేస్తుంది. అవుట్‌లెట్ లేకపోతే మనిషి బతకలేడు. మీ కంత భయమేస్తే పదండి, మన రూమ్ కెళ్లి మాట్లాడుకుందాం!" అన్నాడు శ్యామసుందర్ లేచి నిలబడుతూ.

"మన... రూమా?" అన్నాడతను సందేహంగా చూస్తూ.

"అవును. మన రూమే! ఇది వరకెన్ని సార్లు మనిద్దరం అక్కడ తాగలేదూ!" అన్నాడతను అనకాపల్లి ఆగంతకుణ్ని లేవదీస్తూ.

"అవునవును. తాగే వుంటాం" అంటూ లేచి శ్యామసుందర్ భుజమ్మీద చెయ్యేసేడతను.

శ్యామసుందర్ అదే బార్‌లో ఓ ఆఫ్ బ్రాంది తీసుకొని ఆటోలో అతనితో పాటు ఇల్లు చేరుకున్నాడు.

అతన్ని కుర్చీలో కూర్చోపెట్టి తలుపులు మూసి రెండు గ్లాసుల్లో బ్రాంది వంచి నీళ్లు కలపబోతుంటే "నీళ్లొద్దు. నాకు రా కావాలి!లేకపోతే నా గుండె మండి పోతుంది" అన్నాడతను బ్రాంది గ్లాసు లాక్కుంటూ.

"సరే! తీసుకోండి. మీరు సుధీర్ పెళ్లి కొచ్చేరనుకుంటాను" అంటూ ఛియర్స్ చెప్పి తన గ్లాసందు కొన్నాడు శ్యామసుందర్.

"ఆఁ! ఆ లం.... కొడుకు పెళ్లికే వచ్చేను. అది దినానికున్నాడ వస్తాను బతికుంటే!" అన్నాడతను కక్షగా.

"ష్! వాడు హోం మినిష్టరు చుట్టం. వాడితో పెట్టుకోకండి" అన్నాడు శ్యామసుందర్ హెచ్చరిస్తున్నట్టుగా. అప్పటికే అతను సోఫా వెనుక ఆన్ చేసిన టేప్ తిరుగుతోంది.

"వాడూ.... అదే మాటన్నాడు. ముట్టుకోకుండా మర్డర్ చేయించేస్తాడంట! కొట్టకుండానే బొమికలు పిండి చేసి జల్లెడ పట్టించేస్తాడట! ఏం చేసేనని! వీడు చెప్పినట్టు చేస్తే మూడు లక్షలిస్తానని ఒప్పుకొన్నాడు. ఆ చచ్చింది గతిలేక నన్నే పెళ్లి చేసుకొంటుందని చెప్పేడు. ఇప్పుడు పవర్ చూసుకొని 'ఛీ' పొమ్మన్నాడు" అన్నాడు

ఇంతవరకూ సాగిన కథ–20:– ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నిఖిలేశ్వరి తనకొడుకు విజయేంద్రకు చిత్రసీమలో వస్తున్న పేరు ప్రఖ్యాతులకు ఆనందిస్తుంటుంది. వ్యభిచార నేరం క్రింద అరెస్టు చేయబడిన దమయంతి అవమానాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకుంటుంది. బ్లూఫిల్ములు తీస్తున్నాడన్న నేరంపై విజయేంద్రను పోలీసులు అరెస్టు చేస్తారు. జైలులో కొడుకు దుస్థితిని చూసిన నిఖిలేశ్వరికి మనసు వికలమవుతుంది. విజయేంద్రను కోర్టులో హాజరుపరుస్తున్నారని తెలిసి అతని అభిమానులు తండోప తండాలుగా వస్తారు. అదిచూసిన పోలీసుకమీషనర్ గాంధీ అవాక్కయిపోతాడు.

ఉక్రోషంగా.

"తాగేసి మీరేదేదో మాట్లాడు తున్నారు. చచ్చిందెవరు?" అన్నాడు శ్యామసుందర్ రెచ్చగొడుతున్నట్టుగా.

"తాగ... బట్టే నిజ్జం చెబుతున్నాను. చెరకు డబ్బు లొచ్చినప్పుడు సిటీకి రావడం, తిరగడం నాకు మామూలే! హోటల్ రూమ్ కొచ్చిన నన్ను సినిమా ఏక్టర్ దమయంతి కావాలా అని అడిగేరు.



వస్తానంటే వద్దనడానికి నేనేం ప్రవరాఖ్యుణ్ణా! సరే నన్నాను. అప్పుడు చెప్పేరు అసలు కథ! అమ్మో అన్నాను. లక్షలిస్తాం అన్నారు. ఆశపడ్డాను. కాస్సేపు నాటకానికి కుప్పలుగా డబ్బొస్తుందంటే కాదనెలా అంటాను? అంతా జరిగి పోయింది. పాపం... ఆ... పిల్ల అన్యాయంగా... చచ్చి పోయిందని... విన్నాను.... కాదు... ఆ పిల్లని చంపేసేరు.... ట్రీట్‌మెంటు అందకుండా... చంపేసేరు.... ఇప్పుడు... నన్ను.... నన్ను.... కూడ చంపుతామని బెదరిస్తున్నారు. వాళ్ళు... అంత పనీ చేస్తారు సర్! నన్ను రక్షించండి సర్! రక్షించండి"

అనేశ్చేడు అనకాపల్లి వ్యక్తి.

"మీ పేరు?"

"వీర్రాఘవులు"

"పడుకోండి. రేపు మాట్లాడుదాం" అని లైటార్పేసేడు శ్యామసుందర్. వీర్రాఘవులు కుర్చీలో నే గురకపెట్ట సాగేడు.

శ్యామసుందర్ కిటికీ దగ్గర నిలబడి సిగరెట్టు మీద సిగరెట్టు కాలుస్తూ ఆలోచిస్తున్నాడు.

వీర్రాఘవులు చెప్పినట్టు దమయంతిని ట్రీట్‌మెంటు అందకుండా చంపేసేరా? అదే నిజమైతే ఆ డాక్టరుకి భాగం వుండి వుంటుంది. అయితే తను డాక్టర్ మీద కూడ నిఘా వేసి నిజం తెలుసుకోవాలి! వీర్రాఘవుల్ని చెయ్యి జారి పోకుండా చూసుకోవాలి.'

అతను ఆలోచనలతో సతమతమౌతుండగానే తెల్లారి పోయింది. బాగా ఎండెక్కేక వీర్రాఘవులు నిద్ర లేచేడు.

లేస్తూనే తెల్లబోతూ "నే నెక్కడున్నాను? మీరెవరు?" అనడిగేడు శ్యామసుందర్ని చూస్తూనే.

శ్యామసుందర్ బదులు చెప్పకుండా టేప్‌రికార్డర్ లోని టేప్ రీవైండ్ చేసి ప్లే చేసేడు.

టేప్ వింటున్న వీర్రాఘవులి మొహం లోని రంగులు మారి పోసాగేయి. మనిషి హిమపాతం సోకినట్టు వణికి పోతూ అమాంతం శ్యామసుందర్ కాళ్ళ మీద పడిపోయి "నన్ను చంపకండి. నాకేం తెలీదు. నేనెవరితో ఏం చెప్పను. దయచేసి నన్నొ వదిలేయండి" అన్నాడు ఏడుస్తూ.

శ్యామసుందర్ అతన్ని లేవదీసి "నేను సుధీర్ మనిషిని కాను. న్యాయం తరపు మనిషిని. మిమ్మల్నేం చేయను. మీరు కూడ కొన్నాళ్ళు అజ్ఞాతంగా వుండండి. ఈ విషయాలు ఎక్కడా మాట్లాడవద్దు. సమయం వచ్చినప్పుడు పిలుస్తాను. నిజం చెప్పండి. అంత వరకూ ఈ కేసెట్ నా దగ్గర భద్రంగా వుంటుంది" అన్నాడు.

వీర్రాఘవులు తలూపి దణ్ణం పెట్టి వాళ్ళూళ్ళెళ్ళడానికి సికింద్రాబాదు స్టేషన్‌కి వెళ్ళిపోయేడు.

★ ★ ★ ★ ★ ★

"రావయ్యా మగడా! ఏం ఘనకార్యం చేసేవేంటి?" అనడిగేడు సెల్‌లోకి ప్రవేశించిన విజయేంద్రని గోడకి జేరబడి కూర్చుని కాలూపుతూ పిళ్ళై.

"అయామ్ రాకా! తర తరాల బూర్జువా సిద్ధాంతాలకి ప్రతీక మన ప్రభుత్వం. రక్తపాతంతో పాతబడిన పాకుడు సిద్ధాంతాన్ని తుడిచేయాలి! కమాన్!" అంటూ విజయేంద్రతో కరచాలనం చేసేడు రాకా.

"ప్రమోషనొచ్చిందా, ఈ సెల్‌లోకి మార్చేరు!" అన్నాడు పిళ్ళై.

విజయేంద్ర జవాబు చెప్పలేదు.

అసలు తనకేం తెలుసని తను జవాబు చెప్పగలడు?

"మాటలు రావాబే! మాట్లాడవు!" అంటూ రెట్టించేడు పిళ్ళై.

విజయేంద్ర చురుక్కు మన్నట్టుగా చూసి "కొంచెం మర్యాదగా మాట్లాడటం చాల మంచిది" అన్నాడు.

"లేకపోతే ఏం చేస్తావు?" అంటూ చెయ్యెత్తేడు పిళ్ళై. మరుక్షణమే విజయేంద్ర చెయ్యి ఇనుప పిడికిలై అతని డొక్కలో దూరింది.

"అబ్బా!" అంటూ కూలబడ్డాడు పిళ్ళై.

"అరాచకం నశించాలి. మనమంతా ఒక కుటుంబం వాళ్ళం. మనలో మనం తన్నుకో

## సూపర్ హీరో

కూడదు" అంటూ మందలించేడు రాకా.

సరిగ్గా అప్పుడే జేమ్స్ వచ్చి సెల్ దగ్గర నిలబడి "ఎలా వుంది బే! సెల్!" అన్నాడు విజయేంద్ర నుద్దేశించి.

"వీడు నా డొక్కలో గుద్దేడు ఇన్స్‌పెక్టర్!" అన్నాడు పిళ్ళై లేవడానికి ప్రయత్నిస్తూ.

"ఇంకా గుద్దుతాడు. వాడికి కరాటే వచ్చు. అందుకే వాణ్ణి తెచ్చి నీకు మొగుడిగా వేసేను. చాతనయితే నువ్వూ తన్ను" అన్నాడు జేమ్స్ వికటంగా నవ్వుతూ.

పిళ్ళై మెల్లిగా లేచి "తప్పయి పోయింది ఇన్స్‌పెక్టర్ సాబ్! నన్ను వదిలేయి" అంటూ కటకటాల దగ్గరకి నడిచి జేమ్స్ మొహాన ఖాండ్రగించి ఊసి "పోరా లం.... కొడకా! నీ బాబుకి చెప్పుకో!" అన్నాడు.

జేమ్స్‌తో పాటు విజయేంద్ర, రాకా కూడ ఆ చర్యకి విస్తుపోయేరు.

జేమ్స్ బూతులు తిట్టుకొంటూ వెళ్ళిపోయేడు.

కాస్సేపటికి పిళ్ళై గోడకి జేరబడి వెక్కి వెక్కి ఏడవ సాగేడు.

విజయేంద్ర చలించి పోయేడతని దుఃఖం చూసి.

"నొప్పిగా వుందా! రాగానే నేనేం చేసేనని నన్ను తిట్టేవు" అన్నాడు అనునయిస్తూ.

"నేనొచ్చినప్పుడూ అంతే! ఇలానే చేసేడు. మళ్ళీ ఏడుస్తాడు" అన్నాడు రాకా బాధగా.

పిళ్ళై జవాబు చెప్పలేదు. కాస్సేపటికి అతని దుఃఖం కొద్దిగా ఉపశమించింది.

ఇంతలో ఖైదీలకి భోజనం పిలుపొచ్చింది. అందరూ హాల్లో ఎవరి కంచం వాళ్ళు తీసుకొని వెళ్తున్నారు. ఒక గరిట అన్నం, ఒక చపాతి, కాస్త సాంబారు వడ్డిస్తున్నారు. వడ్డన కాగానే అందరూ తమ కంచం లోంచి అరచపాతి. కొద్దిగా అన్నం తీసి ఒక కంచంలో పెడుతున్నారు.

విజయేంద్ర ఆశ్చర్యంగా అటు చూశాడు.

ఆరడుగుల ఎత్తుగా, నల్లగా పోత పోసినట్టున్న ఒక వ్యక్తి క్రూరంగా చూస్తూ ఆ కంచం ముందు కూర్చున్నాడు.

"నువ్వూ పెట్టు. లేకపోతే చంపేస్తాడు వాడు" అంటూ చేత్తో పొడిచేడు పిళ్ళై విజయేంద్రని.

"ఎందుకు పెట్టాలి?"

"వాడు రౌడి. కొడితే చచ్చిపోతావు"

"చూద్దాం" విజయేంద్ర నిర్లక్ష్యంగా అతని ముందు నుండి వెళ్ళిపోతుంటే కాళీ కాలడ్డం పెట్టేడు.

విజయేంద్ర పడబోయి నిగ్రహించు కొని "కాలు తియ్యి, కళ్ళు కనబడటం లేదా?" అన్నాడు విసురుగా.

"కనపడబట్టే పెట్టేను. నా మామూలు పెట్టి వెళ్ళు. కొత్త!" అన్నాడు కాళీ గడ్డం సవరించుకొంటూ.

"మామూలేమిటి?"

"నీ తిండిలో సగం ఇవ్వాలి!"

"ఎందుకివ్వాలి?"

"నాతో వాదించి బతికినోడు లేడు."

"చంపేస్తావా?"

"తప్పేట్టు లేదు" అతను లేచి నిలబడ్డాడు.

మిగతా ఖైదీ లందరూ కొందరు భయంగానూ, మరి కొంత మంది కుతూహలంగానూ ఆ వాతావరణాన్ని గమనిస్తున్నారు.

"అతనితో పెట్టుకోకు. పద" అంటూ విజయేంద్ర ని హెచ్చరించాడు కానిస్టేబుల్ అదలిస్తున్నట్టుగా. విజయేంద్ర కానిస్టేబుల్ని పక్కకి నెట్టి ముందు కొచ్చి చొక్కా దులిపి ఒరగా చూశాడు. "సినిమా ఫైటింగను కొంటున్నావేమో! కాళీతో కొట్లాటంటే! గుద్దుకి మట్టి కరిచేస్తావు!" కాళీ చెయ్యి పైకెత్తి విజయేంద్ర మీద కొచ్చేడు.

విజయేంద్ర అవలీలగా అతని చేతిని పట్టుకొని మెలి తిప్పేసేడు. చూస్తుండగా అంత ఎత్తు–– ఇంత పెద్ద శరీరమున్న కాళీ మార్షల్ ఆర్ట్స్‌లో నిపుణుడైన విజయేంద్ర చేతిలో చిత్తుగా తన్నులు తిని నేల కొరిగి దణ్ణం పెట్టేసేడు. ఖైదీలంతా ఉత్సాహంగా ఈలలు వేసేరు.

విజయేంద్ర అతని జుట్టు పట్టుకొని "నీ కంచం లోని మామూలు ఎవరిది వాళ్ళ కిచ్చెయ్!" అన్నాడు.

కాళీ లేచి మెల్లిగా ఖైదీల చపాతి అన్నం ఎవరిది వాళ్ళకి పంచి పెట్టేడు. ఖైదీలంతా ఆనందంగా చప్పట్లు కొట్టేరు.

"జాగ్రత్త! నీ గుండాయిజం ఇక్కడ కాదు. ఇంకెప్పుడూ ఎవరి తిండీ అడక్కూడదు. నీ పనులు నువ్వే చేసుకోవాలి" అన్నాడు విజయేంద్ర సీరియస్‌గా.

"విజయేంద్రకి జై! సూపర్ హీరోకి జై!" అన్నారు ఖైదీలు ఉత్సాహంగా.

కాళీ గుర్రుగా చూస్తూ పక్క కెళ్ళి కూర్చున్నాడు.

"నిజంగా హీరో ననిపించు కున్నావ్ గురూ. ఈ

రోజు నుండి నేను నీకు స్నేహితుణ్ణి!" అన్నాడు విక్కీ ఆనందంగా.

"దెబ్బకి దెబ్బ. ఎవడబ్బనయినా తొంగ దీసేది! అదే మా సిద్ధాంతం!" అన్నాడు రాకా విజయేంద్ర జబ్బ చరుస్తూ.

# 31

"నాకో రెండు లక్షలు కావాలి. నీ బాబు నడిగి తీసుకురా!" అన్నాడు కరుణాకర్ అద్దంలో తల దువ్వుకొంటూ.

రజని అతని వైపు కోపంగా చూసింది.

"అంత డబ్బడిగేనని కోపమా?" దువ్వెనతో భార్య బుగ్గ మీద కొడుతూ కళ్ళెగరేసి నవ్వేడు కరుణాకర్.

రజని చిరాగ్గా అవతలికి జరిగి "డబ్బు గురించి కాదు. అంత డబ్బు అని మీరు భావించేది మా నాన్నగారు ఒక్క రోజు కట్నే పన్నుతో సమానం కాదు. కాకపోతే చిల్లర రకాల్లా నా తండ్రిని బాబు గారు అనడం మంచి పద్ధతి కాదు" అంది.

"ఓహో! తండ్రినంటే పొడుచు కొచ్చిందా! నేనీ ఇంటి అల్లుణ్ణి!" అంటూ కాలరెగ రేసేడు కరుణాకర్.

"అల్లుడి కెంత గౌరవ మిచ్చాలో మా యింట్లో అందరికీ తెలుసు. మీరేం పదే పదే గుర్తు చెయ్యనవసరం లేదు" అంది రజని చిరుకోపంతో

"నువ్వేం సుమతి శతకం వల్లించి నాకేం నీతులు చెప్ప నవసరం లేదు. నేనేం మామూలు అల్లుణ్ణి! నీ అనాకారితనం, అంధవిహీనతని కోప రూపంలో ఎక్స్ఛేంజ్ చేసుకుంటున్న నిర్భాగ్యుణ్ణి! నన్ను చూసి ఎంత మంది జాలి పడుతున్నారో తెలుసా! నేనొచ్చేవరికి డబ్బు సంగతి చూడు!" అంటూ నిర్లక్ష్యంగా మెట్లదిగి హోండా కారులో విలాసంగా వెళ్ళి పోతున్న భర్త నిబెబ్బ తిన్నట్టుగా చూసింది రజని.

డబ్బు కోసం తనకతను ఎర వేసడని పెళ్ళి జరిగిన వెంటనే గ్రహించ గల్గింది. రోజు రోజుకి అతని చర్యలు, వేషం ఆమెకు వెగటుని కల్గిస్తున్నాయి. ఒక్క కలం పోటుతో తను నిముషాల మీద డైవోర్సు తెచ్చుకో గలదు. కాని ప్రేమించి పెళ్ళి చేసుకొని విడిపోతే తండ్రి ఏ విధంగా రియాక్టు అవుతాడోనని ఆమె సందేహిస్తున్నది.

"చల్ జే చల్" గూర్ఖా బయట ఎవరినో అదిలిస్తుంటే రజని తన ఆలోచనల నుండి బయట పడి వీధి కేసి చూసింది.

"ఉండు జీ! మా ఆవిడ పనిలోకి ఈ రోజు రానని మేడలో చెప్పమంది" అంటున్నాడతను.

"ఎవరూ?" అంది రజని బాల్కనిలో కొచ్చి.

"నేను యాదమ్మ మొగుణ్ణమ్మా! దానికి నొప్పు లొస్తున్నాయి. పన్లోకి రానని చెప్ప రమ్మంది" అన్నాడతను.

"యాదమ్మా? మా ఇంట్లో నాంచారమ్మ, సుశీల, మేరి పని చేస్తున్నారు. యాదమ్మ లేదే?" అంది రజని ఆశ్చర్యంగా.

"అదే సుశీలా యాదమ్మ! మేం యాదమ్మంటాము"



## మూడుసార్లు హైజాక్‌కు గురి

ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కు చెందిన వైమానిక సిబ్బందిలోని ఒక వ్యక్తి మూడుసార్లు హైజాక్‌కు గురి అయి ప్రపంచ రికార్డు నెలకొల్పాడు. దేవిందర్‌కుమార్ మెహతా అనే ఆ ఉద్యోగి విధి నిర్వహణలో వుండగా మూడుసార్లు ఆ విమానాలు హైజాక్ చేయబడినాయట. 1982లో మొదటిసారిగా హైజాక్‌కు గురి అయ్యాడు. కాని సురక్షితంగా ప్రాణాలతో వున్నాడు. తన కుటుంబంతో ఉల్లాసంగా వున్న కుమార్‌ను ఫొటోలో చూడవచ్చు.

అన్నాడతను.

"సుశీల కడుపుతో లేదే?"

"మేరి... మేరి యాదమ్మ"

రజని అతని వైపు అనుమానంగా చూసి "లోపలికి రా!" అంది.

అతను గూర్ఖా వైపు గర్వంగా చూసి లోపలి కొచ్చేడు. రజని క్రిందకి దిగి వచ్చి "ఏంటిది వెంకటస్వామీ! ఈ వేషం దేనికి?" అంది.

"నన్ను గుర్తు పట్టేసేరామ్మా! అయితే వెంటనే గెటప్ మార్చేయాలి!" అన్నాడు వెంకటస్వామి గుసగుసగా.

"గెటప్ లోపం కాదు గాని నీ గొంతు నాకు బాగా ఆనవాలు.. ఏం జరిగింది? పీయూష కనిపించటం లేదసలు!" అంది రజని ఆత్రుతగా.

వెంకటస్వామి వెంటనే ఓ ఉత్తరం ఆమె చేతిలో పెట్టి "వివరంగా చెప్పటానికి వీలు లేదు. దయ చేసి ఈ ఉత్తరంలో అన్ని సంగతులూ వున్నాయి. చదివి చింపేయండి. నేను చేయాల్సిన పనులింకా చాల వున్నాయి" అంటూ వచ్చినంత వేగంగా వెళ్ళిపోయేడు.

"ఎవరమ్మా అతను?" అంది రజని తల్లి అప్పుడే హాల్లోకి వస్తూ.

"సుశీల మొగుడు."

అప్పుడే గదులు తడిగుడ్డ పెట్టి తుడవడానికి గదిలో కొచ్చిన సుశీల "నా మొగుడా, నా కసలు పెళ్ళేకాందే?" అంది కోపంగా.

"నువ్వాదిలేసిన ముందు మొగుడులే! పని చూసుకో!" అంటూ రజని చరచరా మేడ మెట్లెక్కింది.

"పెళ్ళయ్యాక అమ్మాయి గారు చిర చిరా అయిపోయేరు" అంది సుశీల గదులు తుడవడానికి ఉపక్రమిస్తూ

రజని తల్లికూడ తల వంకిస్తూ వంట గదిలోకి వెళ్ళిపోయింది.

రజని ఇవేం పట్టించుకోకుండా గబగబా తన గదిలోకి వెళ్ళి ఉత్తరం విప్పి చదవసాగింది.

ఉత్తరం చదవడం పూర్తయ్యేసరికి ఆమె ముఖంలోని నరాలు బాధతోను, కోపంతోను పొంగేయి.

ఎంతో అమాయకంగానూ, చిలిపిగాను, చురుకుగానూ వుండే పీయూష గృహ నిర్బంధంలో ఉందని తెలిసేసరికి ఆమెకు కన్నీళ్ళు ఎడతెరపి లేకుండా పొంగుకొచ్చేయి. ఇందులో తన భర్త కరుణాకర్ హస్తం కూడ ఉందని ఆమెకు చూచాయగా అనుమానముంది. అందుకే అతను విజయేంద్ర గురించి ఏమీ మాట్లాడటంలేదు. దానికి తగినట్టు ఆ రోజు మారేజ్ రిసెప్షన్‌లో కూడ గాంధీ అతనితో రహస్యంగా మాట్లాడేడు. ఏది ఏమైనా తను పీయూషకి సహాయపడాలి.

అది ఎలాగో మాత్రం ఆమెకి వెంటనే అంతుబట్టడంలేదు.

ఆలోచనలతో సతమతమవుతూ ఎంతోసేపు అలానే కూర్చుంది రజని.

* * * * *

జగన్నాథ నాయక్ ఫైలంతా తిరగేసి సాలోచనగా శూన్యంలోకి చూసి తిరిగి నిఖిలేశ్వరి వైపు చూసేడు.

ఆమె టెన్షన్‌గా అతని వైపే చూస్తూ "నా బాబుని విడిపించే మార్గమేమైనా తోస్తున్నదా లాయర్‌గారూ!" అంది.

"దాని గురించే ఆలోచిస్తున్నాను. చాల పకడ్బందీగా మీ అబ్బాయిని ట్రాప్ చేసేరు. ఏది ఏమైనా ఎఫ్.ఐ.ఆర్.లో బనాయించిన నేరాలు మూడు నెలలలోపున ప్రూవ్ చెయ్యలేకపోతే మీ అబ్బాయిని వదిలేయాలి. కాని అందుకు విరుద్ధంగా మీ వాడిని ఇంకా జైల్లోనే ఉంచేరు. చూద్దాం. కొన ఎక్కడో చోట దొరక్కపోదు. ఈలోపున అతనితో

సినిమాలు తీస్తున్న నిర్మాతలు అవి పూర్తి చేయడానికి పర్మిష నిమ్మని పెట్టుకొన్న రిట్ మీద విచారణ జరగొచ్చు ఆ కేసు కూడ నేనే చూస్తున్నాను. డబ్బుకోసం నేనీకేసు టేకప్ చెయ్యడంలేదు న్యాయంఎటువుంటే ఆటు వుంటాడీ నాయర్!" అన్నాడతను దృఢంగా

నిఖిలేశ్వరి లేచి నిలబడింది అతనికి చేతులు జోడించి

ఆమెతో పాటు వచ్చిన గణేశన్ కూడ ఆమెని వెంబడించేడు

ఇద్దరూ కార్లో దమయంతి ఇంటికి వెళ్లి ఆమె చెల్లెళ్లని, తమ్ముళ్లని పరామర్శించేరు

"వీళ్లని నా ఇంటికి తీసుకెళ్తాను గణేశన్‌గారూ! రోజూవచ్చి చూడటాని కుదరడంలేదు" అంది నిఖిలేశ్వరి

"మీదిదా పెరియ (పెద్ద) మనసు నేనుదా ఆ పని చేద్దామంటే నాదిదా భార్య ఒప్పుకోలేదు " అన్నాడు గణేశన్ బాధగా.

నిఖిలేశ్వరి చిన్నగా నవ్వి వాళ్లని తీసుకొని కారెక్కింది

అందరూ ఇంటికి తిరిగొచ్చేసరికి వంటమనిషి నాయర్‌తో ఒకతను ఘర్షణ పడుతూ వున్నాడు.

నిఖిలేశ్వరి నాయర్ వైపు చూసి "ఎవరితను?" అంది

"ఇతను విజయేంద్రగారి అభిమానట! శ్రీకాకుళం నుండి వచ్చేడట విజయేంద్ర లేరంటే నమ్మడం లేదు. అరెస్టయ్యేరని చెబితే తన్న బోతున్నాడు" అన్నాడు నాయర్ కోపంగా

"అదిగో, మళ్లీ అదే మాట! గాబాబరస్టయి పోనాడంటా వేంటి! గాబాబుని ముట్టుకొనే ధైర్యం ఎవరికుంది! ముట్టుకొంటే మసాలా అయిపోడా సచ్చినోడు!" అన్నాడా వచ్చిన వ్యక్తి మళ్లీ నాయర్ మీదకి ఉరుకుతూ.

## సూపర్ హీరో

నిఖిలేశ్వరి అతన్నివారించి "లోనికి రండి" అంది

అతను గర్వంగా నాయర్‌ని చూసి మీదకండువా దులుపుకొని లోపలికొచ్చేడు

"కూర్చోండి" అంది నిఖిలేశ్వరి అతన్ని నిశితంగా గమనిస్తూ అతను గణేశన్ వైపు పిల్లలవైపు చూశాడు

"ఫర్వాలేదు చెప్పండి వాళ్లంతా నాకు కావాల్సిన వాళ్లే! మీరు నిజంగా మా అబ్బాయి అభిమానేనా! లేక సి ఐ డినా?" అంది

అతను వెలవెలా బోయినట్లయి గొంతు తగ్గించి "నేను పీయూషగారు పంపిస్తే వచ్చేను ఈ ఉత్తరం చదువుకోండి నిజంగానే మీ ఇంటి చుట్టూ మఫ్టిలో పోలీసులున్నారు నేను కూడ ఆ డిపార్టుమెంటు వాణ్ణే కాబట్టి వాళ్ల కళ్లలో కారంకొట్టి వచ్చేను. వస్తాను" అంటూ అతను బయటికి సాగిపోయేడు చకచకా

నిఖిలేశ్వరి అతను వెళ్లిన వైపు చూసి కవరు తెరచింది

పీయూష రాసిన ఉత్తరం అది విషయం తెలిసి ఆమె నిర్ఘాంత పోయింది పీయూష విజయేంద్ర ని అరెస్టు చేసేక అసలు కన్పించడం మానేసినందుకు గాంధీ హస్తం వుంది తీరుతుందని ఊహించినా అతనింత ఘోరంగా కూతుర్ని హింసించి గృహ నిర్బంధంలో వుంచగలడని ఊహించ లేదు

అంతలో బయట కలకలం వినిపించినట్లయి ఆమె తొంగి చూసింది

వెంకటస్వామిని మఫ్టీలో వున్న పోలీసులు పట్టుకోవడం కనిపించింది ఆమె వెంటనే పీయూష రాసిన ఉత్తరాన్ని స్టౌలోపెట్టి అంటించి కాలిన బూడిదని వాష్ బేసిన్‌లో వేసి నీళ్లు వదిలేసింది

గణేశన్ గాబరాగా "ఎన్నదా అది? ఏం జరిగింది?" అనడిగేడు

"ప్రేమకి ఫలితం గణేశన్ గారూ! మన ఇంటి చుట్టూ కనిపించని కాపలా ఉందని నా కింతవరకూ తెలియదు వెంకటస్వామిని పట్టుకున్నారు పాపం! ఏం చేస్తారో!" అంది బాధగా.

"అడడ! ఏమీ రొంబ అన్యాయం!" అన్నాడు గణేశన్ లేచి నిలబడి కిటికీలోంచి చూస్తూ.

వెంకటస్వామిని పోలీసులు బలవంతంగా లాక్కుని దూరంగా వున్న వేన్‌లో ఎక్కించడం అతని కళ్లపడింది.

ఆ దృశ్యం చూసి అతని కళ్లు ఎర్రబారేయి.

"ఏమిదా వుందా వుత్తరంలో?" అనడిగేడు నిఖిలేశ్వరి వైపు తిరిగి.

"పీయూషని గెస్టుహవుస్‌లో బంధించేడట గాంధీ బహుశ ఇప్పుడా ప్రదేశం మార్చేస్తాడు" అంది నిఖిలేశ్వరి నిట్టూర్చుస్తూ.

"మనందా మన మనుషుల్నెవర్నయినా ఆ గెస్టుహవుస్ ప్రాంతంలో వుంచి తెలియనట్లు వెంబడించమనిదా చెబితే?"

గణేశన్ ఉపాయం ఆమెకి నచ్చింది

"కాని అంత చురుకుగా మనకెవరు సాయం చెయ్యగలరు?" అంది నిరుత్సాహంగా

"నేను ఇప్పుడుదాపోయి శ్యామసుందర్‌కి చెబుదును అతనుదా ఇట్లాంటివి బాగా చేసి పూడ్చును" అన్నాడు గణేశన్

నిఖిలేశ్వరి సంతోషంగా "జాగ్రత్తగా చేయండి బహుశ పోలీసులు మిమ్మల్ని కూడ వెంబడించవచ్చును" అంది

"నానుదా వాళ్ల బుట్టలో పడుదునా? ఎన్ పెయర్ గణేశన్!" అన్నాడు గణేశన్ లేచి నిలబడి లుంగీ ఎగ్గట్టి బయటకి నడుస్తూ

(ఇంకా వుంది)

# నివేదన

ప్రియ న్యాయమూర్తులకు.....

నా జననం ఎలా జరిగిందో తెలిపే జనం అంటూ నాకెవరూ లేరుగానీ అనాధ శరణాలయపు పసి జీవితంలో నే ననుభవించిన కష్టాలు మాత్రం నాకు నేనుగా వెల్లడి చేసుకోగలను. పేరుకు తగినట్టుగానే అనాధలకు ఏం జరిగినా అడిగే దిక్కులేని శరణాలయంలో వార్డెన్లు మాచేత తమ బట్టలుతికించడం దగ్గర్నుంచి తమ స్నానాలకు నీళ్ల తోడించడం వరకూ రకరకాలుగా వెట్టిచాకిరీ చేయిస్తూ.... వివిధ పనులతో అలసి సొలసే మాకు వేళ దాటిపోయాక పాచిపోయిన అన్నం అదీ చాలీ చాలకుండా పెట్టడం.....మేం తినమని మొరాయిస్తే చేయవలసిన చాకిరీ రెట్టింపు చేయడంతో పాటూ ముక్కుపచ్చలారని మాపై ముష్టిఘాతాలు ప్రయోగించడం....వంటి అనేక సంఘటనలు ఇంకా నా మదిలో మెదులుతూనే ఉన్నాయ్!

అందరికీ బాల్యం వసంతంలా గడిస్తే నా జీవితంలో మాత్రం పద్దెనిమిది వత్సరాలూ గ్రీష్మాలుగానే గడిచాయ్! పక్వానికొచ్చిన గున్నమావి ఫలంలా సరైన పరువంతో నిండిన చక్కటి నా అందానికి ఆకర్షితుడైన ఓ వ్యక్తి నా శరీరంపై తన మదిలో రేగిన కామపు ప్రేరణే ప్రేమగా భ్రమించాడో అలా నన్ను నమ్మించాడో తెలియదు కానీ నా భావి జీవితమంతా అతని సాన్నిహిత్యంతో గొప్ప ఆనందమయపు కేళిలా అనిపించేది నాకు!

అయితే ఆనాడు అతని ప్రేమ ఓ వికసిత కుసుమంపై గండు తుమ్మెద కుండే భావన లాంటిదని గ్రహించలేకపోయాన్నేను!

ఏకాంతంగా అతడు నన్ను కలసిన ప్రతిసారి తన శారీరక వాంఛను తీర్చుకోవడానికై పలువిధాల బలవంతం చేసేవాడు. అయితే పెళ్లికి మునుపే అతనితో సాంగత్యానికి నే నొప్పుకోకపోవడంతో చివరికి నా చదువు పూర్తయిన వెంటనే హాస్టల్ అధికారులతో మాట్లాడి పెళ్లికి ముహూర్తం పెట్టించాడు. అతని ఆదర్శానికి హాస్టల్ వార్డెన్లతో సహా పలువురు తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు.

ఆ క్షణం అతడు నా కళ్లెదుట ప్రత్యక్షమైన భగవంతుడిలా అగుపించాడు!

ఏ ఆర్భాటాలూ లేకుండా ఓ పసుపు తాడుతో మా వివాహం జరిగిపోయింది!

కానీ ఆ పెళ్లి బలి పశువుకు చేసే అలంకారం వంటిదని గానీ - మా కాపురం చిరుగాలికి కూలిపోయే పేకమేడ లాంటిదని గానీ - అప్పట్లో నా కర్థమయింది కాదు!

సరిగ్గా మా పెళ్లయిన రెండు నెలల తరువాత అనుకుంటా -

ఆరోజు తన మిత్రుడింట్లో ఫంక్షనుందని చెప్పి నన్ను తన వెంట తీసుకెళ్లిన అతడు పార్టీలో నన్ను మరో వ్యక్తికి అప్పగించి తాను మద్యపానపు మత్తులో మునిగిపోయాడు. ఆ రాత్రి ఆ వ్యక్తి నాపై తన పశుబలాన్ని ప్రయోగించి బాల్యపు నరకాన్ని మరోసారి గుర్తుకు తెచ్చాడు.

అంతవరకూ సంసారం పేరుతో నా 'భర్త' అనబడే ఓ మగాడితో నేను చేస్తున్నది పచ్చి వ్యభిచారమేననీ - కేవలం నా శరీరంపై మోజుతోనూ, అంతకు మించి తన వ్యసనాలకు గానూ, పెట్టుబడిగా ఉపయోగించుకునే ఉద్దేశ్యంతోనూ మాత్రమే నన్ను వంచించి పెళ్లి పేరుతో స్వంతం చేసుకున్నాడనీ అప్పటికి గానీ గ్రహించలేకపోయాన్నేను!

ఆ మరునాడే నా భర్తను విడిచి వెళ్లిపోవడానికి నేను చేసిన ప్రయత్నాన్ని పసిగట్టిన అతడు ఆరోజే నన్ను బ్రోతల్ హౌస్‌కు అమ్ముకోవడం ద్వారా తరలించి చేతులు దులుపుకున్నాడు.

అక్కడ మరికొన్ని రోజులు ప్రత్యక్ష నరకాన్ని (మూడోసారి) అనుభవిస్తూ ఓ స్నేహితురాలి సాయంతో అతి కష్టం మీద అక్కడినుంచి బయటపడి నా జీవితానికి పూర్తి స్వాతంత్ర్యం కోరుకునే ఉద్దేశ్యంతో ఆనాడే ఆ ఊరు వదిలి పెట్టాన్నేను!

కాని అలా పులిబోనులోంచి బయటపడిన నేను నాగరిక సమాజమనే సింహపు దంష్ట్రల మధ్య బందీనవుతాననీ - అది మరింత ప్రాణాంతకమనీ ఆ క్షణమే నే ఊహించగలిగుంటే అక్కడే ఆత్మాహుతి చేసుకునుండేదాన్నేమో?!

తెగిన గాలిపటంలాగో....రెక్కలు తెగిన పక్షిలాగో ఎక్కడెక్కడో తిరిగి చివరికి ఓ మధ్య తరగతి కుటుంబంలో పనిమనిషిగా చేరగలిగాను. మొదట్లో అక్కడ నన్నెవరూ పట్టించుకున్న పాపాన పోకపోయినా ముందూ వెనుకా ఎవరూ లేని అనాధనని అందరికీ తెలియడం వల్లనో....కృంగి కృశించిన దేహం రెండు వారాల్లోనే కడిగిన ముత్యంలా ప్రకాశించడంతో ఇట్టే ఆకర్షించుకోగల నా అందానికీ, పట్టు సడలని నా పరువానికీ (ఆ రెండూ స్త్రీల పాలిట శాపాలని నాకైతే తెలిసింది కాదు) ఆ ఇంట్లోని మగవాళ్లతోబాటూ ఆ వీధిలోని మగవెధవలంతా నావైపు ఆకలిగొన్న పులుల్లా చూడటం గమనించాన్నేను.

నేను పనిజేస్తున్న ఇంటి యజమానికి అరవై పైబడినా "నెరసిన జుట్టు వయస్సుకు చిహ్నం కానీ విజ్ఞానానికి కాదు...." అన్న వాక్యానికి అతికిపోయేలా ప్రవర్తించేవాడు. అతని ఇద్దరి కొడుకుల్లో పెద్దవాడైన పెదబాబు కళ్లెప్పుడూ నా శరీరపు అంగాంగాలనూ రకరకాల కోణాల్లో శోధిస్తూండేవి!

పెళ్లై రెండు సంవత్సరాలు పైబడినా ఇంకా పెళ్లాన్ని సుఖపెట్టడం చాతకాని పెదబాబు (ఆ విషయాన్ని గూర్చి అతని భార్య బయటకు వెళ్లగక్కలేక.... మనసులో దాచుకోలేక పలుమార్లు దుఃఖంతో సతమతం కావడం తెలుసు నాకు) నా పరిస్థితిపై కసాయి ప్రేమనూ, జాలినీ - నటిస్తుంటే అసహ్యమేసేది నాకు! ఒక్కోసారి అతని వెకిలి వేషాలెక్కువౌతుండేవి. అలాం

సాక శ్రీనివాసరావు



టపుడు "ముందు నీ పెళ్లాన్ని సుఖపెట్టడం నేర్చుకోరా ఆడంగి వెధవా" అని అరవాలనిపించేది నాకు. కానీ ఆవిషయాన్ని బయటపెట్టిందన్న నెపంతో అతని భార్యను మరింత హింసిస్తాడేమో అన్న సందేహం నా నోరు నొక్కేసేది!

ఇక చినబాబు విషయానికొస్తే ఆయన తీరే వేరు. బహుశా ఒక మనిషి వ్యక్తిత్వాన్ని, ప్రవర్తననూ, ఆలోచనలనూ, పరిగణనలోనికి తీసుకుని వాటినిబట్టే ఆవరి వ్యక్తికి గౌరవాన్ని, విలువనూ ఇచ్చి మాట్లాడే అరుదైన వ్యక్తిత్వం అతనిలోనే మొట్టమొదటిసారిగా గమనించానేమో నేను!

ఎన్నడూ కనిపించకపోయినా, ఎన్నిసార్లు వేడుకున్నా ఏ విధంగానూ ఆదుకోకపోయినా ఆ భగవంతునిపై నాకెంత గౌరవముందో అంతకుమించిన గౌరవం చినబాబుపై నాకు కలుగసాగింది. క్రమంగా ఆ గౌరవం అభిమానంగా మారి ఆయన నాపట్ల చూపుతున్న ఆదరానికి ఉక్కిరిబిక్కిరయ్యేదాన్ని నేను!

ఎప్పుడైనా పనిపడి వీధిలోనికెళితే అడ్డమైన వెధవలూ (అంటే సంపాదనంతా జూదమాడటానికో, మద్యపానం సేవించడానికో, వ్యభిచరించడానికో తగలేసి తనపై ఆధారపడిన కుటుంబాన్ని ఆకలిపాలు చేస్తూ తిరిగే ప్రబుద్ధులూ... ఉద్యోగాల వేటలో అలసిపోయి నావంటి నిస్సహాయ స్త్రీల వెంటపడి వేధిస్తూ అల్పానందాన్ని పొందే బాధ్యతతెరుగని యువకులూ...స్త్రీలను చిన్నచూపు చూసే మగవాళ్లంతా....) నా శరీరపు అంగాంగాలనూ నగ్నంగా దర్శించాలనే తపనతో....వీలుకాక తమ కామపు తమకాన్ని నన్ను తమ తీక్షణమైన చూపులతో స్పర్శిస్తూ తమకు నచ్చిన రీతిలో ఊహించుకుంటూ తృప్తిచెందే (కంటికింపుగా కనిపించే ఏ పరస్త్రీ కంటపడినా ఇదే తంతు)ఈ సూడో మెంటాలిటీ మగవాళ్లంతా "యత్ర నార్యస్తు పూజ్యంతే రమేంతే తత్ర దేవతాః" అని ఘోషించే పురాణాలు కలిగిన మన భారతదేశపు సంస్కృతీ సంప్రదాయాలే ఊపిరిగా పెరిగిన పౌరులే కావడం ఎవరి దురదృష్టం?

శారీరక వ్యభిచారం కంటే మానసిక వ్యభిచారం ఘోరమైన నీచాతి నీచమైనదనే అన్న నగ్నసత్యం తెలియని దెవరికి?! అయినా-

మనం ముద్దుగా పిలుచుకునే మన పవిత్ర భారతదేశంలోనే - డేటింగ్‌లూ, స్వేచ్ఛా విహారాలూ, అమలులో ఉన్న పాశ్చాత్య దేశాల్లో కంటే 'మానసిక వ్యభిచారం' అతి ఎక్కువ శాతంలో ఉందంటే కారణం ఏమిటీ? లోపమెక్కడుంది? ప్రస్తుతం నా వయసు పాతికైనా నిండలేదేమో? అయినా -

ఇన్ని సంవత్సరాల వయసులో ఓ సాధారణ సగటు ఆడపిల్ల తన జీవితంలో అనుభవించే ఏ చిన్న మధురానుభూతికీ నోచుకోలేకపోయిన నేను ఇకపైన అయినా అనుభవించగలనన్న ఆశ ఏకోశాన నాలో మిగల్లేదు!

నే చదివిన చదువు నాలో విజ్ఞానాన్ని పెంచిందో లేదో తెలియదు కానీ ప్రపంచాన్ని అర్థం చేసుకోవడంలోనూ మనసులోని భావాలను బయటపెట్టుకోవడంలోనూ ఉపకారిగా ఉందన్నమాట వాస్తవం!

నిన్ననే నాకోవిషయం తెలిసింది! అది-

స్త్రీ జీవితానికి సంపూర్ణార్థాన్ని కల్పించి సార్థకతను చేకూర్చే విషయం! కానీ -

వసంత మాసాగమనాన్ని తెలుపుతూ వెలువడే - గున్నమావి చివురులు తిన్న కలకోకిల మధుర కంఠపు కూజితమైనా - నావంటి విషమస్థితిలో చిక్కుపడిన ఆడదానికి వెగటుగానే వినిపిస్తుంది అన్నట్లూ -

ఆ విషయం నన్ను మరింత మనోవ్యధకు లోనుచేసిందేగానీ మాతృత్వపు మాధుర్యాన్ని చవిచూసే అవకాశం లభించిందన్న ఆనందాన్ని ఏ కోశానా కలిగించలేదు!

ఒకవేళ నేనూ అందరిలానే మధురోహలతో ఓ శిశువుకు జన్మనిచ్చినా - అందువల్ల నా జీవితం మరింత దుర్భరమయ్యే మాటెలా ఉన్నా నా బిడ్డకూడా బాల్యం నుంచీ నేననుభవించిన సమస్యల వలయంలోనో చిక్కుపడుతుంది కానీ ఏ ఆధారమూ లేని నా రక్షణలో ఆ దశలో పొందే నైర్మల్యానందాన్ని ఎలా పొందగలదు?

అంటే ఏ చరిత్రనైతే నే అసహ్యించుకుంటున్నానో అలాంటి చరిత్రయే తిరిగి నా బిడ్డద్వారా నే పునరావృతం చేయడానికి ఎలా ఇష్టపడగలను?

పోనీ అందరి స్త్రీల లానే సంసార జీవితం కొనసాగిస్తూ నా బిడ్డ భవిష్యత్‌ను నా ఆశలకు తగ్గ రీతిలో తీర్చిదిద్దాలన్నా నన్నెవరూ ఇప్పుడు భార్యగా స్వీకరించలేరు! అంతకుమించి నా బిడ్డను తన బిడ్డగా అంగీకరించలేరు. ఒకవేళ అంతటి మహోన్నత ఆదర్శంతో నన్నూ నా బిడ్డనూ స్వీకరిం

## నివేదన

చినా ఆ వ్యక్తిని ఈ సంఘం మనశ్శాంతిగా మసలనివ్వదు!

ఇలాంటి స్థితిలో ధైర్యం చేసి నేను ఆ బిడ్డను కన్నా ఆ శిశువు తనకు మహోత్కృష్టమైన మానవ జన్మను ప్రసాదించినందుకు నన్నూ, ఆ భగవంతుడినీ, పూజించడం మాని ద్వేషించడం మొదలెడుతుంది! ఈ ప్రపంచంలో ఏ కన్నతల్లి అలాంటి పరిస్థితిని తట్టుకోగలదు?

కేవలం ఓ మగాడు చేసిన అన్యాయానికి ఇలాంటి విపరీత పరిస్థితుల్లో ఇరుక్కోలేను నేను! సంఘం చుట్టూ సాలెగూడులా అల్లుకుపోయిన అనైతిక విలువలు నన్నలా దిగ్భ్రంధించాయ్ !

కనుక ఈ దేశపు న్యాయమూర్తుల్లారా....

పతనంలో పతాకస్థాయిని చేరుకున్న నైతిక విలువలను పునరుద్ధరించే ప్రయత్నంగా ఈ సభ్య సమాజానికి ఇండియన్ పీనల్ కోడ్‌లోని ఏ సెక్షన్‌ల ఆధారంగా ఎలాంటి శిక్షలు విధిస్తారు? చెప్పండి.... లేకపోతే -

వ్యసనాలంటేనే తెలియనీ.... మంచి మన్ననలే ప్రాణంగా జీవించే మగవాళ్లకు మాత్రమే ఈ సంఘంలో బ్రతికే అర్హతున్నదంటూ వారికి మాత్రమే (ఆ) సర్టిఫికెట్స్ ఇచ్చి మిగతా వారినందరినీ అండమాన్ జైళ్లకు తరలించేయండి!

లేకపోతే రక్తంలో అణువణువునా దుర్గుణాలు పేరుకుపోయిన ఈ నాగరికులందరిలోనూ ఒక్కసారిగా కాకపోయినా క్రమంగానైనా మంచి మార్పు తేగల సత్తా మీ చట్టాలకు గానీ ప్రభుత్వ శాసనాలకు గానీ ఉందని మీరు గట్టిగా వాదించగలరా?

అలా చట్టాలతోనూ శాసనాలతోనూ మార్పుతేగల సత్తా ప్రభుత్వానికి గానీ వాటి నమలుపరచే అధికారులకు గానీ ఉంటే-జడల మఱ్ఱిలా విస్తరించుకుపోతున్న వరకట్నాన్ని గానీ....వరకట్నపు చావులను గానీ ఎందుకు అదుపు చేయలేకపోతున్నారు?

నాకు జరిగిన అన్యాయాన్ని గొంతెత్తి ప్రశ్నించే హక్కునైనా ఈ భరతభూమి కల్పించింది కనుక నా ఈ వేదనా భారాన్ని మీముందు నివేదిస్తున్నాను!

ఈ సంఘపు నగ్నపు నైజాన్ని అర్థం చేసుకున్నాక భంగపడిన నా జీవితాన్ని నా బిడ్డకోసమైనా నిలుపుకోవడానికి నాకు తోచిన ఒకే ఒక ఆలోచన - తిరిగి ఆ మగవాళ్ల బలహీనతనే ఆధారంగా చేసుకుని కనీసం నా బిడ్డకైనా గొప్ప భవిష్యత్‌ను కల్పించాలనుకోవడం!

అందుకుగానూ త్వరలో మంత్రి పదవిని చేపట్టబోయే మా నియోజకవర్గపు ఎమ్.ఎల్.ఏ. ను నా భాషలో చెప్పాలంటే నా శరీరాన్ని ఎరగా వేసి లోబరచుకున్నాను. అది పెద్ద కష్టమైన పని కూడ కాలేదు నాకు! అప్పుడే తెలిసొచ్చింది మరో విషయం నాకు! అది -

నైతిక విలువలకు తిలోదకాలిచ్చేవాళ్లే ఈ సంఘంలో గొప్ప గొప్ప హోదాలకు త్వరత్వరగా చేరుకోగలుగుతారు!

నా ఆలోచనలు సరైనవి కాకపోవచ్చు! ఎందుకంటే -

నేను మహాత్మాగాంధీకు గానీ మహామేధావి అంబేద్కర్‌కు గానీ వారసురాలిని కాను గనుకా....వారి ప్రభావపు గాలులతో ఊపిరి పీల్చుతూ పెరిగిన దానిని కాను గనుకా!!

చివరిగా నేను మిమ్మల్నికోరేదేమంటే-

వ్యభిచార నేరంపై కోర్టుకొచ్చే స్త్రీల జాలి గొలిపే కన్నీటి కథలనూ వాటి వెనుక దాగి ఉండే ఆర్ద్రతనూ అర్థం చేసుకుని వారలా దిగజారడానికి అన్ని విధాలా కారణభూతుడైన మగవాడి దౌష్ట్యానికి ప్రతిగా అదే నేరంపై కోర్టు కొచ్చే మగవాళ్లనుంచే వాళ్లకు తగిన ఆర్థిక ప్రతిపత్తిని కల్పించి స్వతంత్రంగా బ్రతికే ఏర్పాటు చేసేలా - లేకపోతే మగవాళ్ల మగతనాలను చట్టం ద్వారా హరించే హక్కు కోర్టులకు ఐపీన్ 'ఇండియన్ లా'కు కల్గిగేలా ప్రభుత్వాన్ని వెంటనే శాసనం చేయమంటూ మీరంతా నా ఈ కథ చదివాక సంఘటితమై ప్రభుత్వంపై ఒత్తడి తేవాలని! నా ఈ కోరిక నెరవేరాలనే నా ఈ సుదీర్ఘ జీవిత చిత్రం!

మంత్రిగారి సేవకు వేళకావడంతో ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను!

ఇట్లు,

అభాగ్యురాలినో, అదృష్టవంతురాలినో ఎరుగకపోయినా మగవాడి దౌష్ట్యానికి బలైన అబలగా ఈ సంఘం ముందు నిలువకూడదని కాంక్షించే.... ఓ స్త్రీను !

## గాంధీ – జిన్నా

గాంధీ – జిన్నా ఒప్పందంపై తలపెట్టిన చిత్రం వాస్తవ రూపం దాల్చే అవకాశాలు మృగ్యం కావటంతో ఆ పాత్రలను పోషిస్తున్న బెన్ కింగ్స్‌లే – ఆలిఖ్‌పదంశీల మధ్య బొంబాయి డైనస్టీ క్లబ్ వాళ్ళు సమావేశం ఏర్పాటు చేశారు అంతా బాగానే జరిగింది కాని చివరిక్షణంలో కింగ్స్‌లే అత్యవసర శస్త్ర చికిత్స కోసం లండన్ వెళ్ళాల్సి వచ్చింది. దాంతో కింగ్స్‌లే క్షమాపణలు కోరుతూ క్లబ్ నిర్వాహకుడికి లేఖ వ్రాశాడట. మరి గాంధీ కోసం జిన్నా వేచివుండక తప్పదుకదా!

# టిప్ ఫర్ టాట్ - 56
# ఫలితాలు

"అరె నువ్వేనా?
చీకట్లో తడిమి ఎవరో అనుకున్నా!"




★ రు. 25 బహుమతి పొందిన రిపోర్టీ:

**"అవును నేనే! నా బాకీ యిచ్చేదాకా మీ యిల్లు వదలనని చెప్పానుగా!"**

– తాళ్ళూరి అన్నపూర్ణ (రాజమండ్రి)

★ రు. 15 బహుమతి పొందిన రిపోర్టీ:

**"హేండ్సప్! నోరు మూసుకు వెళ్ళి బీరువా తాళాలు తియ్యి."**

– వి. సుమబాల (వరంగల్)

## మరికొన్ని వాగ్బాణాలు

"మీ రేచీకటి బాగా ముదిరిందే!" – వి సురేష్ (పెనుగొండ)

"క్రిందనుండి పైవరకు తడిమేసావు– సిగ్గులేదు? – కోరాడ శ్రీనివాసరావు రామచంద్రపురం

"చాల్లేండి సంబరం.... అదే మా చెల్లెలైతే ఈ పాటికి రెండిచ్చుకునేది."

– పేరూ, ఊరూ రాయడం మరిచిపోయారు.
– పి. జె విమలకుమారి (రామచంద్రపురం)

"ఏం పాపం! చీకట్లో వుంటే పనిమనిషనుకొన్నారా?" – కె సుబ్రహ్మణ్యం (తెనాలి)

– వి తిరుమలరావు (చిన ఓగిరాల)

"అరె మీరేనా? చీకట్లో తడుముతూంటే ఎవరో అనుకున్నా!"

– మాంట్ క్రిస్టో (నెల్లూరు)
– ఎస్ నరసింగరావు (విశాఖ)
– ఎం. ఎస్. నాయుడు (బందుకోట)
– ఆర్. చందా (హైదరాబాద్)
– కె ఎస్ మాచన్న (తాళ్ళపూడి)
– వై. వి. మల్లిఖార్జునరావు (శ్రీశైలం ప్రాజెక్టు)
– పి వి. సుబ్బారావు (పాలకొల్లు)
– జి రమేష్‌బాబు(ప్రత్తిపాడు)
– నివాస్ (మీరాబాద్)
– కాశీ (తణుకు)

"నువ్వు గుడికి వెళ్తానని చెప్పావ్‌గా? మోసం!"

– సిహెచ్ వెంకటేశ్వరరావు (కాకినాడ)

"అవునూ... నువ్వు సినిమాకి రానన్నావుగా?"

– పి నరేష్‌కుమార్ (ఇచ్ఛాపురం)

### లక్కీ పేర్లు

ఎన్. గౌరి (పొన్నూరు), ఆర్. రఘునాథ్ (ఎర్రగుంట్ల), కె. రామారావు (పెద్దాపురం), గురుబాబు (రామవరం), టి.బి.వి. చలపతిరావు (పాలకొల్లు), హరియాలీ (అనకాపల్లి), పి. రమేష్‌బాబు (కోట బొమ్మాళి), పి. ఉదయ్ భాస్కర్ (విజయవాడ), డి. నాగలక్ష్మి (మణుగూరు), ఎం. నాగేశ్వరరావు (కుమారదేవం).

సీరియల్

# హాట్‌లిప్స్



## జి.వి.అమరేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

కురియన్‌కు ఏమాత్రం టైం దొరికినా సుందరమ్మ ఇంటికి వెళ్ళిపోతాడు. సుందరమ్మకు ముప్పై అయిదు సంవత్సరాల వయస్సుంటుంది. అయినా పాతిక సంవత్సరాల కోడె వయస్సులో ఉన్న కుర్రపిల్లలా బింకంగా, పొంకంగా చూసేవాళ్ళకు కైపెక్కిస్తూ, కిర్రెక్కిస్తూ ఉంటుంది.

రెండు రోజుల పాటు కాశీప్రసాద్ ఊళ్ళో ఉండడని తెలియగానే కురియన్ చాలా హ్యాపీ ఫీలయ్యాడు. ఈ రెండు రోజులూ సుందరమ్మతో మజా చేయవచ్చుననే ఊహ అతడిని ఒక పట్టాన నిలవనీయలేదు. ఆఘమేఘాల మీద సుందరమ్మ కౌగిట్లోకి చేరిపోయాడు.

సుందరమ్మ సిద్ధం చేసి ఉన్న నాటుసారా తాగుతూ, చీకులు నములుతూ ఒళ్లంతా తడుముతూ ఒక అరగంట సేపు గడిపాడు

నాటుసారా ఖతం చేసేసరికి అతడిలో వేడి పెరిగింది నరాల్లో కదలిక మొదలయ్యింది సుందరమ్మ నడుం ఒంపులో చెయ్యి వేసి దగ్గిరికి లాక్కున్నాడు

"అప్పుడేనా మాఁవా? . నేను నీ కోసం ఇస్పెసల్‌గా చేసిన కొర్ర మీను వేపుడుంది నక్కేసుకునేటపుడు కొర్రమీను ముక్క నమిలేత్తె భలే మజాగా ఉంటుంది మాఁవా"

సుందరమ్మ హొయలు ఒలకపోస్తూ, గారాలు పోతూ, మెలికలు తిరుగుతూ ముద్దు ముద్దుగా చెప్పింది

కురియన్ ఆమెను మరింత దగ్గిరకు హత్తుకున్నాడు ముందుకు వంగి ఆమె పెదాల మీద చుంబించాడు జాకెట్ కిందుగా చేయి వేసాడు సుందరమ్మ చిగురుటాకులా కంపించింది

"సుందరీ! ఐలవ్ యూ"

ఆమె చెవిలో గుసగసగా అన్నాడు కురియన్ సుందరమ్మ కిలకిల నవ్వింది

సుందరమ్మ కురియన్‌ను బలంగా వాటేసుకుని తన గుండెల్లో అతని ఛాతీ అదిమింది

"నీ... ప్రాణం తోడేస్తున్నావు గదే" అంటూ ఆమె జాకెట్ గుండీలు మీద చేతులు వేశాడు

"నేను కొత్తగా కుట్టించుకున్న షేపు జాకెట్ ఎలాగుంది మామా?" కళ్ళు మూసుకునే అడిగింది సుందరమ్మ.

"ఇట్టా తెలియదే దీని కొలతలు చూడాలంటే విప్పి చూడాల్సిందే."

"ఛీ పాడు! సిగ్గేస్తుంది మామాఁ"

"రోజూ జరిగే దానికి సిగ్గేంటే" అంటూ కురియన్ ఆమె జాకెట్ బటన్స్ ఒక్కొక్కటీ ఊడదీశాడు

నల్లరాతి శిల్పం లాంటి సుందరమ్మ శరీరం వంక కురియన్ కోర్కెగా చూసి అమాంతం ఆమెని కావలించుకున్నాడు

"ఇంకనె నాగలేను మాఁవాఁ" సుందరమ్మ కురియన్ చెవిలో గొణిగింది కురియన్ ఆమెను రెండు చేతుల్తో ఎత్తి మంచం మీద పడుకోపెట్టాడు సుందరమ్మ కళ్ళు మూసుకుని ఆ తర్వాత జరిగే చర్య కోసం ముత్యపు చిప్పలా, చకోర పక్షిలా ఎదురు చూస్తోంది

సరీగ్గా ఆ సమయంలో వినపడింది దఢేళ్‌మంటూ తలుపు విరిగిన శబ్దం

జరిగింది అర్థం చేసుకునేలోపే కురియన్ మెడ మీద బలమైన దెబ్బ పడింది

అతడు పెద్దగా 'అమ్మా' అంటూ ఆర్తనాదం చేశాడు

తలుపు విరిగిన శబ్దం, దాన్ని అనుసరించి కురియన్ ఆర్తనాదం వినపడడంతో సుందరమ్మ ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసింది ఎదురుగా ఎవరో ఆగంతకుడు కనపడడంతో భయంతో కట్టెలా బిగుసుకుపోయింది

అతడు మరెవరో కాదు శివాజీ

కిందపడిన కురియన్‌ను శివాజీ జుట్టు పట్టుకుని పైకి లేపాడు అతడి తల విసురుగా గోడ కేసి బాదాడు

ఆ దెబ్బతో తల వెనుక భాగాన చిట్లి రక్తం బొటబొటా కారసాగింది నసాళానికి అంటిన నాటు సారా మత్తు దిగిపోయింది

కురియన్ భయంకరంగా మరొక కేక వేశాడు ఆ ఆర్తనాదానికి భయంతో బిగదీసుకు పోయిన సుందరమ్మ శరీరంలో కదలిక వచ్చింది ఆమె మంచం మీది నుంచి లేచి తను నగ్నంగా ఉన్నానన్న ధ్యాస కూడా లేకుండా వీధి గుమ్మం వైపు పరుగు తీసింది శివాజీ వేగంగా పరుగు తీస్తున్న ఆమె కాళ్ళకు తన కాలు మెండే వేశాడు

పట్టు తప్పిన సుందరమ్మ కురియన్ మీద పడింది కురియన్ ఆమెను విసురుగా పక్కకు తోసేశాడు

ఆమె నుదురు నేలకు బలంగా తగిలింది మరుక్షణం ఆమెకు స్పృహ తప్పింది

తల వెనుక భాగంలో దెబ్బ తగలడంతో కురియన్ కళ్ళ ముందు నక్షత్రాలు మెరిశాయి తల దిమ్ముగా

**ఇంతవరకూ సాగిన కథ–11:–** మారుపేర్లతో మోసాలకు అలవాటుపడి వచ్చినదాంట్లో సమంగా పంచుకుంటూ కాలం గడుపుతుంటారు శివాజీ, రజని. మోహినిని భార్యగా స్వీకరించేందుకు భార్య పార్వతిని చంపేందుకు కాశీప్రసాద్ వేస్తున్న పథకాలకు కురియన్, నల్లముత్తు, ఎర్రతేలు సహకరించి పార్వతిని హత్య చేస్తారు. ఆ హత్యను కళ్లారా చూసిన శివాజి తల్లిదండ్రులను, చెల్లిని కురియన్ బృందం చంపేస్తారు. వారిపై పగతీర్చుకునేందుకు శివాజీ బయలుదేరుతాడు.

ఆయింది శివాజీ కురియన్ నెత్తి మీద మరొక దెబ్బ వేశాడు

ఈ సారి కళ్ల ముందు తిరుగుతున్న నక్షత్రాలు మాయమై పోతూ ఉంది

కురియన్ తల విదిల్చాడు

ఎదురుగ్గా మసక మసకగా కనపడుతున్న శివాజీ రూపం ఇప్పుడు స్పష్టంగా కనపడసాగింది అతడు శివాజీని గుర్తు పట్టాడు వెంటనే ఆశ్చర్యంగా భయంగా అన్నాడు

"నువ్వా"

"అవును నేనేరా బద్మాష్ మా అమ్మని నాన్నని ఎందుకు చంపావ్ చెప్పు"

"తెలీదు నాకు తెలియదు"

ఆ మాట అంటూనే కురియన్ శివాజీ మీదికి స్ప్రింగ్‌లా దూకాడు

కురియన్ నుంచి అలాంటి ప్రతిఘటన ఎదురౌతుందని అతడు అన్ని దెబ్బలు తిన్న తర్వాత కూడా అంత యాక్టివ్‌గా ఎదురు దెబ్బతీయగలడని శివాజీ ఊహించలేదు

కురియన్ పాదాలు నేరుగా శివాజీ గుండెల మీద లాండ్ అయాయి

శివాజీ వెనక్కు పడిపోతూ చేతులతో నేలను సపోర్టు చేస్తూ కాళ్ల మీద లేచి కురియన్ గుండెల మీద బలంగా తన్నాడు ఆ దెబ్బకు దోసెడు రక్తం కక్కుకున్నాడు కురియన్ శివాజీ అదే వేగంతో పిల్లి మొగ్గ వేసి లేచి నిలబడ్డాడు

కరాటే, జూడో, కుంగ్‌ఫూ సినిమాల్లో కనపడే అలాంటి ఫీట్ శివాజీ తన కళ్ల ముందు చేయడం కురియన్ నమ్మలేక పోయాడు ఇక శివాజీతో ముష్టి యుద్ధంలో గెలవలేనని తెల్సుకున్న కురియన్ మెరుపులా పక్కకు జంప్ చేసి నేల మీద పడివున్న జర్కిన్ పాకెట్‌లోంచి రివాల్వర్ అందుకొన్నాడు దాన్ని శివాజీ వైపు గురి చూసి పేల్చాడు ప్రత్యర్థి వద్ద రివాల్వర్ ఉంటుందని ఊహించలేదు శివాజీ

కురియన్ చేతిలోకి రివాల్వర్ ప్రత్యక్షం అవుతూనే జరగబోయేది ఊహిస్తూ ప్రక్కకు డైవ్ చేశాడు

సరిగ్గా ఆ సమయంలో రివాల్వర్ పేలింది

బుల్లెట్ శివాజీ భుజంలో దిగబడింది రక్తం దారగా కారసాగింది శివాజీ ప్రక్కకు దూకుతూనే స్పృహ లేకుండా నగ్నంగా పడి ఉన్న సుందరమ్మని పైకి లేపి తనకు అడ్డుగా పెట్టుకున్నాడు

మరోసారి రివాల్వర్ పేల్చబోయిన కురియన్ ఠక్కున ఆగిపోయాడు

శివాజీ, కురియన్ రెండు క్షణాలసేపు కదలకుండా ఎవరి ప్రదేశాల్లో వాళ్లు నిలబడి ఒకర్నొకరు చూసుకున్నారు తను ఏమాత్రం తెలివి తక్కువగా ప్రయత్నించినా కురియన్ చేతిలో చావు తప్పదని గ్రహించాడు శివాజీ

శివాజీ దృష్టి తన కాలికి దగ్గరగా ఉన్న చిన్న టీపాయ్ మీద పడింది

ఇక శివాజీ ఒక్క క్షణ కాలం కూడా ఆలోచించలేదు అతడి కుడి కాలు విసురుగా పైకి లేచింది మరుక్షణం జాజి చెక్కలతో చేసిన టీపాయ్ ప్లాస్టిక్ బొమ్మలా గాల్లోకి గిరికీలు కొడుతూ ఎగిరి రివాల్వర్ పట్టుకున్న కురియన్ చేతికి తగిలింది! అది ఎగిరిపోయింది

తన చేతిలోని ఆయుధం జారిపోగానే కురియన్ ముఖం తెల్లగా పాలిపోయింది కురియన్ తేరుకునే లోపే శివాజీ తన చేతుల్లోని సుందరమ్మ శరీరాన్ని వదిలేసి ముందుకు దూకి కురియన్ తొడల మధ్య బలంగా కాలితో తన్నాడు

'అమ్మా' కురియన్ పెద్దగా అరచి వెల్లకిలా పడిపోయాడు శివాజీ హ్యాండ్ కర్చీఫ్ తీసి రివాల్వర్ అందుకుని జేబులో వేసుకున్నాడు

పైకి లేస్తున్న కురియన్ కుడి చెయ్యి పట్టుకుని బలంగా మెలి తిప్పాడు

పటపటమని భుజం జాయింట్‌లో ఎముక విరిగిన చప్పుడు వినపడింది

కురియన్ గొంతు చించుకుంటూ స్వరపేటిక పగిలిపోయిందా అనేంత పెద్దగా ఆర్తనాదం చేశాడు అతడి చేయి భుజం నుంచి నిస్తేజంగా వేలాడసాగింది శివాజీ అతడి ఎడమచేయి మెలిక వేస్తూ అడిగాడు



"చెప్పు మా అమ్మనీ, నాన్ననీ, చెల్లెల్నీ, కాళీప్రసాద్ భార్యనీ చంపింది నువ్వే కదూ".

"నేను మాత్రమే కాదు. నాతోపాటు మరో ఇద్దరున్నారు. వాళ్ల పేర్లు నల్లముత్తు, ఎర్రతేలు".

"వాళ్ల అడ్రస్‌లు ఏంటి?" చెయ్యి మరింత మెలివేస్తూ అడిగాడు శివాజీ.

"ఎర్రతేలు జామై ఉస్మానియా స్టేషన్ ప్రక్కనే ఉన్న ఆకుపచ్చ రంగు బిల్డింగ్‌లో ఉంటాడు. నల్లముత్తు చిలకలగూడా బస్టాప్ ఎదురుగా ఉన్న రేకుల షెడ్‌లో ఉంటాడు

"వాళ్ల ఇంటి నెంబరు ఏంటి?"

"తెలియదు... మదర్ ప్రామిస్"

"నీకు ఒక అమ్మ కూడాను .. దొంగనాయాల"

శివాజీ కురియన్ మెడ మీద బలంగా ఒక దెబ్బ వేశాడు.

"అమ్మా" కురియన్ బాధగా అరిచి చెప్పాడు.




"నిజం వాళ్ల ఇంటి నెంబరు నాకు తెలియదు. వాళ్లుండే ఏరియాల్లోకి వెళ్లి వాళ్ల గురించి ఎవర్నడిగినా చెప్తారు".

"ఓకే! అసలు కాళీప్రసాద్ తన భార్యను ఎందుకు చంపాలనుకున్నాడు."

కురియన్ కాళీప్రసాద్‌కు మోహినితో ఉన్న స్నేహం గురించి మొదలుపెట్టి చివరవరకూ ప్రతి ఒక్క విషయాన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు.

అంతా విన్న తర్వాత అడిగాడు శివాజీ.

"అయితే కాళీప్రసాద్ రేపో ఎల్లుండో వస్తాడన్నమాట"

"అవును"

"వాడి ఫోన్ అబ్జర్వేషన్‌లో ఉన్నదన్నమాట".

"అవును".

"ముందు ప్యాంటు వేసుకో మనం బయటికి వెళ్లాలి".

"ఎక్కడికి" భయంగా అరిచాడు కురియన్.

"చెప్తా ప్యాంటు వేసుకో"

కురియన్ తల ఊపి ఒంటి చేత్తోనే ప్యాంటు తొడుక్కున్నాడు.

శివాజీ అతడిని నడిపించుకుంటూ మారుతి వైపు తీసుకు వెళ్లాడు.

అక్కడ జనం గుంపుగా ఉన్నారు.

కురియన్‌ను మారుతిలోకి తోస్తున్నప్పుడు గుంపులో నిలబడి ఉన్న ఎనభై సంవత్సరాల ముసలమ్మ శివాజీ దగ్గరికి వచ్చి చెప్పింది.

"ఏ తల్లికి పుట్టిన వాడివో గాని ఇన్నాళ్లకు మా పీడ విరగడ అయ్యింది. ఈ దుర్మార్గుడు మా కాలనీలో ఒక్క ఆడదాన్ని కూడా బ్రతకనిచ్చేవాడు కాదు. ఇక నువ్వు ఇపుడు వాడిని నడి బజార్లో చంపి పారేసినా సరే మేం పోలీసులకు సాక్ష్యం చెప్పం"

శివాజీ ఆమె మాటలకు తల పంకించి కురియన్‌ను వెనక సీట్లోకి నెట్టాడు. తను డ్రైవింగ్ సీట్ ఆక్రమించుకున్నాడు.

మరుక్షణం మారుతి ముందుకు కదిలింది.

* * * * *

శివాజీ మారుతీ కారు ఓ పొద ప్రక్కగా ఆపాడు. కారు ఆగిన శబ్దం వింటూనే రజని గుబురుగా పెరిగిన మొక్కల చాటు నుండి ఇవతలకు వచ్చింది.

శివాజీ బ్యాక్ సీట్‌లో పడి ఉన్న కురియన్‌ను బయటకు లాగాడు. కురియన్ శివాజీ వంక భయంగా చూశాడు. శివాజీ కురియన్ భుజం మీద చేతితో తడుతూ చెప్పాడు.

"అలా ఊర్కే భయపడకు ... నేను నిన్ను చంపను. అసలు నిన్ను చంపేది నేను కాదు. ఈ రోజు సాయంత్రం ఎర్రతేలు నిన్ను చంపబోతున్నాడు".

"ఎర్రతేలు నన్ను చంపబోతున్నాడా" కురియన్ భయంగా అన్నాడు.

"అవును నిన్ను చంపేది ఎర్రతేలే"

శివాజీ కురియన్ మెడ మీద చెయ్యి వేసి ముందుకు తోశాడు. కురియన్ బ్యాలెన్స్ తప్పి పడిపోయి శివాజీ వంక కోపంగా చూశాడు.

శివాజీ బూటు కాలు కురియన్ గుండెల మీద నొక్కిపట్టి రజనితో అన్నాడు.

"అక్కడ నిద్రగన్నేరు చెట్టుకు ఏదో తీగ అల్లుకుంది. దాన్ని తెంపి తీసుకురా".

రజని తల ఊపింది.

నిద్రగన్నేరు చెట్టుకు పాకిన అడివిమల్లె తీగెను తెంపి శివాజీకి అందించింది శివాజీ దానితో కురియన్ కాళ్లూ చేతులూ బలంగా కట్టేశాడు.

"నువ్ నన్నేం చేయబోతున్నావ్?" కురియన్ గొంతు కీచుగా ఉంది

శివాజీ సమాధానం చెప్పకుండా అతడి మెడ మీద ఒక దెబ్బ వేశాడు. మరుక్షణం కురియన్ తలవాల్చేశాడు...:

అతడికి స్పృహ తప్పింది.

శివాజీ స్పృహ తప్పిన కురియన్ శరీరాన్ని ఒక పొద చాటుకు ఈడ్చి అతడి మీద ఎండిపోయిన ఆకులు కప్పాడు.

కురియన్‌కు మరో రెండు మూడు గంటలదాకా మెళకువ రాదు

శివాజీ రజని చెయ్యి పట్టుకుని మారుతి వైపు నడిచాడు.

"మనం ఇపుడు ఎక్కడికి వెడుతున్నాం" రజని అడిగింది.

"బాగ్ అంబర్‌పేట" శివాజీ చెప్పాడు.

బాగ్ అంబర్‌పేట వెళ్లే వరకూ ఇద్దరూ మాట్లాడుకోలేదు. శివాజీ తన ఇంటి ముందు ఇద్దరు కానిస్టేబుల్స్ కాపలా ఉండటం గమనించాడు. తను కనక కార్లోంచి దిగితే వాళ్లు గుర్తించే ప్రమాదం ఉంది శివాజీ కారు రివర్స్ చేసి మెయిన్‌రోడ్డు మీదికి తీసుకు వచ్చాడు. మెయిన్ రోడ్ మీది నుంచి కుడిప్రక్కకు కొద్ది గజాలదూరం వెళ్లిన తర్వాత మరొకసారి కుడి వైపు టర్న్ తీసుకుని ముందుకు దూసుకుపోయాడు.

ఇపుడే అతడు ఖచ్చితంగా తన ఇంటి వెనగ్గా ఉన్నాడు శివాజీ ఇంటికి కొద్ది దూరంగా మురికి కాలువ ప్రవహిస్తోంది. కాలవ అవతల పొలాలు కనపడుతూ ఉన్నాయి. కాబట్టి పొలాల వైపు నుంచి, ఎవరూ అతడినికాని, రజనినికాని చూసే ప్రశ్న లేదు. ఇక శివాజీ ఇంటి వెనక ఒక పురాతనమైన పాడుబడ్డ భవనం ఉంది. శివాజీ తన ఇంటి రోడ్డు వైపు వాకిలికీ పాడుబడ్డ బిల్డింగ్‌కీ మధ్య కారు ఆపాడు.

మిట్ట మధ్యాహ్నం అవుతున్నా కూడా ఆ ప్రదేశం నిర్మానుష్యంగా ఉంది. కాని అక్కడినుంచి కేవలం రెండు మూడు వందల గజాల దూరంలో ఉన్న మెయిన్ రోడ్ మీదికి వస్తే ట్రాఫిక్ జామ్ అయేంత జనం తిరుగుతుంటారు.

శివాజీ కారు దిగి దొడ్డి తలుపు నెట్టాడు.

అది కిర్రుమంటూ మెల్లిగా తెరుచుకుంది.

రజని అతడివంక భయంగా చూసింది. ఇంటిముందు కాపలా ఉన్న కానిస్టేబుల్స్ ఆమెకు ఇంకాగుర్తున్నారు.

శివాజీ మెల్లిగా దొడ్లోకి ప్రవేశించాడు.

ఓ మూలగా ఉన్న పూలకుండీలను ప్రక్కకు తొలగించి వేళ్ళతో మట్టి లాగసాగాడు. అయిదు నిమిషాల్లో అతడికి ట్రంకుపెట్టె చేతికి తగిలింది. దాని మూత తీసి చూశాడు. లోపల ఉన్న డబ్బు భద్రంగానే ఉంది. అందులోంచి కొన్ని నోట్ల కట్టలు తీసి జేబులో వేసుకున్నాడు. తిరిగి వచ్చిన దోవనే వెళ్ళి కార్లో కూర్చున్నాడు.

మెయిన్‌రోడ్డుమీదికి ఎక్కిన తర్వాత రెండు కిలో మీటర్ల దూరం పోనిచ్చి విద్యానగర్‌లో ఒక వీధి మొదట్లో కారు ఆపి క్రిందికి దిగాడు శివాజీ.

"ఏం కారు వదిలేస్తున్నావేం?" రజని అతన్ని అనుసరిస్తూ అడిగింది.

"అది దొంగ కారు. ఇంతవరకూ మనం కనీసం దాని నెంబర్ అన్నా మార్చకుండా తిరిగాం. ఇప్పటివరకు మనల్ని పోలీసులు వెంబడించనందుకు సంతోషించు. నువ్వు ఇక్కడే ఉండు. నేను వెళ్ళి రెండు ఇంపార్టెంట్ ఫోన్స్ చేసి వస్తా" అన్నాడు.

మరో కొద్ది గజాల దూరం వెళ్ళిన తర్వాత శివాజీని తెల్ల రంగు మేడ ఒకటి ఆకర్షించింది. ఆ మేడ కాంపౌండ్‌వాల్‌కు పి. వెంకటపతి, ఏరియా మేనేజర్, ఫిషర్ ఎలక్ట్రానిక్స్ అనే బోర్డు వేలాడుతోంది. ఆనేం ప్లేట్‌కు దిగువ భాగాన ఇన్ అనే అక్షరాలు కనబడుతున్నాయి.

శివాజీ ప్రక్కనే ఉన్న పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లోకి వెళ్ళి టెలిఫోన్స్ అసిస్టెన్స్ నెంబర్‌కి ఫోన్ చేశాడు. లైన్‌లోకి వచ్చిన ఆపరేటర్‌ని విద్యానగర్‌లో ఉండే వెంకటపతి ఫోన్ నెంబరు అడిగాడు.

"విద్యానగర్‌లో అయిదుగురు వెంకటపతులున్నారు. మీకు కావాల్సిన వెంకటపతి ఎవరు?" ఆపరేటర్ అడిగింది.

"పి. వెంకటపతి, ఏరియా మేనేజర్ ఫిషర్ ఎలక్ట్రానిక్స్"

"ఆయన నెంబర్ డబుల్ నైన్ డబుల్ సిక్స్ ట్రిబుల్ సెవెన్"

శివాజీ నెంబర్ వందకు ఫోన్ చేశాడు.

అవతల్నించి "అడిక్‌మెట్ పోలీస్ స్టేషన్" అంటూ వినపడింది.

"సి.ఐ.గారున్నారా?" శివాజీ అడిగాడు.

"సి.ఐ.నే మాట్లాడుతోంది."

"నా పేరు వెంకటపతి. నా మారుతీకారు పోయిందని రిపోర్ట్ చేశాను. నా కారు దొరికింది. ఎవరో నా ఇంటిముందే వదిలిపెట్టి వెళ్ళిపోయారు."

"థాంక్స్. మా పని తగ్గించారు. వెంటనే రేపో ఎల్లుండో వచ్చి మీ కంప్లయింట్ విత్‌డ్రా చేసుకోండి"

"అలాగే"

శివాజీ ఫోన్ క్రెడిల్ చేసి డబుల్‌నైన్ డబుల్ సిక్స్ ట్రిబుల్‌సెవెన్ నెంబర్‌కి రింగ్ చేశాడు.



అవతల్నించి ఒక యువతి కంఠం హలో అంటూ వినపడింది.

"వెంకటపతి ఉన్నాడా" శివాజీ అడిగాడు.

"ఒన్‌మినిట్"

కొద్ది సెకన్ల తర్వాత వెంకటపతి లైన్‌లోకి వచ్చాడు.

"నేను వెంకటపతిని మాట్లాడుతున్నాను. మీరెవరు?"

"మీ కారు కాజేసిన దొంగని."

"ఏంటీ?"

"మీ కారు కాజేసిన దొంగని. మీ కారు వీధి మొదట్లో ఉన్నది తెచ్చుకోండి. కీస్ కూడా దానికే ఉన్నాయి."

శివాజీ రిసీవర్ క్రెడిల్ చేసి టెలిఫోన్ బూత్ నుండి బయటకు వచ్చాడు.

చూస్తుండిపోయాడు.

వెంకటపతికి ఫోన్ చేసిన తర్వాత శివాజీ రజనితో కలిసి ఆటోలో రాంకోటి వెళ్లాడు. అక్కడ యాదగిరిని కలిశాడు.

యాదగిరి ఆటో కన్‌సల్‌టెంట్.

అతడు అన్ని రకాల కార్లు కొని వాటికి రిపేరు చేసి తిరిగి అమ్ముతుంటాడు. యాదగిరి శివాజీకి బెస్ట్ ఫ్రెండ్. శివాజీని రజనిని చూస్తూనే యాదగిరి తన వర్క్‌షాప్‌లో పనిచేసే కుర్రాడికి మూడు వేడి వేడి స్పెషల్ చాయ్ తెమ్మని ఆర్డర్ చెప్పాడు. తర్వాత శివాజీ వైపు తిరిగి అన్నాడు.

"ఇవ్వాళ మీ ఇద్దరి పేర్లు దాదాపుప్రతి పేపర్లోనూ పడ్డాయ్. బహుశా పోలీసులు నీ కోసం వేటకుక్కల్లా తిరుగుతూ ఉంటారు. అందులోనూ చనిపోయింది కాశీప్రసాద్ భార్య. నువ్వు ఆపని చేశావంటే నాకు నమ్మకం కలగడం లేదు. అసలు ఇంతకూ జరిగిం దేమిటి?"

ఆ ప్రశ్నలతో చెదిరిపోయిన శివాజీ హృదయం

## జాకీ ఫోటో తాపత్రయం



ఎక్కడైనా ఏదైనా ఫంక్షన్లు జరిగితే అక్కడకు వచ్చే హీరోయిన్లతో ఫోటోలు తీయించుకోవాలన్న 'ఆరాటం' చూపుతారట కొందరు హీరోలు. అలా ఆరాటపడే హీరోల్లో జాకీష్రాఫ్ ఒకడట. ఇటీవల ఒక చిత్రం శతదినోత్సవానికి వెళ్ళిన జాకీ అదే ఉత్సవానికి హాజరైన మాధురీదీక్షిత్‌ను దగ్గిరకు తీసుకోనల్లా ఫోటో తీయించుకున్నాడు. అంతవరకు బాగానే వుంది. జావేద్ జాఫ్రీ, సినిమా రంగంలోని యితర ప్రముఖులు కూడా 'పోజు'లు పెట్టి మరీ తీయించుకున్నారట ఫోటోలు. హీరోలకే కాదు మిగిలినవాళ్లకు కూడా ఆరాటమే హీరోయిన్లంటే! కాదా మరి!

అతడికి వేగంగా మారుతి వైపు పరుగు తీస్తున్న వెంకటపతి కనిపించాడు.

వెంకటపతి తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. మారుతిని ఇంటికి తీసుకురాగానే పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేసి అడిగాడు.

"సి. ఐ.గారున్నారా?"

"సి.ఐ.నే మాట్లాడేది."

"నా పేరు వెంకటపతి. నేను మారుతి కారు పోయిందని ఫోన్ చేశాను. కాని ఇపుడు అది దొరకింది."

"అబ్బబ్బ? చెప్పిన విషయమే ఎన్నిసార్లు చెప్తావయ్యా. ఇపుడేగా నువ్వు విషయం ఫోన్ చేసి చెప్పింది. కారు దొరికిన ఆనందంలో నీ మనస్సు భ్రమించిందా ఏంటి... కాసేపయ్యాక వచ్చి కంప్లయింట్ విత్‌డ్రా చేసుకో" అని సి.ఐ. రిసీవర్ క్రెడిల్ చేశాడు.

వెంకటపతి ఆశ్చర్యంగా నోరు తెరిచి ఫోన్‌కేసి

మరొకసారి భగ్గుమంది. అయినా అతడు నిగ్రహించుకున్నాడు.

ఇది బాధపడి మాటల్తో సరిపుచ్చే సమయం కాదు. ముందు తన కర్తవ్యం పూర్తి అవ్వాలి. దుష్టశిక్షణ జరగాలి.

"ఏంటి ఆలోచిస్తున్నావ్?"

శివాజీ భుజంమీద చెయ్యి వేసి అడిగాడు యాదగిరి.

"ఏం లేదు. నీకు సావకాశంగా అన్నీ చెప్తా... నాకు ఇపుడు పాతదయినాసరే మంచి కండిషన్‌లో ఉన్న కారు కావాలి. రేటు గురించి ఆలోచించకు."

ఈలోపు చాయ్ కప్పులతో పని కుర్రవాడు వచ్చాడు. ముగ్గురూ పొగలు కక్కుతున్న టీ త్రాగారు.

టీ కప్పు టీపాయ్‌మీద పెడుతూ అన్నాడు యాదగిరి.

"నా దగ్గిర ఒక పాత వ్యాన్‌గార్డ్ కారుంది. కాస్త

## 'చలువ కళ్ళజోడు'కు బ్యాటరీ

న్యూయార్క్‌కు చెందిన ఒక కంపెనీ తయారు చేసిన ఒక విలక్షణమైన 'సన్ గ్లాస్' (చలువ అద్దాలు) విద్యుత్ ప్రేరణతో పని చేస్తుంది దీనివల్ల సూర్యరశ్మి కారణంగా కంటికి జరిగే నష్టాన్ని మరింత ఎక్కువగా నివారించడానికి వీలు కలుగుతుంది

ఈ క్రొత్త రకం 'చలువ అద్దాలు' కేవలం కొద్ది సెకన్ల వ్యవధిలో నే తమ ద్వారా ప్రసరించే కాంతిని 44 శాతం నుంచి 88 శాతం వరకు 'పడపోస్తాయి'.

'రీసెర్చి ఫ్రాంటియర్స్ ఇన్‌కార్పొరేటెడ్' అనే సంస్థ తయారు చేసిన ఈ చలువ అద్దాలలో కాంతిని 'పీల్చుకునే' సూక్ష్మకణాలతో కూడుకొని వున్న ద్రవం వుంటుంది విద్యుత్ ప్రేరణ జరిగినప్పుడు ఈ సూక్ష్మకణాలు అద్దాల ద్వారా హెచ్చు లేదా స్వల్ప కాంతిని అనుమతించే విధంగా 'పేర్చి' వుంటాయి

ఈ 'సన్‌గ్లాస్'కి అవసరమైన విద్యుత్‌ని 'ఫ్రేము' లోపల అమర్చి వుండే ఒక చిన్న 'బ్యాటరీ' సమకూర్చుతుంది దీనిని అదుపు చెయ్యడానికి చిన్న మీట వుంటుంది

గది కిటికీలకు కూడా ఈ క్రొత్త రకం చలువ అద్దాలను ఉపయోగించే విషయం పరిశోధకుల పరిశీలనలో వుంది

పెట్రోలు ఎక్కువ తాగేస్తుంది కాకపోతే ఎలాంటి రోడ్డుమీదనయినా ట్రబులివ్వకుండా దౌడు తీస్తుంది. పికప్ కూడా బాగుంది చూపిస్తా పద "

యాదగిరి, శివాజీ, రజని షెడ్‌లోపలికి నడిచారు యాదగిరి వ్యాన్‌గార్డ్ మీద కప్పిన టార్పాలిన్ లాగేశాడు

కొత్తగా బ్లాక్ పెయింట్ వేసిన వ్యాన్‌గార్డ్ నల్లవజ్రంలా మెరుస్తోంది

శివాజీ వ్యాన్‌గార్డ్ బానెట్‌మీద చెయ్యివేసి నిమురుతూ అడిగాడు

"రేటు ఎంత?"

"ఇరవై" యాదగిరి చెప్పాడు

శివాజీ రేటు గురించి బేరం చేయలేదు రెండు వందరూపాయల నోట్ల కట్టలు యాదగిరి మీదికి విసిరాడు

యాదగిరి తన జేబులోంచి వ్యాన్‌గార్డ్ కీస్ తీసి శివాజీవైపు విసురుతూ అన్నాడు

"ప్రస్తుతం దీని రిజిస్ట్రేషన్ నా పేరుమీదనే ఉంది దీన్ని నువ్వు ఇప్పుడే బయటకు తీసుకుపోవచ్చు ట్యాంక్‌లో పదిలీటర్ల పెట్రోల్ ఉంది మనకి టైం దొరికిన తర్వాత రిజిస్ట్రేషన్ నీ పేర్న మార్చుదాం "

శివాజీ తలఊపి వ్యాన్‌గార్డ్ డోర్ తెరిచి డ్రైవింగ్‌సీట్‌లో కూర్చున్నాడు రజని తన పక్కసీటు ఆక్రమించగానే ఇంజన్ స్టార్ట్ చేశాడు

యాదగిరి కుడిచెయ్యి ఎత్తి బొటనవేలు పైకి లేపాడు శివాజీ తల ఆడించి వ్యాన్‌గార్డ్ ముందుకు దూకించాడు

"మనం ఇపుడు ఎక్కడికి వెడుతున్నాం" రజని అడిగింది

"టెలిఫోన్స్ డిపార్ట్‌మెంట్‌కు. అక్కడ మనం సుమారు ఒక యాభైవేలు ఖర్చుపెట్టాలి "

"యాభైవేలా" రజని ఆశ్చర్యంగా అడిగింది

"అవును యాభైవేలు, కాశీప్రసాద్‌లాంటి బిజినెస్ మాగ్నెట్‌ఫోన్ ట్యాప్ చేయాలంటే ఆ మాత్రం డబ్బు ఖర్చుపెట్టక తప్పదు "

"నువ్వు ఏమంటున్నావో నాకు అర్థం కాలేదు "

"ఓ అరగంట ఆగు. నీకే అర్థం అవుతుంది "

శివాజీ వ్యాన్‌గార్డ్ టెలిఫోన్స్ డిపార్టుమెంట్ వాళ్ల ఆఫీసు ముందు పార్క్ చేశాడు

సెక్యూరిటీ మనిషి శివాజీని, రజనిని గేటు దగ్గర ఆపాడు

"మా ఫోన్ అబ్జర్వేషన్‌లో ఉంచాలి అందుకని "

సెక్యూరిటీ మనిషి శివాజీ మాటలు పూర్తి కాకుండానే చెప్పాడు. "నాలుగో ఫ్లోర్‌లో ఏడో నెంబర్ రూంలోకి వెళ్లండి. అక్కడ మీ పని పూర్తి అవుతుంది " శివాజీ తలఊపాడు. రజని తన వెంటరాగా లిఫ్ట్ మీదుగా నాలుగో ఫ్లోర్‌లో ప్రవేశించి ఏడో నెంబర్ రూంలో అడుగు పెట్టాడు అక్కడ లావుగా, నల్లగా, పొట్టిగా ఉండి డిటెక్టివ్ నవల చదువుకుంటున్న మనిషి దగ్గిరికి వెళ్లి అడిగాడు.

"నాకు బెదిరింపు ఫోన్లు వస్తున్నాయ్ మా ఫోన్ అబ్జర్వేషన్‌లో పెట్టాలి "

ఆ వ్యక్తి తను చదువుతున్న డిటెక్టివ్ నవల క్రిందపెట్టి టేబుల్ సొరుగు తెరిచి ఒక అప్లికేషన్ ఫాం తీసి శివాజీ ముందుకుతోసి చెప్పాడు

"మీరు ఈ అప్లికేషన్‌ఫాం పూర్తి చేయండి దానిమీద మా జి యం సంతకం పడిన తర్వాత మీ ఫోన్ అబ్జర్వేషన్‌లో ఉంటుంది. మా జి.యం. ఊళ్లోలేడు ఈ రోజు సాయంత్రం వస్తాడు ఆయన సైన్‌చేసిన తర్వాత మీ ఫోన్ అబ్జర్వేషన్‌లో ఉంటుంది "

శివాజీ అలాగా అన్నట్లు తల ఊపాడు

తను తొడుక్కున్నజర్కిన్ లోపలివైపు జేబునుంచి అయిదు వందల రూపాయల కట్ట తీసి అందులో నోట్లు సరిగ్గా ఉన్నాయో లేదోనని చూసుకుని తిరిగి జర్కిన్ లోపలివైపు జేబులోకి తోసేసి జిప్పు లాగేశాడు

శివాజీ చేతిలో ప్రత్యక్షం అయిన అయిదు వందల రూపాయల నోట్లకట్ట వంక ఆ వ్యక్తి మెరుస్తున్న కళ్లతో చూశాడు.

"మీకు కలర్ టి.వి ఉందా?"

"ఉంది ఇన్‌స్టాల్‌మెంట్‌లో కొన్నాను."

నోట్లకట్ట చూడగానే ఆ వ్యక్తి కంఠంలో వినయం తొంగి చూస్తోంది.

"వి సి.ఆర్. ఉందా?"

"ఉంది అది కూడా ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో నే కొన్నాను.

"ఫ్రిజ్"

"ఉంది అది కూడా ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో కొన్నాను "

"కారు"

"లేదు దాన్ని ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో కొనే స్తోమతులేదు ."

"యాభైవేలు పెడితే మంచి కండిషన్‌లో ఉన్న సెకండ్‌హాండ్ ఫియట్ వస్తుంది మనం బయటకు వెళ్లి ఏదన్నా రెస్టారెంట్‌లో కూర్చుని మాట్లాడుకుందామా"

ఆ వ్యక్తి సరేనన్నట్లు తలఊపాడు

శివాజీ రజని ఆ వ్యక్తితో కలిసి వ్యాన్‌గార్డ్‌లో ఇందు ఇంటర్నేషనల్ హోటల్ వైపు ప్రయాణించారు

ఆ వ్యక్తి తనపేరు రంగారావ్ అని చెప్పాడు

ముగ్గురూ హోటల్లో ఒక కార్నర్‌సీట్ దగ్గిర కూర్చున్నారు

శివాజీ మూడు కాఫీకి ఆర్డర్ చెప్పి రంగారావ్ వంక తిరిగి అన్నాడు

"నీకు కాశీప్రసాద్ తెల్సా"

"తెలుసు ఆయన్ను స్వయంగా చూశాను కూడా మొన్నీ మధ్య ఆయన మా జి యం ని కలిసి తనకు బెదిరింపు ఫోన్లు వస్తున్నాయనీ తనఫోన్ అబ్జర్వేషన్‌లో ఉంచాలనీ చెప్పాడు."

"కాశీప్రసాద్ ఇవ్వాళో రేపో మీ డిపార్టుమెంట్‌కు వస్తాడు. ఇక తన ఫోన్ అబ్జర్వేషన్‌లో ఉంచవద్దని చెప్తాడు అపుడు మీ జి యం కి కాశీప్రసాద్ ఫోన్ అబ్జర్వేషన్‌లోనించి తీసేశాం అని చెప్పండి కాని అతడి ఫోన్ నేనువద్దు అని చెప్పినదాకా అబ్జర్వేషన్‌లో ఉంచండి నేను అడిగినపుడు అబ్జర్వేషన్ సమయంలో కాశీప్రసాద్‌కు వచ్చిన ఫోన్లను రికార్డుచేసిన క్యాసెట్ తెచ్చి ఇవ్వాలి "

రంగారావు తల ఊపి చెప్పాడు

"కాశీప్రసాద్ ఫోన్ యూనిట్‌ని, రికార్డింగ్ యూనిట్‌తో కలిపే స్విచ్ క్రిందికి నొక్కితేచాలు అతడికి వచ్చిన ఫోన్స్ అన్నీ రికార్డ్ అయిపోతూ ఉంటై. మీరు ప్రామిస్ చేసిన యాభైవేలూ ఇస్తే అతడికి వచ్చిన ఫోన్‌కాల్స్ అన్నీ మరొక క్యాసెట్‌లోకి ఎక్కించి మీకు ఇస్తాను."

## హిట్‌లిస్ట్

శివాజీ అయిదువంద రూపాయల నోట్లకట్ట తీసి రంగారావ్‌కు అందించి చెప్పాడు

"నాకు పని పూర్తికావాలి డబ్బు తీసుకున్న తర్వాత పనిపూర్తి కాకపోతే పరిస్థితి చాలా తీవ్రంగా ఉంటుంది "

"మరేం పర్లేదు కాశీప్రసాద్‌కి వచ్చే ఫోన్లు రికార్డ్‌చేసి ఆ క్యాసెట్ మీకు అప్పగించే బాధ్యతనాది " భరోసాగా అన్నాడు రంగారావ్

సర్వర్ తెచ్చిన కాఫీ తాగిన తర్వాత ముగ్గురూ బయటకు నడిచారు రంగారావ్‌ను శివాజీ అతడి ఆఫీస్ ముందు డ్రాప్‌చేసి వ్యాన్‌గార్డ్ ముందుకు దూకించాడు తిరిగి వెళ్లేటపుడు దారిలో సన్నటి నైలాన్‌తాడు కొన్నాడు

ఇరవై నిమిషాల ప్రయాణం తర్వాత వ్యాన్‌గార్డ్ శివాజీ రజనిలు దాక్కున్న చింతచెట్ల తోపులోకి ప్రవేశించింది

కురియన్ ఇంకా స్పృహ లేకుండా అక్కడే పడి ఉన్నాడు శివాజీ అతడిమీద కప్పిన ఎండుటాకులు పక్కకి తప్పించాడు అతడిజుట్టు పట్టుకుని ఈడ్చుకుంటూ నీటికొలను దగ్గరికి వెళ్లి అతడితల నీళ్లలో ముంచి రెండు నిమిషాల తర్వాత పైకి తీశాడు చల్లటి నీళ్లు తగలడం ఆపైన ఊపిరి ఆడకపోవడంతో కురియన్‌కు స్పృహ వచ్చింది కురియన్‌కు స్పృహ రాగానే శివాజీ అతడి మూతిమీద బలంగా బూటుకాలితో ఒక్క తన్ను తన్నాడు

కురియన్ ఆర్తనాదం చేశాడు అతడి ముందుపళ్లు రెండు ఊడి పోయాయి రక్తం బొటబొటా కారసాగింది

"నన్ను చిత్రహింస పెట్టకు ఒకేసారి చంపేయండి"

ఏడుస్తూ అన్నాడు కురియన్

పళ్లు ఊడిన చోటు నుంచి కారుతున్న రక్తం ఆగిపోయిన తర్వాత శివాజీ కురియన్ తల మరొకసారి నీటకొలనులో ముంచి పైకి తీశాడు

ఇపుడు అతడి ముఖం మీద రక్తపు మరకలులేవు శివాజీ కురియన్ జుట్టుపట్టుకుని తలవెనక్కు విరిచిపట్టి అడిగాడు

"నీకు ఇపుడు ఎర్రతేలు ఎక్కడ ఉంటాడో తెల్సా?"

కురియన్ తెలుసుఅన్నట్టు తల ఊపాడు

"ఇపుడు నువ్వు వాడికి ఫోన్ చేసి నీ ఇంటికి రమ్మని చెప్పాలి

కురియన్ తల ఊపాడు

శివాజీ రజనితో అన్నాడు

"రజనీ ఈ సారి నువ్వు డ్రైవ్‌చెయ్ నేను వీడితో వెనకసీట్లో కూర్చుంటాను "

రజని తలఊపింది

శివాజీ కురియన్ కాళ్లకు చేతులకు కట్టిన అడవి మల్లెతీగలు విప్పేశాడు అతడ్ని ఈడ్చుకుంటూ వెళ్లి వ్యాన్‌గార్డ్ వెనకసీట్లోకి విసిరాడు

రజని ఇంజిన్ స్టార్ట్‌చేసి వ్యాన్‌గార్డ్‌ను రోడ్డుమీదికి తెచ్చింది డ్రైవింగ్‌లో రజని మంచి ఎక్స్‌పర్ట్

శివాజీ హ్యాండ్ కర్చిప్‌తో జర్కిన్ జేబులో ఉన్న రివాల్వర్ పైకి తీశాడు అది కురియన్ రివాల్వర్- హ్యాండ్‌కర్చిప్ సహాయంతో తన వేలి ముద్రలు పడకుండా జాగ్రత్తపడుతూ కురియన్ డొక్కలో రివాల్వర్ బ్యారెల్ గుచ్చాడు

కురియన్ పాలిపోయిన ముఖంతో శివాజీవంక చూశాడు

"మరేం భయపడకు నిన్ను చంపేది నేనుకాదు. ఎర్రతేలు అదీకాక ఎర్రతేలు చంపే సమయంలో నేను అక్కడ ఉండనుకూడా" అన్నాడు శివాజీ

"ఎటువైపు వెళ్లాలి" రజని అడిగింది

"జగదాంబనగర్ వీడు ఉండేది అక్కడే మరో విషయం ఎవడైనా జామై ఉస్మానియా నుంచి ఆటోలో జగదాంబనగర్ రావాలంటే ఎంతసేపు పడుతుంది "

"అరగంట"

"జగదాంబనగర్ ముందు ఒక టెలిఫోన్‌బూత్ ఉంది అక్కడ కారు ఆపు "

రజని తలఊపి యాక్సిలేటర్ బలంగా నొక్కింది

మరుక్షణం వ్యాన్‌గార్డ్ వేగం పుంజుకుని పరుగిడ సాగింది

(ఇంకా వుంది)


















# హలో! డాక్టర్ నేనేం చెయ్యాలి?



డా. కొత్త రవీంద్రబాబు

రాము, రమేష్, శీను, ప్రమోద్, కల్లూరు.

"ముఖంమీద సన్నని రంధ్రాలు పడి అవి యింకా వెడల్పైపోతూ ముఖం వికారంగా అవుతున్నది. సబ్బులు, పౌడర్లు, తులసిరసం వాడినా ప్రయోజనంలేదు ఆరు నెలలనుండి.

సబ్బులు, పౌడర్లు వాడవద్దు. పండ్లు, పాలు, కారట్, గుడ్లు ఎక్కువ తీసుకోండి ఎస్కజిన్ గొట్టం రోజు కొకటి, సైబిలాన్ ఫోర్ట్ గొట్టం రోజు కొకటి భోజనానంతరం రెండు నెలలు వాడి చూడండి ఫలితవుంటే మరో ఆరు నెలలు వాడండి

చేతులమీద చర్మం ఉల్లిపొరలా వూడిపో తున్నది. ముడతలు పడుతున్నది.

ఏరోవిట్ బిళ్ళలు ఉదయం సాయంత్రం జింకోఫర్ గొట్టాం రాత్రి భోజనానంతరం రెండు నెలలు వాడి ఫలితంవుంటే మరో ఆరు నెలలు వాడండి

చిగుళ్ళనుండి రక్తం చీము వస్తున్నది. వాసన- గవర్నమెంట్ ఆస్పత్రిలోని డెంటిస్ట్‌కు చూపి నందువలన ప్రయోజనం లేదు.

ఉదయం, రాత్రి పళ్ళు బ్రష్ చేసుకుని, భోజనానంతరం డెటాలిన్ మవుత్ వాష్ నీళ్ళలో కలుపుకుని పుక్కిలించి వుమ్మేసి, కోబాడెక్స్ ఫోర్ట్, చ్యూవీ బిళ్ళలు రోజు కొక్కటి చొప్పున రెండు నెలలు వాడండి పండ్లు తిన్నందువలన విటమిన్ సి పాలు గుడ్లు వలన కాల్షియం లభిస్తాయి.

గొంతు సన్నగా వుంది. ఆడగొంతు అని ఎగతాళి చేస్తున్నారు. వయసు 22 సంవత్సరములు. గొంతు బిగ్గరగా రావాలి.

ఒంటరిగా వున్నప్పుడు బిగ్గరగా అరవడం ప్రాక్టీస్ చెయ్యండి. సాధన వలన తప్ప మందులవలన మీ సమస్యకు పరిష్కారం దొరకదు

మాధవరావు, భిలాయ్

స్వయం తృప్తి అలవాటుంది. అంగం చిన్నదిగా వుండి గట్టి పడటంలేదు. త్వరగా స్ఖలిస్తున్నాను. పెళ్ళి కాబో తున్నది. భయంగా వుంది.

స్వయం తృప్తి మీద విరక్తి వలన అలా వున్నది నిర్భయంగా వివాహం చేసుకోండి. తర్వాత అవసరం అయితే మందులు చెబుతాను. ఇప్పుడు మీరు ఆందోళన చెందవలసిన అవసరం ఏమీ లేదు బహుశ వివాహం తర్వాత మీకే విధమైన సమస్య ఎదురు కాకపోవచ్చు. మనసులోని అనవసరపు అనుమానాలు పోగొట్టుకోండి

బి. శ్రీనివాసరావు, అనకాపల్లి

నాలుక కుడి పక్క ఎర్రగా గీతలా వుంది. డాక్టర్లకు చూపిస్తే ఏం పరవాలేదన్నారు.

డాక్టర్లు పరవాలేదన్నాక భయం ఎందుకు?'

కె. సుజాత, నగరి

శీర్షిక చాలా ఉపయోగకరంగా వుంది. మీకూ పత్రిక వారికీ అభినందనలు. 17 సంవత్సరముల వయసులో జుట్టు తెల్లబడుతుంది. రంగు వేసుకోవచ్చా? వేసుకుంటే వెంట్రుకలు ఎరుపు రంగులోకి మారుతాయా. నోటి దుర్వాసనకు డెట్టోలిన్ పనిచేయలేదు పంటి డాక్టరును సంప్రదించాలా?

కొంతమందికి చిన్నతనంలోనే జుట్టు తెల్లబడుతుంది కావాలనుకుంటే నల్లరంగు వేసుకోవచ్చు. జుట్టు ఎర్రగా మారితే మరలా రంగు వేసుకోవాలి డెట్టొలిన్ ఎక్కువ కాలం వాడండి పంటి డాక్టరు గారికి చూపించుకోండి

కె. అమ్మాజీ, వాల్తేరు

ఎందరికో వైద్య - సదుపాయం అందిస్తున్నందుకు కృతజ్ఞతలు. ఇంజక్షన్ చేసిన చోట గడ్డ కట్టింది. తెలిసిన వాళ్లకు అలాగే జరిగి ఎముక కాన్సరు అయింది.

ఇంజక్షన్ గడ్డ వలన ఎముక కాన్సరు రాదు. ఆ విషయంలో భయం వద్దు! నొప్పి తగ్గకపోతే డాక్టరుగారిని సంప్రదించండి.

కె. శైలజ, జంషెడ్‌పూర్

ఒంటరిగా వున్నప్పుడు వాగుతాను. అందరిలో మామూలుగా వుంటాను. వివాహం అయి పిల్లలు కల్గితే వాళ్ళుమామూలుగా వుంటారా? జ్ఞాపక శక్తి తగ్గింది.

ఒంటరిగా వుండవద్దు మీరనుకున్నట్లుగా అదేం పెద్ద సమస్య కాదు. ఏదో ఒక వ్యాపకం కల్పించుకోండి. పిల్లలు మామూలుగానే పుడతారు- ఏ లోపం లేకుండా! అనుమానం తీరకపోతే మానసిక వైద్యుని కలవండి. పని లేకుండా వున్నప్పుడే అనవసరపు భయాలు వెర్రి ఆలోచనలు వస్తాయి ఎన్ సి ఫబాల్ రోజు ఒకటి చొప్పున నెల రోజులు వాడండి

కె. శ్రీలత, హైదరాబాదు

సమకాలీన రచయితల మీద మీ అభిప్రాయం ఏమిటి?

నో కామెంట్!

శ్రీనివాస్, బి. ఎస్. ఎఫ్.

హస్తప్రయోగం అలవాటుండేది. ఒక అమ్మాయిని యీ జనవరిలో కలిశాను. నిముషంలో అవుటయ్యాను. రెండోసారి ప్రయత్నిస్తే అసలు తయారు కాలేదు. ఇదేవిధంగాపెళ్ళి అయినాక మొదటిరాత్రి జరిగితే? నేను నా భార్యను సుఖపెట్ట గలనా అని చాలా భయపడుతున్నాను.

తొందర, భయం అనుమానం తప్పు చేస్తున్నా నన్న భావన వలన అలా జరిగి వుండవచ్చు

వివాహం తర్వాత అలా జరుగకపోవచ్చు నిర్భయంగా వివాహం చేసుకోండి. వివాహం తర్వాత శీఘ్రస్ఖలనం వలన బాధ కల్గితే తగిన మార్గాలు, మందులూ వున్నాయి అవి యిప్పుడు మీకు అనవసరం!

## కళాపోషకుడు కిషోర్‌కుమార్

హిందీ చలనచిత్ర రంగంలో బహుముఖ ప్రజ్ఞాశాలి ఎవరయ్యా అంటే కిషోర్‌కుమారట గాయకుడిగానే కాకుండా సంగీత దర్శకుడిగా, సంపాదకుడిగా ప్రతిభా విశేషాలను చాటుకున్నారు. అంతేకాకుండా ప్రత్యేక పాత్రలలోను, హాస్య పాత్రలలోను ఎంతోమంది ప్రేక్షకులను మెప్పించి ఒక సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు. వైవాహిక జీవితంలో కూడా ఆయన ఎంతో అనుభవం సంపాదించాడు సినిమారంగంలో ప్రవేశించే నాటికే కిషోర్‌కు వివాహం అయింది. తర్వాత సినీనటి మధుబాలను పెళ్ళి చేసుకున్నాడట. ఆమె మరణానంతరం యోగితాబాలిని పెళ్ళి చేసుకొని ఆమెకు విడాకులిచ్చి లీనాచందావర్కర్‌ను పెళ్లాడాడు. మరింతమందిని పెళ్ళి చేసుకున్న కిషోర్ కళాపోషకుడు కాక మరేమిటి!

# అసూయా...నీపేరేమి?

రాజ్యలక్ష్మి కొలస్కార్

వంచిన తల ఎత్తకుండా, పరిపూర్ణమైన ఏకాగ్రతతో పని చేసుకుపోతోంది లలిత. సహోద్యోగులలో కొంతమంది లోకాభిరామాయణం వేసుకుంటుంటే మరికొంతమంది బ్యాంక్ పాలిటిక్స్ చర్చించుకుంటున్నారు.

లలితకి మాత్రం వీటిలో ఆసక్తి వుండదు. తనపనేమో తనేమో అంతే! ఓచర్స్ నుంచి లెడ్జర్ పేజీల్లోకి, లెడ్జర్ పేజీల నుంచి ఓచర్స్‌కి ఆమె కళ్లు చురుగ్గా కదులుతూ, అక్వేరియమ్‌లో ఈదే చేపపిల్లల్ని గుర్తు తెస్తున్నాయి.

పని చేస్తున్నట్లు నటిస్తూ, రెండు నిమిషాలకోసారి ఆమె వైపు పక్క చూపులు చూస్తున్నాడు ఆచారి. ఆ చూపుల్లో మోహం లేదు, కోరిక లేదు. అదొక రకమైన హేళన వుంది. చులకన భావం వుంది. కోపం, పగ, అసహ్యం మిళితమైన ఒక విచిత్రమైన భావన వుంది. అన్నిటినీమించి దేనికోసమో ఎదురుచూస్తున్నట్లున్నాయా చూపులు.

లలిత ముందున్న లెడ్జర్స్ అన్నిటిలోనూ పని అయిపోయింది. టైము చూసుకుంది. నాలుగు గంటలయింది. "కనీసం గంట టైముంది" అనుకుంటూ చకచక టేబిల్ క్లియర్ చేసింది. డ్రాయర్‌లోనుంచి అకౌంటెన్సీ టెక్స్ట్‌బుక్ తీసింది. రెండు నిమిషాల్లో అందులో లీనమైపోయింది.

ఆచారి తన నిరీక్షణ పూర్తయినట్లు తల పంకించాడు. నెమ్మదిగా మేనేజరు రూమ్‌లోకి దారి తీశాడు. పది నిమిషాలయిన తరువాత బయటకొచ్చి తన సీట్లో కూర్చున్నాడు. వెంటనే మేనేజరు గదిలోంచి బజ్జర్ మోగింది.

"మేడమ్! మిమ్మల్ని మేనేజరు పిలుస్తున్నారు." ప్యూన్ మారుతి లలిత దగ్గరకొచ్చి చెప్పాడు.

"ప్లీజ్ టేక్ యువర్ సీట్" వినయంగా తన ముందు నిల్చున్న లలితకు కుర్చీ చూపించాడు మేనేజరు.

"మీరు బ్యాంక్‌లో కూర్చుని పుస్తకాలు చదువుతున్నట్లు తెలిసింది. మీ సీట్లో చాలా పని పెండింగ్‌లో వుందని కూడా విన్నాను. దిస్ ఈజ్ నాట్ నైస్ ఆన్ యువర్ పార్ట్."

వార్తాహరుడెవరో లలితకి తెలుసు. అందుకే ఎవరు చెప్పారు సర్ అని ప్రశ్నించలేదు. సూటిగా మెల్లిగా సమాధానం చెప్పింది. "నా సీట్‌లో పని ఏమాత్రం పెండింగ్ లేదు సర్! కస్టమర్లందరికీ స్టేట్‌మెంట్లు పంపించేశాను. బాలెన్స్ టాలీ అయిపోయాయి. ఈరోజు పని కూడా పూర్తయింది. నాకు గాసిప్‌లో పాల్గొనటం ఇష్టం వుండదు సర్! అందుకే ఖాళీ టైమ్‌ను బ్యాంక్ పరీక్షలకై వినియోగిస్తున్నాను సర్! నేను సైన్స్ గ్రాడ్యుయేట్‌ని. ఈ పరీక్షల వల్ల నాకు బ్యాంకింగ్ నాలెడ్జి పెరిగి పనిలో నేర్పు పెరుగుతుందనే వుద్దేశ్యంతో దొరికిన ప్రతిక్షణం చదువుకుంటున్నాను సర్."



మేనేజరుకి ఏమనాలో తోచలేదు. అంత మాత్రాన ఓటమి అంగీకరించటం ఇష్టంలేదు.

"మీరు ఆఫీసరై వుండి, క్లరికల్ స్టాఫ్‌కి ఒక చెడ్డ ఉదాహరణగా నిలవకూడదు. మిమ్మల్ని చూసి రేపట్నుంచి వాళ్లందరూ మేగజైన్స్, నవలలు చదవటం మొదలెడతారు."

"సర్ నేను మీకు చెప్పగలిగే దాన్నికాదు. కాని నవలలు చదవటాన్కి, బ్యాంకింగ్ లా అండ్ ప్రాక్టీస్ చదవటాన్కి చాలా తేడా లేదాసర్? నిజంగా నన్ను చూసి వాళ్లు కూడా ఈ సబ్జెక్ట్స్ చదవటం మొదలెడితే బ్యాంక్‌లో ఫ్రాడ్స్ జరగటాన్కి అవకాశం చాలా తక్కువవదా సర్?"

మేనేజరు లలిత మాటలు విన్పించుకోలేదు. "రేపట్నుంచి మీ సీటు మారుస్తున్నాను. స్టేట్‌మెంట్స్ సీటులో పన్జెయ్యండి."

లలిత ప్రాణం వుసూరుమంది. ఆ సీట్లో పని అవటం అంటూ వుండదు. ఇంక తను బ్యాంక్‌లో చదువుకోవటాన్కి వీలుండదు. నిరుత్సాహంగా బయటకి నడిచి తన సీట్లో కూలబడింది. టేబిల్‌పై తెరిచివున్న అకౌంట్స్ పుస్తకాన్ని కోపంగా మూసేసింది. ఇదంతా ఆ ఆచారి మూలంగానే. అసలు తన్ని చూసి ఎందుకలా ఏడ్చుకుంటాడు? తను బ్యాంక్‌లో జాయినయినప్పట్నుంచీ ఇదే వరస. తన ప్రతి కదలికనీ భూతద్దంలోంచి పరిశీలించటం, సీనియర్ మోస్ట్ ఆఫీసర్ హోదాలో తనని సాధించడం, మేనేజరుకి చాడీలు చేరవేయటం! "మేడమ్ ఈరోజు అయిదు నిమిషాలు ముందు వెళ్లిపోయింది. మేడమ్ ఆఫీసవర్స్‌లో వుత్తరం వ్రాసింది" ఇలాంటివే! స్కూలు పిల్లల్లాగా ఇతను పితూరీలు చెప్పటం! ఆ మేనేజరొకడు. ఇతను చెప్పటం ఆలస్యం తనని క్యాబిన్‌లోకి పిలవటం, సంజాయిషీ అడగటం! బాధ్యతాయుతమైన పదవిలో వుండీ స్వంత ఆలోచన, అబ్జర్వేషన్ లేకుండా ఎలా వుంటారో! లలితకి తను చిన్నప్పుడు చదువుతున్న పంచతంత్రంలోని ఒక నీతి గుర్తొచ్చింది. "మూర్ఖుడైన రాజు కొలువులో పనిచేయుటకంటే వస్తులుండటం మంచిది" అలా అనుకుని మానెయ్యలేదు.

ఆచారి ఒక్కోసారి కస్టమర్సు ముందు అవమానకరంగా మాట్లాడుతాడు. తను మాటకి మాట సమాధానం చెప్తే అసహ్యంగా చేపల బజారులా తయారవుతుందని తనని తాను నిగ్రహించుకుంటుంది. ఇతని ప్రవర్తన ఇచ్చిన ధైర్యంతో కొంతమంది మగ క్లర్కులు కూడా పొగరుబోతుతనంగా మాట వినకుండా ప్రవరిస్తుంటారు. సామాన్యంగా లలిత సహనం కోల్పోదు. రెండు మూడు సార్లు మాత్రం అన్పించింది. "ఈ వెధవలమధ్య ఉద్యోగం చెయ్యకపోతేనేం" అని. అంతలోనే ఆమెలోని వివేకం మేల్కొనేది. కేవలం ఒక అనాగరికుడి మూలంగా తను ఉద్యోగం వదిలేసుకోవటమా? ఇంకోచోట మాత్రం ఇలాంటి వాళ్లు వుండరని నమ్మకమేమిటి? ఈ ప్రపంచాన్ని చెయ్యటాన్కి అన్ని రకాల మనుషులు కావాలి! తను మేనే

జిమెంట్ ట్రయినింగ్‌కి వెళ్లినప్పుడు ఏం చెప్పారు? "నువ్వు ప్రపంచాన్ని మార్చలేవు. నిన్ను నువ్వు మాత్రం మార్చుకోగలవు" అందుకే క్రమంగా తామరాకు మీద నీటిబొట్టులా ఉండటం అలవాటు చేసుకోసాగింది.

*************

"మేడమ్! మేనేజరు పిలుస్తున్నారు" మారుతి లలిత దగ్గరకొచ్చి చెప్పాడు.

ఉద్యోగంలో చేరిన కొత్తలో ఈ విధంగా పిలుపు వచ్చినపుడు లలితకి బోల్డెంత భయం

## అనూయా...నీ పేరేమి?

వేసేది. గుండెలు దడదడ లాడుతుంటే కాళ్లు చేతులు వణికేవి. ఆచారి పుణ్యమా అని అల వాటయిపోయిందిప్పుడు. యాంత్రికంగా లేచి కేబిన్‌లోకి నడిచింది.

మేనేజరు ముఖం ధుమధుమలాడుతోంది. ఇప్పుడో మరో క్షణంలోనో ఉరిమి పడబోయే పిడుగులా వుంది.

లలితకి కొద్దిగా భయమేసింది. ఏం చేసింది తను? తన ఇటీవలి ప్రవర్తనని పర్యావలోకనం చేసుకుంది. కరెక్ట్‌గా టైముకి వచ్చి వెళుతుంది. ఆఫీసులో పుస్తకాల మాట దేవుడెరుగు తనకి వచ్చిన వుత్తరాలు కూడా ఒకటికి రెండుసార్లు చదవటం లేదు. అయినా తినబోతూ రుచులడగటమెందుకు? చెప్తాడుగా!

మేనేజరు లలితని కూర్చోమనలేదు. చేతిలోవున్న కాగితాలు విసురుగా టేబిల్ మీద పడేశాడు.

"ఇది మొన్న మీరు పంపించిన స్టేట్‌మెంట్స్. జోనల్ మేనేజరు ఘాటుగా వుత్తరం వ్రాసి తిప్పి పంపించాడు. అన్నీ అబ్సర్డ్ నంబర్స్. మీ నిర్లక్ష్యం పుణ్యమా అని నాకు అక్షింతలు పడ్తున్నాయి. ఇలా జరగటం ఇది మొదటిసారి కాదు. ఇంతకుముందు కూడా రెండు మూడు లెటర్స్ వచ్చాయి. స్టేట్‌మెంట్స్‌లో అన్నీ తప్పులుంటున్నాయి. ఒళ్లు దగ్గరుంచుకుని ప్రిపేర్ చెయ్యాలి. మీరు ఆఫీసరు. బాధ్యాతయుతంగా పని చెయ్యాలి. మీరు చేసిన పని



కూడా మరెవరో చెక్ చెయ్యాల్సి రావటం హాస్యాస్పదం ఇది మీకు లాస్ట్ వార్నింగ్ ఇంకోసారిలా జరిగితే మీకు మెమో ఇవ్వాల్సి ఉంటుంది" లలితకి మతిపోయింది సమాధానం చెప్పటాన్కి మాటలు దొరకలేదు కింకర్తవ్య •విమూఢురాలిలా మేనేజరు వైపు అర్థరహితమైన చూపులు చూస్తూ నిల్చుండి పోయింది

మేనేజరు అనీజీగా అటూ ఇటూ కదిలాడు కొంపతీసి ఏడవటం మొదలెట్టదు కదా! ఈ ఆడవాళ్లతో ఇదో గోల పని సరిగ్గా చేయరు ఏమైనా అంటే కళ్లవెంట కాలువలు కట్టించేస్తారు

"ప్లీజ్ గో అండ్ కరెక్ట్ దట్" గబగబ చెప్పేసి ఫైలులో తల దూర్చేశాడు

మెల్లిగా ఆయన ముందున్న స్టేట్‌మెంట్ తీసుకుని బయటకొచ్చింది

మేనేజరు అరుపులు బయటకి విన్పించాయి కాబోలు అందరూ లలిత వంక ఆసక్తిగా కుతూహలంగా దొంగచూపులు చూడసాగారు లలిత అవేమీ గమనించే స్థితిలో లేదు

తను అంత ఘోరమైన తప్పులు ఎలా చేసింది? ఏ పనైనా ఎంతో శ్రద్ధతో నేర్చుకుని మరింత శ్రద్ధగా చేస్తుంది కదా!

"నీవు ఏ పని చేసినా అది కేవలం పాచి వూడ్చటమే అయినా, దాన్ని నీ కంటే మరెవ్వరూ బాగా చెయ్యలేని విధంగా చెయ్యాలి" అని ఎక్కడో చదివింది లలిత దాన్ని తన కోట్స్ పుస్తకంలో నోట్ చేసుకోవటమే కాక అనుక్షణం గుర్తుంచుకుని తన శాయశక్తులా అమలు చెయ్యటాన్కి ప్రయత్నిస్తుంది లలిత మొదటిసారి జోనల్ ఆఫీసు నుంచి ఆమె చేసిన స్టేట్‌మెంట్స్ గురించి లెటరు వచ్చినప్పుడు ఎంతో బాధ పడింది అప్పట్నుంచీ మరింత జాగ్రత్తగా చేస్తోంది అయినా సరే ఇలా జరిగిందేమిటి? తనకి ఆమ్నీశియా, సడెన్ బ్లాకవుట్ వంటివేమీ రావటం లేదు కదా! ఇలా అనుకోగానే లలితకి భయమేసింది "ఈరోజు సాయంత్రం డాక్టరు దగ్గరకెళ్లి ఒకసారి చెకప్ చేయించుకోవాలి" తీర్మానించుకుని స్టేట్‌మెంట్ ముందేసుకుంది ఫైలింగ్ కాబినెట్ నుంచి ఆ స్టేట్‌మెంట్‌కి సంబంధించిన ఫైలు తీసింది అందులో దాని ఆఫీసు కాపీ అంటే కార్బన్ కాపీ వుంది హెడ్డాఫీసు నుంచి తిరిగి వచ్చిన ఒరిజినల్, ఆఫీసు కాపీ పక్క పక్కన పెట్టి ఆలోచనల్ని పక్కకి నెట్టి వాటిని పరిశీలించటంలో మునిగిపోయింది పది నిమిషాలయ్యేసరికి అంతా అయోమయంగా అన్పించసాగింది పజిల్‌మెంట్‌తో కనుబొమలు ముడిపడ్డాయి కళ్లు నులుముకుని చూసింది లేచి కూలర్ దగ్గర కెళ్లి కళ్లమీద చన్నీళ్లు చల్లుకుని వచ్చి మళ్లీ చూసింది తను చూస్తున్నది భ్రమకాదు నిజమే! ఒరిజినల్‌లోనూ ఆఫీసు కాపీలోను కొన్ని కొన్ని నంబర్లు వేరు వేరుగా వున్నాయి ఇంపాసిబుల్ తను కార్బన్ పెట్టి స్టేట్‌మెంట్ చేసింది పంపేముందు ఏదీ కరెక్ట్ చేసినట్లు గుర్తులేదే! మరేమిటీ పజిల్? లలిత తీవ్రంగా ఆలోచించసాగింది

మెరుపు మెరిసినట్లు ఆమె బుర్రలో సొల్యూషన్ ఫ్లాష్ అయింది ఒరిజినల్‌ని మరింత దగ్గరగా పరిశీలించింది సందేహం లేదు అక్కడకూడా కొన్ని నంబర్లు జాగ్రత్తగా చెరిపి వాటిస్థానే అబ్సర్డ్ నెంబర్లు వేశారెవరో తనవల్ల పొరపాటు జరిగితే ఒకటి రెండు పర్సెంట్ జరగవచ్చు అంతేకాని ఒకదానికొకటి సంబంధం లేకుండా ఇలాంటి అంకెలు మతి చలించితేనే వెయ్యటం జరుగుతుంది

తీవ్రాలోచనలో పడింది లలిత ఎవరికి ఈ అవకాశం వుంది? తను స్టేట్‌మెంట్ చేసి మేనేజరు దగ్గరకి పంపిస్తుంది ఆయన సంతకం చేసి డిస్పాచ్ సెక్షన్‌కి పంపిస్తారు అక్కడ్నుంచే ఏం జరిగినా! డిస్పాచ్ క్లర్కుతో తనకి శత్రుత్వమేమీ లేదు డిస్పాచ్ ఎవరు చెక్ చేసేది? ఆచారి! సడెన్‌గా గుర్తొచ్చింది వెంటనే మరో విషయం కూడా గుర్తొచ్చింది రెండు మూడు నెలల క్రితం అతను మారుతితో బాల్ పెన్ వ్రాత చెరిపే రబ్బరు తెప్పించాడు

మరోసారి స్టేట్‌మెంట్ పరీక్షగా చూసింది.

అవును కాజువల్‌గా చూస్తే అన్ని అంకెలు ఒకలానే వున్నాయి కాని దగ్గరగా చూస్తే అక్కడక్కడా చేతి వ్రాతలో తేడా తెలుస్తోంది

మరి ఆలస్యం చెయ్యకుండా ఫైలు తీసుకుని కేబిన్‌లోకి ప్రవేశించింది లలిత ఒరిజినల్ ఆఫీసు కాపీ మేనేజరు ముందుంచి తన దృఢ సందేహాన్ని వివరించింది మేనేజరు కూడా పరీక్షగా చూశాడు ఆచారిని లోనికి పిలిపించాడు

ఆచారికి ఆనందం వేసింది ఇన్నాళ్లకి తన ఎదుటగా ఆవిడ్ని మేనేజరు చివాట్లు పెట్టి అవమానిస్తాడు తనే పెద్ద తెలివయినదాన్నట్లు పొగరుగా ప్రవర్తిస్తుంది ఈ దెబ్బతో పొగరణుగుతుంది కాలరు సర్దుకుంటూ ఆనందంగా ప్రవేశించాడు వెంటనే కన్పించాయి పరిచివున్న స్టేట్‌మెంట్లు ఉత్సాహం స్థానే భయం చోటుచేసుకుంది అతని మొహాన్నే పరిశీలనగా చూస్తున్నాడు మేనేజరు అందులో మారిన రంగులు అతనికి నిజాన్ని చెప్పాయి

సూటిగా విషయానికొచ్చాడు మేనేజరు



## కిమీకాట్కార్ ఫొటోగ్రాఫర్ భర్త

టార్జాన్ సుందరి కిమీకాట్కార్ చాలా మంది హీరోలతో ప్రేమాయణం సాగించింది అన్న నిందలకి గురి అయింది కాని పాపం చివరికి ఫోటోగ్రాఫర్ శంతను ఘోరీని పెళ్లి చేసుకొని - అందర్నీ పిలిచి విందు భోజనం కూడా పెట్టింది - "శంతను"కి దళసరి గెడ్డం వుంది - అయితేనేం కిమీకాట్కార్‌కి అభ్యంతరం లేదు అన్నది మరో సెక్సు సింబల్ సోనమ్ కూడా సినిమా హీరోల వేటమానేసింది డైరెక్టర్ రాజీవ్‌రాయిని ఆమె వివాహం ఆడబోతున్నట్లు సినీ పత్రికల విలేఖరుల "కూపీ"

## ఉర్దూ రచయిత్రికి జ్ఞానపీఠ్ అవార్డు

ప్రముఖ ఉర్దూ రచయిత్రికి ప్రతిష్ఠాకరమైన జ్ఞానపీఠ్ అవార్డు లభించింది. 1989 సంవత్సరానికి ఈ అవార్డు ఖుర్రతుల్- అయిన్- హైదర్‌కు ప్రదానం చేయబడింది.

సాహిత్యంలో విశేష ప్రతిభా పాటవాలు ప్రదర్శించే వారికి ఈ ప్రతిష్ఠాకరమైన అవార్డును బహూకరించటం జరుగుతుంటుంది.

1969-83 మధ్య హైదర్ వ్రాసిన అనేక రచనలను పరిశీలించిన మీదట అవార్డు కమిటీ హైదర్‌ను ఎంపిక చేసింది.



క్లుప్తంగా చెప్పి "ఇది ఆవిడ అనుమానం. మీ సమాధానమేమిటి?"

"అఫెన్స్ ఈజ్ ది బెస్ట్ డిఫెన్స్" అనుకున్నాడు ఆచారి. కోపంగా దబాయించాడు. "సర్! నాకేమీ తెలియదు. ఆవిడకి వర్క్ రాక ఇలాంటి ఎత్తులువేసి తప్పించుకుందామని చూస్తుంది."

లలిత కూడా గట్టిగా మాట్లాడటానికి నిర్ణయించుకుంది. ఎప్పటికప్పుడు పోనిమ్మని వూరుకుంటుంటే రోజు రోజుకీ డేంజరస్‌గా తయారవుతున్నాడు. గట్టిగా బుద్ధి చెప్పకపోతే ఎన్ని సంవత్సరాలీ టెన్షన్ భరించాలి?

"సర్! ఒరిజినల్ ఆఫీసు కాపీ రెండూ కంపేర్ చేసి చూస్తే ఈయన వాదనలో నిజమెంతో తెలుస్తుంది. ఆయన చేతి వ్రాతలా వున్న ఫైల్స్ లెడ్జర్స్, ఓచర్స్ తెప్పించి చూస్తే స్పష్టంగా తెలుస్తుంది. అంతకూ ఒప్పుకోకపోతే చేతివ్రాత నిపుణుల అభిప్రాయం తీసుకోవచ్చు. అసలు నేను ఈ బ్రాంచిలో జాయినయినప్పట్నుంచి నన్ను వేటాడి వేటాడి వేధిస్తున్నాడు సర్. ప్రతి చిన్న విషయానికి మీకు కంప్లైంట్ చెయ్యటం, నేను మీ దగ్గర్నుంచి వార్నింగులు అందుకోవటం నాకు జీవితం అన్‌ప్లెజంట్‌గా అవుతోంది సర్! ఈసారి నిజం తేలవలిసిందే!"

లలిత మాటలు మేనేజర్ని సూటిగా తాకాయి. తన తరువాత సెకెండ్ ఇన్ కమాండ్ కదా అనే ఉద్దేశ్యంతో అతని సలహాలని, మాటలని సీరియస్‌గా తీసుకుంటాడు. ఈవిడ విషయంలో ఎంత తెలివి తక్కువగా ప్రవర్తించాడు?

"ఏమంటారు ఆచారీ! ఇది చాలా సీరియస్ విషయం. ఎక్స్‌పర్ట్స్‌ని పిలిపిస్తే ఈ విషయం హెడ్డాఫీసు వరకు వెళ్లాలి. అందులో ఏదైనా రుజువయితే మీ కెరియర్ ఏమవుతుందో తెలుసనుకుంటాను! నా వుద్దేశ్యంలో దీన్నిక్కడే పరిష్కరించుకోవటం మంచిది."

ఆచారి ముఖం వాడిపోయింది. అంతవరకూ వున్న బింకం సడలిపోయింది. "నన్ను క్షమించండి సర్! మరెప్పుడూ ఇలా చెయ్యను!"

"నా కంటే ముందు ఆవిడ్ని క్షమాపణ కోరుకోవటం ఉచితం కదూ!"

"మేడమ్ క్షమించండి" గోడకి చెప్పినట్లు చెప్పి గబుక్కున లేచి వెళ్లిపోయాడు.

"మిస్ లలితా! ఇదొక దురదృష్టకరమైన సంఘటనగా భావించి మర్చిపోవటం మంచిదని నా వుద్దేశ్యం. ఒకచోట కలిసి పనిచేసేటప్పుడు, కోపం, ప్రతీకారం వంటివి మనసులో వుంచుకోవటం మంచిది కాదు. ఏమంటారు?"

"నా కభ్యంతరం లేదు సర్! ఆయన కూడా అలాగే అనుకుంటే?"

"అతని విషయం నేను చూసుకుంటాను అండ్ సారీ ఫ్రమ్ మైసైడ్."

"ఇట్సాల్‌రైట్" చిరునవ్వుతో చెప్పి తేలికయిన మనసుతో సీట్లోకి వెళ్లి కూర్చుంది.

*********

ఆరోజు లలిత బాంక్‌కి వచ్చేసరికి అందరూ బాగా సంతోషంగా వున్నారు.

"ఏమిటి విశేషం?" తన క్లర్కు జానకిని అడిగింది. "మేనేజరు రెండు నెలలు సెలవుమీద వెళ్తున్నారట, మన కింక ఫ్రీ" ఆనందంగా చెప్పింది జానకి.

మేనేజరు లేకపోతే అందరికీ ఆటవిడుపులాగా వుంటుంది. లేటుగా వచ్చి తొందరగా వెళ్లిపోవచ్చు. హాయిగా కబుర్లు చెప్పుకోవచ్చు. ఆచారిని కాకా పడ్తే మాటినీ సినిమాలక్కూడా పోవచ్చు.

వాళ్ల సంతోషం చూసి నవ్వుకుంది లలిత. "అల్ప సంతోషులు" అనుకుంది. అంతలోనే గుర్తొచ్చింది. మేనేజరు సెలవుతో ఆచారి యాక్టింగ్ మేనేజరు. తనని ఎన్ని తిప్పలు పెడతాడో ఏమిటో?

లలిత అనుమానాలు నిజం కాలేదు. ఆచారి ఆమె జోలికి రాలేదు. అసలు ఆమె వునికినే గమనించనట్లు ప్రవర్తించాడు. అదే హాయనుకుంది.

రెండు నెలలు విశేషాలు లేకుండా గడిచిపోయాయి. మేనేజరు వచ్చేశాడు. లలితకి టెన్షన్ దూరమయినట్లనిపించింది. ఎంత లేదనుకున్నా ఒక ఆఫీసులో పనిచేస్తూ ఒకళ్ల ముఖం ఒకళ్లు చూసుకోకుండా జాగ్రత్తపడాలంటే అదో రకమైన టెన్షన్‌గా తయారవుతుంది.

************************

"మేడమ్! మిమ్మల్ని మేనేజరు పిలుస్తున్నారు" చాలా రోజుల తరువాత మళ్లీ మారుతి వచ్చి చెప్పాడు లలితకి.

ఆయన ముఖం సీరియస్‌గా వుంది. చేతిలో ఏదో లెటరు వుంది. లలితకు కుర్చీ చూపించాడు. ఆమె కూర్చున్నాక ప్రశ్నించారు. "మిస్ లలితా!! నాలీవ్ పీరియడ్‌లో మీకేమైనా సమస్యలు ఎదురయ్యాయా?"

లలిత ఆశ్చర్యపోయింది. "లేదు సర్!"

"మరి ఎందుకు రిజైన్ చేశారు?"

ఈసారి లలిత ఆశ్చర్యానికి అవధుల్లేకపోయాయి. ఈయనకేమైనా పిచ్చి పట్టిందా? లేక తనకి పట్టిందా? తనేమిటి? రిజైన్ చెయ్యటమేమిటి?

"సర్! మీరనేది నాకేమీ అర్థం కావటం లేదు సర్."

"అర్థం కాకపోవడానికేముంది? ఇది హెడ్డాఫీసు నుంచి మిమ్మల్ని రిలీవ్ చేస్తూ వచ్చిన లెటరు. మీరు జనవరి 11వ తారీఖున "డొమెస్టిక్ ప్రోబ్లెమ్స్ మూలంగా నేను రిజైన్ చేస్తున్నాను. నన్ను వీలైనంత త్వరలో రిలీవ్ చెయ్యండి" అని ఇచ్చిన రాజీనామా లెటరుని సింపథటిక్‌గా కన్సిడర్ చేస్తూ రిలీవ్ చేస్తున్నామని పర్సొనెల్ డిపార్టుమెంటు నుంచి వచ్చింది లెటరు. నా కర్థం కానిదల్లా ఒక్కటే! సమస్యలు నాతో చర్చిం

చితే వాటి పరిష్కారానికి నా శక్తి మేరకు ప్రయత్నించేవాడిని కదా! ఇలాంటి డ్రాస్టిక్ స్టెప్ ఎందుకు తీసుకోవాలి? మేనేజరుండేది కేవలం బిజినెస్ మేనేజ్ చెయ్యడానికే కాదు. స్టాఫ్ ప్రోబ్లెమ్స్ కూడా పరిష్కరించటాన్కి ప్రయత్నించాలి."

లలితకి తల తిరుగుతున్నట్లుంది. ఈయన తన గోలే కాని తను చెప్పేదసలు వింటాడా? డెస్పరేట్‌గా అరిచింది. "సర్ నేను రిజైన్ చెయ్యలేదు సర్."

"వాట్ డు యూ మీన్? నువు రిజైన్ చెయ్యకుండా ఇదంతా ఎలా జరుగుతుంది?"

"నాకేమి తెలియదు సర్! ప్లీజ్ బి లీవ్ మి! నేను రిజైన్ చెయ్యలేదు."

మేనేజరు బుర్ర గోక్కున్నాడు. "ఈ అమ్మాయికి పిచ్చి పట్టింది లాగుందే" అచ్చం లలితలాగే అనుకున్నాడు. లేకపోతే మనసు మార్చుకుని ఈ విధంగా అంటుందా? అసలు ఈ కాలం పిల్లలకి మరీ తొందరపా టెక్కువ. ముందు బుడాబుడా ఆలోచించ కుండా ఏదో ఒకటి చేసెయ్యటం తరువాత పశ్చాత్తాపపడటం. ముందు రిజైన్ చేసేసి ఆ తరువాత మనసు మార్చుకోవడం ఎలా వీలవుతుంది? ఇదేమన్నా చిన్నపిల్లలాటా?"

లలిత పర్సనల్ ఫైలు తెప్పించాడు.

## అనూయా...నీ పేరేమి?

అందులో ఆచారి లలిత రిజిగ్నేషన్ ఫార్వర్డ్ చేసిన లెటరుంది. అతడ్ని పిలిపించాడు.

లలిత వంక కోల్డ్‌గా చూస్తూ చెప్పా డతను. "సర్ ఈవిడ స్వయంగా తన రెజిగ్నేషన్ లెటరు నా చేతికిచ్చింది. ఈవిడ స్వవిషయాలు పట్టించుకోవలసిన అవసరం నాకు లేదు. అందుకనే నేను వెంటనే ఫార్వర్డ్ చేశాను."

లలిత మ్రాన్పడిపోయింది. "అతని క్షమాపణని పిచ్చిదానిలా నమ్మింది. దెబ్బతిన్న త్రాచులా తనని కాటు వేయటాన్కి కాచుకు న్నాడని తెలుసుకోలేకపోయింది. తెలుసుకుని మాత్రం తనేం చేసి వుండేది? ఇంత నీచా నికి ఒడిగడ్తాడా? తనేం చెయ్యాలిప్పుడు?" లలిత తీవ్రంగా ఆలోచించసాగింది. "సర్! నేను వ్రాశానని ఇతనంటున్న ఆ లెటరు చూపించగలరా?"

ఆచారి సమాధానమిచ్చాడు. "ఒక్కటే కాపీ ఇచ్చింది సర్! దాన్ని నేను హెడ్డాఫీసుకి నా ఫార్వర్డింగ్‌తోపాటు పంపించేశాను."

లలిత నిర్ణయం తీసుకుంది "సర్! ఇందులో ఏదో ఫౌల్ ప్లే వున్నట్లు నాకు అనుమానంగా వుంది. నేను రిజైన్ చెయ్యలే దంటే మీరు నమ్మటం లేదు. మీ స్థానంలో నేనుంటే నేనూ నమ్మేదాన్ని కానేమో! మీరు సెలవిస్తే నేను ఈ విషయాన్ని సమూ లంగా పైకి తీస్తాను సర్! ఆడది కదా! ఏం చెయ్యగలదు అనే వుద్దేశ్యంతో ఎవరో నన్ని విధంగా సాధిస్తున్నారు. నేను ఢిల్లీ వెళ్లి మన ఛెయిర్మన్ కమ్ మేనేజింగ్ డైరెక్టరుని కలిసి ఇదంతా చెప్పి ఆయన పర్మిషన్ తీసుకుని, నేను వ్రాసి ఈయనికిచ్చానన్న ఆ లెటరు తీసుకుని పోలీసు కంప్లైయింట్ ఇస్తాను. ఆ లెటరు మీద ఎవరు ఫోర్జరీ చేశారో తేటతెల్లమ వుతుంది. మీరు ఫర్మిషనిస్తే నేను స్టేషన్‌కెళ్లి టికెట్ కొనుక్కుంటాను సర్" లలిత లేచి నిలబడింది. ఆమె కళ్లు జంట నక్షత్రా లలా అగ్నిజ్వాలల్ని విరజిమ్ముతున్నాయి. ఆ జ్వాలలు ముఖం అంతా ప్రసరించి అరుణో దయ సూర్యబింబంలా ఎర్రగా కందిపోయింది.

"సరే! వెళ్లిరండి. నానుంచి ఏదైనా సహాయం కావలసివస్తే ఢిల్లీ నుంచి ఫోన్ చెయ్యండి. విష్ యూ ఆల్ ది బెస్ట్."

బయటికి వెళ్ళబోతున్న లలిత ఎడంచే తిని రెండు చేతులతోనూ గట్టిగా పట్టేసు కున్నాడు ఆచారి. అతను మనిషి ఆపాద మస్తకం వణుకుతున్నాడు. చెమట్లు పట్టేస్తు న్నాయి. కళ్లనిండా చావు భయం, మాట్లా

డాలని ప్రయత్నిస్తున్నా నోట్లోంచి మాట బయటికి రావటంలేదు.

లలిత అతని చేతుల్ని పురుగుల్ని విదిలించినట్లు విదిలించింది. "యూ బ్లడీ రోగ్!" లలిత ఆవేశంతో ఒళ్లు మరిచిపోయింది. "ఇది నువ్వే చేశావని నాకు తెలుసు. అయినా సిస్టమేటిక్‌గా ప్రూవ్ చేసి నువ్వు తవ్వుకున్న గోతిలో నిన్ను సమాధి చెయ్యకపోతే నాపేరు లలిత కాదు."

ఆచారి గబుక్కున కుర్చీలోంచి జారిపోయి ఆమె కాళ్లు పట్టుకున్నాడు. ఒక వాక్యానికి మరో వాక్యానికి సంబంధం లేకుండా దాదాపు ఏడుస్తూ ఆమెను ప్రాధేయపడసాగాడు. "మేడమ్ పిల్లలు కలవాణ్ణి. జైలులో పడేస్తారు. నా భార్య వురేసుకుంటుంది. ఈసారికి - ఈసారికి."

లలిత అతని పట్టు వదిలించుకోవటాన్కి ప్రయత్నించసాగింది. అతను వుడుంలా పట్టుకుని వదలట్లేదు. ఆఖరికి మేనేజరు వచ్చి వదిలించాడు. అతనికి ఒక గ్లాసు నీళ్లిచ్చి శాంతపరిచి కుర్చీలో కూర్చోబెట్టారు. లలిత కూడా కూలబడింది. ఆమె కోపం మెల్ల మెల్లగా తగ్గుతోంది. "ఇదేదో సైకిక్ కేసు లాగుందే! ఇతని మాట దేవుడెరుగు! ఇప్పుడు తనేం చెయ్యాలి? తన ఉద్యోగం వున్నట్లా వూడినట్లా!"

ఆమె ఆలోచనల్ని చెదరగొడ్తూ మేనేజరన్నాడు.

"ఆచారీ! ఎందుకిలా చేశావు?"

చాలాసేపటి వరకూ అతడు మాట్లాడలేదు. సిగ్గుతో బిక్కచచ్చిపోతూ నెమ్మదిగా చెప్పసాగాడు. "సర్! ఈవిడ బ్యాంక్‌లో జాయినయినప్పట్నుంచి నాకు శాంతిలేకుండా పోయింది. ప్రతి క్షణం ఆమెతో నన్ను పోల్చుకునేవాడ్ని. నేను ఈ బ్యాంక్ జాతీయం

## అసూయా...నీ పేరేమి?

చెయ్యకముందు రెండు వందల రూపాయల జీతంతో గుమాస్తాగా జాయినయ్యాను. ఆ రెండు వందలకోసం ప్రొద్దున ఆరుగంటల నుంచి రాత్రి పది గంటలవరకు గొడ్డులా కష్టపడేవాడ్ని. ఆదివారం తప్ప మిగతా రోజుల్లో ఎండ ఎలా వుంటుందో చూడలేదు. ఇంత చేసి మేనేజర్నుంచి చివాట్లు, ఛీత్కారాలు. నోరెత్తితే ఎక్కడ వూస్టింగ్ ఆర్డర్లు వస్తాయోనని భయం, పదేళ్లు గాడిద చాకిరి చేసి ఆఫీసరయ్యాను. ఈవిణ్ణి చూడండి. 24 ఏళ్లు నిండకుండానే డైరెక్టు పరీక్షల పుణ్యమా అని ఆఫీసరయ్యింది. జాయినయిన మొదటి రోజునుంచి పాతిక వందల జీతం. రంచనుగా పది గంటలకొచ్చి అయిదు గంటలకి మహారాణిలా వెళ్లిపోతుంది. వీటన్నిటి కితోడు డైరెక్టుగా రిక్రూట్ అయినవాళ్లు ప్రమోటీలకంటే ఎంతో తెలివయిన వాళ్లన్నట్లు అందరూ గొప్పగా మాట్లాడటం. ఇది అన్యాయం, అన్యాయం అని నా మనసు ఘోషించేది సర్. ఆఖరికి ఆ బాధ నన్ను నిలువెల్లా దహించెయ్యసాగింది. అందుకే....."

మేనేజరు తలపంకించాడు. "ఈర్ష్యాద్వేషాలు మనిషిని ఏ స్థితికి దిగజార్చుతాయో! ఇందులో ఆమె పొరపాటేమీలేదు. వుంటే గింటే అది బ్యాంక్ పొరపాటు. నువ్వు చేసింది నీకు, ఆమెకూ కూడా ఎంత ప్రమాదకరమైనదో గుర్తించలేకపోయావు. ఇప్పుడేం చెయ్యాలో నాకర్థం కావట్లేదు. లలితా! మీరేమంటారు?"

లలిత నిస్సహాయంగా తల అడ్డంగా వూపింది.

కొంచెంసేపు ఆలోచించి మెనజరు అన్నాడు. "ఆచారీ! మీరు స్టేట్‌మెంట్, అపాలజీ లెటర్స్ వ్రాసి ఇవ్వండి. నేను వెళ్లి మీకు సాధ్యమయినంత తక్కువ పనిష్మెంటు పడేలా, మీ కేసు ప్రజెంట్ చేస్తాను. అదీ లలితగారి కంగీకారమైతే. ఆవిడ అలా వ్రాసి ఇస్తే!"

మళ్లీ లలిత చేతులు పట్టేసుకున్నాడు. గబుక్కున వదిలించుకుంది.

"ఇది వరకోసారి ఇలాగే సారీ చెప్పాడు కదా సర్! మళ్లీ అదే ప్రవర్తన. ఇంకోసారి కూడా అలాగే చెయ్యడని నమ్మకమేమిటి సార్?"

"ఇతన్నెలాగూ డెఫినిట్‌గా ఏదో ఒక మారుమూల గ్రామానికి ట్రాన్స్‌ఫర్ చేస్తారు. అంతమాత్రం శిక్ష వెయ్యకుండా ఎలాగూ వదలరు. అందుకని మీరు వర్రీ అవాల్సిన పనిలేదు."

"తన కళ్లెదుట వుండడు. తనకెలాగూ హాని చెయ్యలేడు. ఈపాటికి గుణపాఠం నేర్చుకునే ఉంటాడు. నేర్చుకోకపోయినా నష్టపోయేది అతనే! అతని రికార్డులో ఇది చెరపలేని మచ్చగా వుండిపోతుంది. ప్రమోషన్ రావటం అనేది కల్ల. ఇతని ఉద్యోగం ఊడితే ఇతని భార్యాబిడ్డలు శిక్షననుభవించాలి. పోనియ్" ఈవిధంగా ఆలోచించుకుని తల ఊపింది లలిత.

మేనేజరు ఆమె వైపు మెచ్చుకోలుగా చూశాడు. "మానవత్వం కల మనిషిని కలవటం మనసుకి విందు. గాడ్ విల్ బ్లెస్ యూ!"

థాంక్స్ చెప్పి బయటికి వస్తూ అనుకుంది లలిత. "జెలసీ బై నేమ్ ఈజ్ ఉమెన్" అన్న జ్ఞాన శిఖామణి, ఆచారి వంటి పురుష పుంగవుల్ని చూసి ఉండడు. చూసినా జాతి అభిమానంవల్ల ఆవిధంగా శెలవిచ్చి వుంటాడు●

# నడుం నొప్పి నుండి విముక్తి పొందండి. నిబ్బరంగా ముందుకు సాగండి.



స్త్రీ జీవితం అంటేనే సంతోషం దాంతోటే బాధ కూడా ఈ బాధలు ఒకటైతేనా ప్రత్యేకించి వెన్నునొప్పి పట్టుకుంటే వదలకుండా పీడిస్తూ విసుగెత్తిస్తూ ఉంటుంది అది పురుడు పోసుకున్న తర్వాతేగానీ లేదా ప్రతిరోజూ ఇంటి పనుల ఒత్తిడీ శ్రమానేగానీ ధైర్యంగా ఉండండి మీ అందుబాటులోనే నిజమైన ఉపశమనం ఉంది మూవ్ – దీనిలోని ప్రకృతి సహజమైన ఆవిరిగా మారే నూనెలూ దాంతోబాటే మాన్పే గుణంగల కషాయాలూను రాయగానే లోపలికి చొచ్చుకుపోయి త్వరగా పనిచేసి నిలిచి ఉండే ఉపశమనమూను దాంతో మీకిక అవును ఇది నిజంగా పనిచేస్తుంది మీకోసం ఒక ట్యూబ్‌ని తెచ్చికోండి వెన్నునొప్పి మర్చిపోండిక నిబ్బరంగా ముందుకు సాగండి




## మూవ్

కీళ్ళ నొప్పుల నుంచి ఉపశమనం

సరియైన ఉపశమనం ఇచ్చే వాగ్దానం



PARAS PHARMACEUTICALS PVT LTD

# ప్రపంచ ఫుట్‌బాల్ పోటీల

ఎట్టకేలకు నెల రోజుల ఫుట్‌బాల్ పండుగ ముగిసింది ప్రపంచం అన్ని ప్రాంతాలలో 26 బిలియన్ వేల ప్రజలు యీ పోటీలు టి వి ల ద్వారా చూచినట్లు అంచనా ఈసారి ప్రపంచ ఫుట్‌బాల్ కప్ ఎవరు సాధిస్తారు అనేది అందరి ఆలోచన జూన్ 8న మొదలైన యీ సస్పెన్స్ జూలై 8న రోమ్‌లో ఒలింపియా స్టేడియంలో ముగిసింది క్రిందటి పోటీలు మెక్సికోలో 1986లో జరిగినప్పుడు )డీ కొన్న అర్జెంటీనా– పశ్చిమ జర్మని యీసారి ఫైనలులో తిరిగి ఆడాయి పోటీ ఆశించినంత నైపుణ్యంగా జరగలేదనే చెప్పాలి క్రీడాభిమానులకు కొంత అసంతృప్తి కలగించింది అర్జెంటీనా జట్టులోని అయిదుగురు ఆటగాళ్ళు ఫైనలు పోటీలో ఆడలేదు ఆటలో ప్రతిభ కనపరుచుట కంటే విజయం



మరడోనా (అర్జెంటీనా)

సాధించాలనే దృక్పథముతో ఫౌల్ ఆడుట జరిగింది ఫైనలు పోటీలో మొదటి 45 నిమిషాలలో ఎవరు గోల్‌చేయలేక పోయారు పశ్చిమ జర్మని మంచి అవకాశములు కోల్పోయింది రెండవ సగంలో పెనాల్టి బాక్స్‌లో ఫౌల్ చేయుటతో పశ్చిమ జర్మనీకి పెనాల్టి అవకాశం లభించగా సద్వినియోగము చేసుకున్నది అర్జెంటీనా జట్టుకు పెనాల్టి గోల్ నిస్పృహ కలిగించింది పోటీ అనంతరం డిగో

వల్డెర్రమ (కొలంబియా)





## ఒక సమీక్ష

మెరడోనా బాధతో కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాడు విజయలక్ష్మి పశ్చిమ జర్మనీని వరించింది 1954 1974లలో వరల్ కప్ సాధించిన పశ్చిమ జర్మనీకి



లినెకర్ (ఇంగ్లండ్)

యిది మూడవ గెలుపు 1966 1982 1986లో రన్నర్స్– అప్ అర్జెంటీనా 1978 1986లో గెలుపు పొంది యున్నది ఇదివరలో ఇటలీ 1934 1938 1982లోను బ్రెజిల్ 1958 1962 1970లలో వరల్ కప్ మూడుసార్లు గెల్చియున్నవి పశ్చిమ జర్మని యీ విజయంతో మూడు సార్లు గెల్చిన జట్లు జాబితాలో చేరినది

అతిథ్య దేశం ఇటలీ కాంస్య పతకంతోను సవేది బంగారు ఘూ తో తృప్తి పడ్డారు ఇటలీ గెలుపొంద గలదని వేసుకున్న అంచనాలు తారుమారు అయ్యాయి

## ఆయా దేశాల విజయాలు

### గ్రూపు ఎ ఇటలీ ఆస్ట్రియా యు ఎస్ ఎ చెకొస్లోవేకియా (రోమ్ ఫ్లారెన్స్)

ఇటలీ – ఆస్ట్రియా = 1–0
చెకొస్లోవేకియా – యు ఎస్ ఎ = 5–1
ఇటలీ – యు ఎస్ ఎ = 1–0
ఆస్ట్రియా – చెకొస్లోవేకియా = 0–1
ఇటలీ – చెకొస్లోవేకియా = 2–0
ఆస్ట్రియా – యు ఎస్ ఎ = 2–1

### గ్రూపు బి అర్జెంటీనా కామరూన్ రష్యా రుమేనియా (మిలాన్ నేపిల్స్ బారి)

| | |
|---|---|
| అర్జెంటీనా – కామరూన్ | 0–1 |
| రష్యా – రుమేనియా | 0–2 |
| అర్జెంటీనా – రష్యా | 2–0 |
| కామరూన్ – రుమేనియా | 2–1 |
| అర్జెంటీనా – రుమేనియా | 1–1 |
| కామరూన్ – రష్యా | 0–4 |

### గ్రూపు ఎ బ్రెజిల్ స్వీడన్ కోస్టారికా స్కాట్‌లాండ్ (టురిన్ జినోవా)

| | |
|---|---|
| బ్రెజిల్ – స్వీడన్ | 2–1 |
| కోస్టారికా – స్కాట్‌లాండ్ | 1 ^ |
| బ్రెజిల్ – కోస్టారికా | 1–0 |
| స్వీడన్ – స్కాట్‌లాండ్ | 1–2 |
| బ్రెజిల్ – స్కాట్‌లాండ్ | 1–0 |
| స్వీడన్ – కోస్టారికా | 1–2 |

### గ్రూపు డి పశ్చిమ జర్మని యుగోస్లావియా యు ఎ ఇ కొలంబియా (మిలాన్ బొలొగ్న)

| | |
|---|---|
| యు ఎ ఇ – కొలంబియా | 0–2 |
| ప జర్మని – యుగోస్లావియా | 4–1 |

ఇటాలియా 90 ప్రపంచక
కైవసం చేసుకు







గుల్లిట్ (హాలెండ్)



మాథ్యూస్ (పశ్చిమ జర్మని)



స్టజ్ కొవిక్ (యుగొస్లావియా)



ప్లాటిని (ఫ్రాన్సు)

| | |
|---|---|
| యుగోస్లావియా – కొలంబియా | 1–0 |
| ప జర్మని – యు ఎ ఇ | 5–1 |
| ప జర్మని – కొలంబియా | 1–1 |
| యుగోస్లావియా – యు ఎ ఇ | 4–1 |

గ్రూపు ఇ బెల్జియం ద కొరియా ఉరుగ్వే స్పెయిన్ (వెరోన ఉడైన్)

| | |
|---|---|
| బెల్జియం – ద కొరియా | 2–0 |
| ఉరుగ్వే – స్పెయిన్ | 0–0 |
| బెలి యం – ఉరుగ్వే | 3–1 |
| ద కొరియా – స్పెయిన్ | 1–3 |
| బెల్జియం – స్పెయిన్ | 1 2 |
| ద కొరియా – ఉరుగ్వే | 0–1 |

గ్రూపు ఎఫ్ ఇంగ్లాండు ఐర్లాండ్ నెదర్లాండ్స్ ఈజిప్టు (కగ్లరి పాలెర్మో)

| | |
|---|---|
| ఇంగ్లాండు – ఐర్లాండ్ | 1–1 |
| నెదర్లాండ్స్ – ఈజిప్టు | 1–1 |
| ఇంగ్లాండ్ – నెదర్లాండ్స్ | 0–0 |
| ఐర్లాండ్–ఈజిప్టు | 0–0 |
| ఇంగ్లాండు – ఈజిప్టు | 1–0 |
| ఐర్లాండ్ – నెదర్లాండ్స్ | 1–1 |

గ్రూపు ఎఫ్ లో అయిదు పోటీలు డ్రా అగుట అందరికి ఆశ్చర్యము కలిగించినది

## ఫుట్‌బాల్ పోటీలలో కప్‌ను పశ్చిమ జర్మని జట్టు



## ప్రాథమిక పోటీలలో స్థానములు

| గ్రూపు | దేశం (జట్టు) | గెలుపు | ఓటమి | డ్రా | గోలులు చేసినవి | గోలులు చేయబడినవి | పాయింట్లు |
|---|---|---|---|---|---|---|---|
| ఎ | ఇటలీ | 3 | 0 | 0 | 4 | 0 | 6 |
| | చెకోస్లొవేకియా | 2 | 1 | 0 | 6 | 3 | 4 |
| | ఆస్ట్రియా | 1 | 2 | 0 | 2 | 3 | 2 |
| | యు ఎస్ ఎ | 0 | 3 | 0 | 2 | 8 | 0 |
| బి | కామరూన్ | 2 | 1 | 0 | 3 | 5 | 4 |
| | రుమేనియా | 1 | 1 | 1 | 4 | 3 | 3 |
| | అరెంటీనా | 1 | 1 | 1 | 3 | 2 | 3 |
| | రష్యా | 1 | 2 | 0 | 4 | 4 | 2 |
| సి | బ్రెజిల్ | 3 | 0 | 0 | 4 | 1 | 6 |
| | కోస్టారికా | 2 | 1 | 0 | 3 | 2 | 4 |
| | స్కాట్‌లాండ్ | 1 | 2 | 0 | 2 | 3 | 2 |
| | స్వీడన్ | 0 | 3 | 0 | 3 | 6 | 0 |
| డి | పశ్చిమ జర్మని | 2 | 0 | 1 | 10 | 3 | 5 |
| | యుగోస్లావియా | 2 | 1 | 0 | 6 | 5 | 4 |
| | కొలంబియా | | 1 | 1 | 3 | 2 | 3 |
| | యు ఎ ఇ | 0 | 3 | 0 | 2 | 11 | 0 |
| ఇ | స్పెయిన్ | 2 | 0 | 1 | 5 | 2 | 3 |
| | బెల్జియం | 2 | 1 | 0 | 6 | 3 | 4 |
| | ఉరుగ్వే | 1 | 1 | 1 | 2 | 3 | 3 |
| | ద కొరియా | 0 | 3 | 0 | 1 | 6 | 0 |
| ఎఫ్ | ఇంగ్లాండ్ | 1 | 0 | 2 | 2 | 1 | 4 |
| | ఐర్లాండ్ | 0 | 0 | 3 | 2 | 2 | 3 |
| | నెదర్లాండ్స్ | 0 | 0 | 3 | 2 | 2 | 3 |
| | ఈజిప్టు | 0 | 1 | 2 | 1 | 2 | 2 |

అర్జెంటీనా గ్రూపు బి లో మూడవ స్థానం పొందినది పశ్చిమ జర్మని గ్రూపు డి లో ప్రథమ స్థానము పోటీలలో అత్యధిక గోలులు అంటే 10 చేసినది ఇటలీ గ్రూపు ఎ లో ఒక్క పోటీలో కూడా ఓటమి పొందక ప్రథమ స్థానం పొందగా బ్రిటన్ గ్రూపు ఎఫ్ లో ఒక్క గెలుపు రెండు డ్రాలతో ప్రథమ స్థానం పొందింది

## వరల్డ్ కప్ విజేతలు

| | విజయం | రన్నర్స్–అప్ |
|---|---|---|
| 1930 | | |
| ఉరుగ్వే | ఉరుగ్వే 4 | అర్జెంటీనా 2 |
| 1934 | | |
| ఇటలీ | ఇటలీ 2 (1–1 తర్వాత) | చెకోస్లొవేకియా 1 |
| 1938 | | |
| ఫ్రాన్స్ | ఇటలీ 4 | హంగేరి 2 |
| 1942 1946 లో రెండవ ప్రపంచ యుద్ధము వలన పోటీలు జరగలేదు | | |
| 1950 | | |
| బ్రెజిల్ (పూల్ పద్ధతి) | ఉరుగ్వే 5 పాయింట్లు | బ్రెజిల్ 4 పాయింట్లు |
| 1954 | | |
| స్విట్జర్లాండ్ | ప జర్మని 3 | హంగేరి 2 |
| 1958 | | |
| స్వీడన్ | బ్రెజిల్ 5 | స్వీడన్ 2 |
| 1962 | | |
| చిలి | బ్రెజిల్ 3 | చెకోస్లొవేకియా 1 |
| 1966 | | |
| ఇంగ్లాండ్ | ఇంగ్లాండ్ 4 (2–2 తర్వాత) | ప జర్మని 2 |
| 1970 | | |
| మెక్సికో | బ్రెజిల్ 4 | ఇటలీ 1 |
| 1974 | | |
| ప జర్మని | ప జర్మని 2 | హాలెండ్ 1 |
| 1978 | | |
| అర్జెంటీనా | అర్జెంటీనా 3 | హాలెండ్ 1 |
| 1982 | | |
| స్పెయిన్ | ఇటలీ 3 | ప జర్మని 1 |
| 1986 | | |
| మెక్సికో | అర్జెంటీనా 3 | ప జర్మని 2 |
| 1990 | | |
| ఇటలీ | ప జర్మని 1 | అర్జెంటీనా 0 |

## ప్రీ–క్వార్టర్ ఫైనల్సు

జూన్ 23 నేపుల్స్ కామరూన్– కొలంబియా 2–1
బారి చెకోస్లొవేకియా– కోస్టారికా 4–1
జూన్ 24 టురిన్ అర్జంటీనా– బ్రెజిల్ 1–0
మిలాన్ పశ్చిమ జర్మని– హాలెండ్ 2–1
జూన్ 25 జినొవా ఐర్లాండ్– రుమేనియా 0–0
5–4 ఎనాల్టీ షూట్ అవుట్
రోమ్ ఇటలీ– ఉరుగ్వే 2–0
జూన్ 26 వెరోన యుగోస్లావియా–
స్పెయిన్ 0–0 2–1
బొలొగ్నా ఇంగ్లాండ్– బెల్జియం 0–0 1–0


పెలె (బ్రెజిల్)

## ప్రపంచ ఫుట్‌బాల్ పోటీలు

### క్వార్టర్ ఫైనల్సు

జూన్ 30 ఫ్లారెన్స్ అర్జెంటీనా–
యుగోస్లావియా 0–0 3–2 పెనాల్టీ షూట్ అవుట్
రోమ్ ఇటలీ– ఐర్లాండ్ 1–0
జూలై 1 మిలాన్ ప జర్మని– చెకోస్లొవేకియా 1–0
నేపుల్స్ ఇంగ్లాండ్– కామరూన్ 3–2


స్కిఫో (బెల్జియం)

### సెమీ ఫైనల్సు

జూలై 3 నేపుల్స్ అర్జెంటీనా– ఇటలీ 1–1
4–3 పెనాల్టీ షూట్ అవుట్
జూలై 4 టురిన్ ప జర్మని– ఇంగ్లాండ్ 0–0
1–1 4–3 పెనాల్టీ షూట్ అవుట్


జికో (బ్రెజిల్)

ఇటలీయా 90తో ఎక్కువ గోలులు చేసిన వీరులు అయిదు గోలులు చేసినవారు – రూ మన్ స్కుహరని (చెక్) స్కిలాచి (ఇటలీ) నాలుగు గోలులు సాధించిన వారు – మైఖేల్ (స్పెయిన్) రోగర్ మిల్లా (కామరూన్) మాథ్యూ స్ (ప జ) గాలివిన్‌కర్ (ఇంగ్లాండ్) మూడు గోలులు చేసినవారు రూడీ వొల్లర్ (ప జ) కిన్స్‌మన్ (ప జ)

పశ్చిమ జర్మని గెలుపు వెనుక ట్రైనర్ మాజీ వరల్డ్ కప్ అగ్రగామి ఆటగాడు బెకన్ బవర్ హస్తం వుంది

–ముకరమ్

# స్వయంకృతం

దేవినేని ఉష




కాలింగ్‌బెల్ మోగింది.

ఆ మోగటంలో ఏదో కంగారు ఉన్నట్టుగా స్పీడ్‌గా మోగింది.

వంటగదిలో గాస్‌స్టవ్ దగ్గర నిలబడి ప్యాన్‌లో ఫ్రై చేస్తున్న హారిత స్టవ్ తగ్గించి హాల్లోకి నడిచింది. మధ్యాహ్నం పన్నెండు దాటుతోంది. పిల్లలు ఇద్దరు కాన్వెంట్‌కు వెళ్లిపోయారు.

ఉదయం వాళ్ళ ఇద్దరి వరకూ కొంచెం అన్నం, పప్పో, కూరో ఏదో ఒకటి చేసేసి వాళ్ళను పంపించేస్తుంది. తొమ్మిది గంటలకు టిఫెన్‌తిని భర్త శ్రీరామ్ ఆఫీస్‌కు వెళ్ళిపోతాడు.

అతను లంచ్‌కు వచ్చేసరికి తమ ఇద్దరికీ వేడి వేడి అన్నం, కూరలు చేసి ఉంచుతుంది.

శ్రీరామ్ లంచ్‌కు ఇంకా టైమ్ ఉంది కనుక వచ్చింది అతను అయి ఉండడని హారిత ఉద్దేశ్యం.

కాలింగ్‌బెల్ ఆగకుండా మోగుతూనే ఉంది.

'సెన్స్‌లేని మనుషులు' తిట్టుకుంటూ తలుపు తీసింది. నిండా చెమటలతో, ఒణికిపోతూ నిలబడి ఉన్న శ్రీరామ్ చటుక్కున హారితను తోసుకుంటూ లోపలకు వచ్చి డోర్‌లాక్ చేసేసాడు.

అతన్ని ఆ స్థితిలో చూసిన హారిత కంగారు పడింది.

"ఏంటండీ!" అడిగింది.

"హారితా క్విక్! మన ఇంటిమీద రెయిడ్ జరపటానికి వస్తున్నారు. ఇంత సామాను, బీరువానిండా ఖరీదైన చీరలు, నగలు ఇవన్నీ వాళ్ళకు దొరికిపోతే నేను కటకటాల వెనక్కి వెళ్ళిపోతాను. వీటిని కొన్నిటినైనా ఎక్కడైనా దాచెయి!"

భయంలో శ్రీరామ్ గుండె గొంతులోకి వచ్చినట్టుంది. ఈసారి వణికిపోవటం హారిత వంతు అయింది. ఇంట్లో ఎటు చూసినా లక్ష్మి తాండవిస్తోంది. ఇంత హఠాత్తుగా ఈ సిరిని అంతా ఎలా మాయంచేయటం?

"ఉండండి పక్కవాళ్ళను అడిగి వస్తాను" డోర్ దగ్గరకు నడవబోయింది.

"షటప్! నువ్వు అడిగి వచ్చేంత టైమ్ లేదు. వాళ్లు వచ్చేస్తారు. మొదట పాస్‌బుక్‌లు, బంగారం తీసుకువెళ్లు హరియప్!" ఉద్రేకంగా అరిచాడు.

శ్రీరామ్ మెదడు పగిలిపోయేంత టెన్షన్‌గా ఉంది. అతను ఒక గవర్నమెంట్ ఆఫీస్‌లో కీలకమైన పోస్ట్‌లో ఉన్నాడు.

ఆ ఆఫీస్ మొత్తానికీ ఏ కాగితం కదలాలన్నా అతని సంతకం కావాల్సిందే. ముప్ఫయి అయిదేళ్ళ ఉడుకు రక్తం వాడైనా అతనిలో ఉన్నత ఆశయాలు ఏమాత్రం లేవు. ధనం మీద, సుఖాలమీద అతనికి ఎంతో కోరిక. వచ్చే జీతం సంగతి ఎలా ఉన్నా అతను లంచాల్లో ఎంతో డబ్బు సంపాదించాడు. ప్రతి బిల్ తొక్కిపట్టేసి తను సంతకం చేయటానికి ఎంతో లంచం ప్రతిఫలంగా పొందేవాడు. అతని ఇంట్లో డబల్‌కాట్, ఫ్రిజ్, ఒనిడా కలర్ టీవీ, మిక్సీ, గ్రైండర్, రెండు గాస్‌స్టవ్‌లు వాటికి స్పేర్ సిలిండర్స్, టూ ఇన్ వన్ ఇంకా ఎన్నో ఆధునిక పరికరాలు ఉన్నాయి.

బెడ్‌రూం ధనవంతుల బెడ్‌రూంలా కళాత్మకంగా ఉంటుంది. ఆ రూమ్‌లో నిలువెత్తు బీరువాలు రెండు. అవి గాడ్రేజ్‌వి. వాటినిండా ఖరీదైన బట్టలు, నగలు, వెండి సామానులు

# స్వయంకృతం

కొల్లలుగా ఉన్నాయి. ఎంత ఉన్నత అధికారి అయినా ఆ జీతం మీద ఇల్లు అలా మెయింటెన్స్ చేయటం చాలా కష్టం. కానీ శ్రీరామ్‌కు అది చాలా సులువుగా జరుగుతోంది. కారు ఒక్కటి కొనలేదు. కానీ స్కూటర్‌తో సహా అతనికి అన్నీ ఉన్నాయి.

భార్యపేర, పిల్లలపేర, తనపేర ఉన్న పాస్‌బుక్‌లు బీరువాలో ఉన్నాయి.

అతని లంచాల తత్వానికి విసిగిపోయిన వారు ఎవరో అవినీతి నిరోధక శాఖ వారికి ఫిర్యాదు చేసారేమో తెలియదు కానీ అతను ఆఫీస్‌లో ఉండగా, అతని ఇంటిమీద అవినీతి శాఖవారు రెయిడ్ జరపబోతున్నట్టుగా తెలుసుకున్న ఒక ముఖ్య స్నేహితుడి నుండి ఆఫీస్‌లో ఉన్న శ్రీరామ్‌కు ఫోన్‌ద్వారా తెలిసింది.

అతను కంగారుగా ఇంటికి వచ్చాడు.

హరిత చకచకా శ్రీరామ్ అందించిన నగలపెట్టె, పాస్‌బుక్‌లు తీసుకుని పక్క ఇంటికి వెళ్ళాలని డోర్ తీసింది.

హరిత స్థాణువు అయింది.

ఎదురుగా నిలబడ్డ వ్యక్తులను చూస్తూ, శ్రీరామ్ కూడా నిశ్చేష్టుడు అయ్యాడు.

అవినీతి నిరోధక శాఖవాళ్ళు హరిత చేతిలోనివి అందుకున్నారు.

నడుంలో పట్టు తప్పినట్టయి హరిత అక్కడే కూలబడింది.

శ్రీరామ్ దగ్గర ఒక వ్యక్తి నిలబడ్డాడు.

మిగిలిన ముగ్గురూ అతని ఇల్లంతా సోదా చేసారు. అతన్ని అడగవలసిన ప్రశ్నలు అడిగారు. శ్రీరామ్ చెప్పిన జవాబులు వాళ్లకు ఏ మాత్రం సంతృప్తిగా లేవు.

శ్రీరామ్‌ను అరెస్ట్ చేసారు. అతన్ని తీసుకుని వెళ్లిపోయారు.

అతని ఆస్తికి సీల్ చేసారు.

హరిత దిక్కుతోచని దానిలా అయిపోయింది. ఈ హడావుడికి ఇరుగు, పొరుగు వాళ్ళంతా వచ్చి వడ్డారు.

అంతకాలం హరిత అనుభవిస్తున్న విలాసాలకూ, ఆమె ఐశ్వర్యానికి అసూయ చెందుతున్న వాళ్ళకు ఇప్పుడు హరితమీద కాస్తయినా జాలి కలగలేదు. 'మంచి ఉద్యోగం కదా దాంతో బ్రతక్క లంచాలకుపోతే ఇలాగే ఉంటుంది.'

'అంతా మూడునాళ్ళ ముచ్చటే. న్యాయమైన సొమ్ము అయితే నిలుస్తుంది. కానీ ఇలాంటిసొమ్ము ఎలా వచ్చిందో అలానే పోతుంది.'

అందరూ విమర్శిస్తుంటే అసలే కృంగిపోయి ఉన్న హరిత గుండెమీద సమ్మెటదెబ్బల్లా ఉన్నాయి. స్టవ్‌మీద ప్యాన్‌లో ఫ్రై మాడిపోతున్న వాసన వస్తుంటే ఎవరో వెళ్ళి స్టవ్ ఆఫ్‌చేసి వచ్చారు. ఎదురింట్లో ఉన్న కవిత ఒక్కతే హరిత మీద జాలిపడింది.

భర్త చేసిన చర్యలకు ఆమెను నిందించటం నేరం అనిపించింది.

భర్త సుఖాలు అమరుస్తుంటే ఏ భార్య అయినా ఆ సుఖాలు అందుకోవాలనే ప్రయత్నిస్తుంది. స్త్రీగా తోటి స్త్రీమీద కవిత జాలి పడింది. అయోమయంగా కూర్చున్న హరితను తీసుకుని తన ఇంటికి వెళ్ళింది.

ఇరుగు పొరుగు వాళ్ళంతా వెళ్ళిపోయారు.

వాళ్ళంతా ఇవాళ మధ్యాహ్నం అంటే ఈ సంఘటన జరిగేముందు వరకూ హరిత వెంట తిరిగినవాళ్ళే.

హరిత అదృష్టాన్ని ప్రశంసిస్తూ ఆమె నుండి అప్పులు తీసుకున్నవాళ్ళే.

** ** ** ** **

రెండు రోజులు గడిచాయి.

హరితనూ, పిల్లల్నీ కవిత తమ ఇంట్లోనే ఉంచుకుంది.

హరిత తండ్రికి లెటర్ రాసింది కవిత.

శ్రీరామ్ స్నేహితులు ఎంత ప్రయత్నించినా అతనికి బెయిల్ దొరకలేదు.



## సన్నీడియోల్‌కి మంచి రోజులు

'ఘాయల్' చిత్రంలో సన్నీ నటనకు అందరూ అచ్చెరువొందారట. ఇది అదనుగా తీసుకొని అందరికంటే ఎక్కువ డబ్బులు డిమాండు చేస్తాడేమో నని అనుకుంటున్నారు. 'చాల్‌బాజ్' చిత్రంలో శ్రీదేవికి పోటీగా నటించిన సన్నీ చిత్రం యొక్క బరువు బాధ్యతలన్నీ తన భుజస్కంధాలపై వేసుకున్నాడు. ఇది విజయవంత మైతే సన్నీకి మంచి రోజులు వచ్చినట్లేనని పెద్దలు భావిస్తున్నారట. మంచిదే!

హరిత మానసికంగా కృంగిపోయింది.

కవిత తమ్ముడు రఘు అక్క దగ్గరే ఉండి చదువుకుంటున్నాడు. అతను ఎక్కువగా బైట తిరుగుతూ ఉంటాడు.

అతనికి చాలా విషయాలు తెలిసాయి. వచ్చి అక్కకి చెప్పేవాడు.

శ్రీరామ్‌మీద అవినీతి నిరోధక శాఖవారికి రిపోర్ట్ ఇచ్చింది ఎవరో కవితకు తెలిసిపోయింది.

ఆ మధ్యాహ్నం హరితతో చెప్పింది.

వింటూనే హరిత ఉలిక్కిపడింది. మొదట నమ్మలేకపోయింది. కానీ చెప్పింది కవిత కనుక నమ్మగలిగింది.

శ్రీరామ్ మీద రిపోర్ట్ ఇచ్చింది. ఎవరో కాదు, ఆమె ఇరుగు, పొరుగు ఇళ్ళవారే.

** ** ** ** **

హరితవాళ్ళ పోర్షన్ ఉన్న బిల్డింగ్‌లో ఇంకా ఐదు పోర్షన్‌లు ఉన్నాయి. కింద మూడు, పైన మూడు ఉంటాయి.

నడమంత్రపు సిరి నరాలమీద వుందు అన్నట్టు, సామాన్య కుటుంబంలో నుండి వచ్చిన హరితకు భర్తకోరకుండానే అందిస్తున్న ఐశ్వర్యానికి తలమునకలు అయింది. ఆమెలో అతిశయం హెచ్చు అయిపోయింది.

ఆ బిల్డింగ్‌లో ఉన్న అన్ని పోర్షన్స్‌వారు ఉన్నవారే అయినా వాళ్ళకంటే తామే అధికులం అన్నభావన ఎక్కువ అయింది.

అనుక్షణం డబ్బు సంపాదించటంలో భర్తకుగల చాకచక్యాన్ని అందరితో చెప్తూ ఉండేది. అతను తాకంకప్ప కొన్నా అందరికీ ఆడంబరంగా చూపిస్తూ ఉండేది.

ఇక అందువల్ల శ్రీరామ్ ఇంట్లో ఏ వస్తువుకొన్నా, ఎలా కొన్నా ఆ కాంపౌండ్‌లో అందరికీ తెలిసిపోతూ ఉండేది.

ఒకసారి హరిత తల్లి వచ్చినప్పుడు కూతురి ప్రవర్తన అంతా చూసింది. ఆవిడకు ఏమీ నచ్చలేదు.

"హరితా! రోగం రట్టు, సంసారం గుట్టు అన్నారు. ఇంటి విషయాలు అలా ఒకరితో చెప్పటం మంచిది కాదు. అసలే పైకి వస్తున్న మీరంటే ఇరుగు, పొరుగు వాళ్ళకు ద్వేషం ఉంటుంది" అని ఆవిడ హితబోధ చేసింది.

హరిత మరుదు చిట్లించింది.

అది ఆమెకు నచ్చలేదు. ఆమె తత్వమే అంత. ఇంట్లో జరిగిన ప్రతి చిన్న విషయం అందరితోచెప్తే కానీ ఆమె మనసుకు శాంతి ఉండదు. కూతురి సంగతి చిన్ననాటినుండీ తెలిసి ఉన్న ఆమె తల్లి హరితకు నచ్చచెప్పలేకపోయింది.

భార్యలో ఉన్న ఈ స్వభావం శ్రీరామ్‌కు కాస్త తెలిసినా అతను పెద్దగా పట్టించుకోలేదు. అదీకాక అతను ఇంట్లో ఉన్నప్పుడు హరిత ఇరుగు పొరుగు వాళ్ళతో ఎక్కువగా మాట్లాడదు.

హరిత ఎదుట వాళ్ళంతా ఆమెను పొగిడి శ్రీరామ్ ఎన్ని రకాలుగా ఎంత సంపాదిస్తున్నాడో ఆరాలుతీసి ఆమె ద్వారానే అన్నీ తెలుసుకుంటున్నారు. ఆ కాంపౌండ్ ఎదురింట్లో ఉన్న కవిత హరిత మాటలకు జాలిపడేది.

ఒకసారి హరితతో చెప్పింది కూడాను.

"హరితా! మీ రెండుకిలా ఇంటి విషయాలు అందరితో చర్చిస్తారు. అది మంచి పద్ధతికాదు" అంటూ.

హరిత మూతి తిప్పింది.

కవిత చాలా రిజర్వ్‌డుగా ఉంటుంది. ఆమె భర్తకూడా ఒక ప్రభుత్వ ఉద్యోగే.

సంస్కారంతో చెప్పే కవిత మాటలు హరిత అర్థం చేసుకోలేక పోయింది.

హరిత ఇరుగు, పొరుగు వాళ్ళు ఆమె కుటుంబంపై అసూయాగ్నితో రగిలిపోయారు.

వాళ్ళలో వాళ్ళు ఆలోచించుకుని శ్రీరామ్‌మీద అవినీతి నిరోధకశాఖ వారికి తెలియజేసారు. వారి అసూయే ఈనాడు శ్రీరామ్ కుటుంబం మీద దెబ్బకొట్టింది.

ఇంటిగుట్టు అంతా బైటపెట్టిన హరిత వల్లనే సంసారం బజారుపాలు అయింది.

కవిత మాటలు వింటున్న హరిత వెక్కి వెక్కి ఏడ్చింది.

తన దగ్గర గిన్నెలు, పప్పులు, ఉప్పులు, డబ్బు అప్పు తీసుకున్న ఇరుగు పొరుగు తనను ఎందుకలా విమర్శించారో, తను ఇంతకష్టంలో ఉంటే ఒక్కరూ ఎందుకు ఆదుకోలేదో, కనీసం తనను పలకరించటానికి ఎదురింటి వరకూ కూడా ఎందుకు రాలేదో అర్థం అయింది.

అందుకు కారణం వాళ్ళ అసూయే.

వాళ్ళలో ఆ అసూయను పెంచి పెద్ద చేసింది ఎవరోకాదు. తనే. సంసారంగుట్టు, రోగం రట్టు అంటు తల్లి ఏనాడో చెప్పింది. తనే అర్థం చేసుకోకుండా ప్రవర్తించింది.

తను గుట్టుగా సంసారం చేసుకుంటే, తన ఇంటి విషయాలు ఎవరికీ చెప్పకుండా ఉంటే ఎంతో బాగుండేది.

తన నోటి అదుపులేని తనమే తన భర్తను జైల్‌కు పెట్టింది. తననిలా వెరుల పంచను చేర్చింది. తన వల్ల భర్త ఉద్యోగం కూడా పోయింది. ఇది తన స్వయంకృతం. అనుభవించక తప్పదు. తనను చూసి ఎవరైనా గుణపాఠం నేర్చుకోవాలి. హరితకు ఏడ్చి ఏడ్చి గొంతు బొంగురుపోయింది. కవిత చెయ్యి హరిత తలను ప్రేమగానిమురుతోంది.



## మీనాక్షి-వినోద్

మీనాక్షి శేషాద్రి మహేష్‌భట్ చిత్రం 'జుర్మ్'లో అత్యంత ప్రతిభావంతంగా నటించిం దట. మీనాక్షి సరసన వినోద్ ఖన్నా నటిస్తున్నాడు. దీనిలో సంగీతాబిజ్‌లానీ కూడా నటిస్తోంది. మరి ఈ చిత్రం ఏ మేరకు విజయం సాధిస్తుందోనని నిర్మాతలు ఎదురు చూస్తున్నారు.

# ఆపరేషన్ అపెండిసైటిస్

జోస్యము విద్యాసాగర్

రైలు దిగేప్పటికి రాత్రి పద కొండయింది. స్టేషను ఊరికి దూరం. అయినా వచ్చేప్పుడు రిసీవ్ చేసుకోమని మామయ్యకు టెలిగ్రాం ఇద్దామనుకున్నాను.

ఆయనకు స్కూటరుంది. శుభ్రంగా స్కూటరులో వెనకవైపు కూచుని వెళ్లిపోయుండేదాన్ని. కానీ, టెలిగ్రాం ఇవ్వకపోవటానిక్కూడ కారణాలున్నాయి. మొదటిది ఆశ్చర్యంలో ముంచెత్తేద్దామనీ, రెండు టైం లేకపోవటము. మూడు నాకు నెప్పి ఎక్కువ కావటము.

నెప్పి అంటే గుర్తుకువచ్చింది. మీకా విషయం చెప్పలేదు కదూ? నెలరోజులుగా కడుపులో నెప్పి. విపరీతంగా వస్తోంది. అప్పటికీ అక్కడున్న డాక్టర్లకు చూపటము. తాత్కాలిక ఉపశమనం కలిగించే నెప్పి మాత్రలు తీసుకోటం జరిగింది.

మా మామయ్య డాక్టరు. ఆయనకి ఎంతో మంచి పేరుంది. హస్తవాసి ఉంది. ఆయన చిన్న ఊర్లోనే ఉంటున్నా మంచి ఎక్విప్ మెంటుంచుకున్నారు. సొఫిస్టికేటెడ్ ఆపరేషన్ థియేటరుంది. పైగా ఎంతయినా మా మామయ్య. ఆయన నాకు తీసుకోబోయే 'కేర్' ఇంకే డాక్టరయితే మాత్రం తీసుకోగలరా? అందుకే వారం రోజులు శలవు పెట్టే వచ్చేశాను - 'సడెన్'గా.

కూలీలు లేకపోతే పీడాపోయింది. ఏదో విధంగా మన 'లగేజి' మనమే దించుకుంటాము. కాకపోతే, ఆ లగేజీని మోసుకుంటూ అంతంత దూరం ఆడదాన్ని అందునా అర్థరాత్రి ఒంటరిగా వెళ్లగలనా?

'సార్....!'

'ఏమిటమ్మా!' అన్నారు స్టేషను మాష్టారు.

'నాకు ఒక సహాయం చేయాలి?'

'చెప్పండమ్మా!'

'అర్జంటుగా నేను ఊళ్లోకి వెళ్లాలి. మా మామయ్య ఇంటికి చేరుకోవాలి...'

'అలాగేనమ్మా!'

'కానీ ఇక్కడ ఏ ట్రాన్స్‌పోర్టూ లేదు.'

'అవునమ్మా! అందులో ఈ ట్రెయిన్‌కి ఉండరు. దీన్నందుకే 'దెయ్యాల రైలు' అంటారు.'

'ఉష్?' అన్నాను నేను.

'ఏమ్మా?' అన్నారాయన కంగారుగా.

'అబ్బే! ఏం లేదులెండి. నాకు... నాకు దయ్యాలు... అంటే...'

'ఓహ్! అర్థమయింది. చెప్పమ్మా నన్నిప్పుడేం చేయమంటావు?'

'ఏం లేదు. తోడుగా నాతో మా మామయ్య ఇంటిదాక రాగలరా? అఫ్‌కోర్స్ మీకు పనేం లేకపోతేనే సుమా?'

'పనీలేదు. అభ్యంతర మంతకన్నా లేదు. కానీ...'

'కానీ... చెప్పండి సర్. ఆపేశారేం?'

'ఏం లేదమ్మా! నాకీ ఊరు కొత్త. ఆయన ఇల్లు...'

'అంతేనా? మీరు తోడుండండి. ఆయన ఇల్లు నాకు తెలుసు. నేను దారి చూపుతాను.'

పాపం! ఆయన ఆఫీసు మూసి నాకు తోడుగా నా వెంట వచ్చారు. మళ్లీ ఉదయం దాక ఏ ట్రయినూ లేదట. నేను ఎంత వద్దన్నా వినకుండా నా సూట్‌కేస్‌ని తనే మోసుకువచ్చారు. నైస్‌గాయ్... అనుకున్నాను. ఆయన షివాల్రీని చూచి మెచ్చుకుంటూ.

అడవి ప్రాంతమేమీ కాదు కానీ, చీకట్లో

ఈ వారం దెయ్యం కథ





చుట్టూ పుట్టాపొదలతో, కీచురాళ్ళ ధ్వనులతో అడవిలాగే ఉంది. నేను, ఆయన వెనకాల, ఆయన వేసిన అడుగుల్లో అడుగు వేస్తూ నడుస్తున్నాను - నెమ్మదిగా.

'నేను డ్యూటీకి జాయిన్ అయిన రోజు నమ్మా!'

'ఏమయిందండీ!'

'ఇదుగో ఇక్కడ!' అంటూ ఆగిపోయి వేలెత్తి ఓ ఊడలు జారిన మర్రిచెట్టును చూపించుతూ... ఇక్కడ ఒక వ్యక్తిని దారుణంగా చంపివేశారు.

'అయ్యో పాపం!' అన్నాన్నేను. కానీ, నాకెందుకో గుండె దడదడా కొట్టుకోసాగింది. ఆయన వేలెత్తి చూపించిన మర్రిచెట్టు దయ్యేంలా జుత్తు విరబోసుకుని ఉన్నట్లుంది. ఆ భయం గుండెల్లోకి ఎగతంతే ఇంచుమించు ఆయన చేతిని పట్టుకుని పక్కన్నే నడచాను. నేను తలెత్తితే ఒట్టు.

'తమాషా ఏమిటంటే... ఆ చంపబడ్డ వ్యక్తి... ఈ ప్రాంతంలో ఎక్కడో ఇక్కడే దయ్యమయి తిరుగుతున్నాడని పుకారు.'

'సార్...!' నా గొంతులో వణుకు మొదలయింది.

'ఓ ! అయాం సారీ...!'

వచ్చేస్తోంది. అదుగో ఆ చివరి ఇల్లే! ఈ మామయ్యా అయినా ఇంటిని ఇంత మూలకు ఊరికి దూరంగా కట్టుకున్నాడేమిటో...! ఆ యింట్లో పడితే ఏ భయాలూ ఉండవు...?

'ఇంకా ఎంత దూరముందమ్మా!'

'అబ్బే! అదుగోనండీ! అదే ఆ డాబాయే!'

లైట్లు వెలుగుతున్నాయ్. అంటే మామయ్య ఇంకా పడుకోలేదన్న మాట. లేక ఎవరన్నా పేషెంటును చూస్తున్నాడన్నమాట.

'థాంక్స్! మాష్టారూ! ఇదే మా మామయ్య ఇల్లు. నేను లోపలకు వెడతానులెండి. మీరు... మీరు నాకోసం చాల శ్రమ తీసుకున్నారు. గుడ్‌నైట్...' అన్నాను నేను.

'గుడ్‌నైట్...!'

ఆయన చీకట్లో కనిపించకుండా పోయేంతదాక చూచి కాంపౌండ్ గేటుతీసి లోపలకు వరండాలో నడచి కాలింగ్ బెల్ నొక్కాను.

'ఎవరూ?'

'నేను. నేను మామయ్యా!' అంటూ మామయ్య దగ్గరగా వెళ్లేను. మామయ్య నేననుకున్నట్లే డాక్టరు దుస్తుల్లో ఉన్నాడు. అప్పుడే ఆపరేషను థియేటరునుంచే వస్తున్నట్లున్నాడు.

'వాట్ ఎ సర్‌ప్రయిజ్! నీవు...నీవు'

'ఆ... సర్‌ప్రయిజ్ చేద్దామనే ఇలా

చెప్పాపెట్టకుండా వచ్చేశా!'

'మరి, ఇంత రాత్రి ఒక్కదానివి అంత దూరం ఈ లగేజితో.. వచ్చావా?'

'అంత పిరికిదాన్నా మామయ్యా నేను?'

'కాదనుకో...? అయినా...'

'నీ అనుమానం నిజమే మామయ్యా! స్టేషను మాష్టారు సాయం తీసుకుని వచ్చానులే! ఒక్కత్తిని రాలేదులే!'

'ఆ... అలా చెప్పు. సరేగాని పదపదా! లోనికి పదా?'

గీజర్‌లోని వెచ్చని నీళ్ళతో షవర్ బాత్ చేసి, వెంట్రుకలని ఆరబెట్టుకున్నాను. అప్పుడు వచ్చింది నెప్పి. విపరీతంగా భరించ లేనంత - మెలికలుతిరిగి పడిపోతున్నాను.

'మామయ్యా!' అంత నెప్పిలోనూ గట్టిగా కేకవేశాను.

మామయ్య ఎక్కడో ఇంకో గదిలో ఉన్నట్లున్నాడు. నా కేకను విని పరుగు పరుగున వచ్చారు. 'ఏమ్మా! ఏమయిందమ్మా! ఎందుకలా.. ఏం నెప్పి తల్లీ...?' మామయ్య గాబరా ఆతృత చెప్పనక్కరలేదు.

'ఇక్కడ మామయ్యా?'

'కడుపులోనా, ఎడమవైపా?'

'ఆ.. అదేదో నులిపెట్టినట్లు...'

'ఆగు.. పరీక్షించుతాను!'

మామయ్యా నన్ను ఆ తరువాత గంట సేపు తెగపరీక్షలు చేశాడు. నేను మాత్రం నెప్పితో, భరించలేని బాధకు సుళ్ళు తిరిగి పడిపోతున్నాను.

'ఎపెండిసైటిస్. వెంటనే ఆపరేషన్ చేయాలమ్మా!'

'అసలు... అసలు మామయ్యా! నేన్ని దగ్గర ఇది చెక్ చేయించుకోవటానికే నేను

## ఆపరేషన్ అపెండిసైటిస్

వచ్చింది. నేనిక్కడ ఉండగా ఈ నెప్పి రాదేమో ననుకున్నాను. నెప్పి ఉన్నప్పుడేట కదూ, ఈ ఆపరేషను చేయాల్సింది.'

'అవునమ్మా! మరి చేయమంటావా?'

'చేస్తావా మామయ్యా!'

'ఏ మ్మా? నా శక్తిమీద నమ్మకం లేదా తల్లీ!'

'నమ్మకం లేకపోవడమా? అంత భాగ్యం కలిగినందుకు సంతోషిస్తూంటేను.'

నాకేదో అయిపోతోంది. మామయ్య నన్నేమో చేసేస్తున్నాడు. అనెస్తీషియా ఇచ్చినట్లున్నాడు. మత్తుగా ఉంది. మగతగా ఉంది. కళ్ళుమూతలు పడిపోతున్నాయి. మామయ్య మాటలు ఏవేవో వినిపిస్తున్నాయి. లీలగా... దూరంగా మాట్లాడుతున్నట్లు-చెవికి మెల్లగా వినిపిస్తున్నాయి. ఎక్కడో కడుపుదగ్గర కరకరమని కోస్తున్నట్లు.. పేగులు కదులుతున్నట్లున్నాయి.

'మామయ్యా! పేగులు కదిలిపోతున్నాయి.'

'పేగు లెక్కడ కదులుతాయమ్మా! పిచ్చి...'

ఎప్పటి మాట అది? మామయ్యా అప్పుడూ అంతే! అవి గుర్తుకు వస్తున్నాయి. అదుగో అత్తయ్యా. అత్తయ్య ఉందంటే అది ఎంత లేదన్నా పదిహేనేళ్ళ కిందటి మాటే. అప్పటి విషయాలు. అప్పటి సంగతులు.

'చూడమ్మా! మీ అత్తయ్య మునిగిందా?'

'మునగటమా?'

'అంటే మునగటం కాదమ్మా? భక్తి.. భక్తిలో పడిపోవటము. ఆమె ఆ భక్తిలో పడిపోయిందంటే మనం కనిపించనే కనిపించము ఆమెకి.'

'అది తప్పా మామయ్యా?'

'తప్పెలాగవుతుందమ్మా?'

'మరి దెప్పుతున్నావేం?'

'భక్తీ అవీ' ఏదయినా ముందు తాను చేయవలసిన విద్యుక్తధర్మం మరచిపోకముందే. అది మరచిపోయి భక్తి.. భక్తీ అంటే సరిపోదు.

'అంటే అత్తయ్యా....?' అనుమానంగా చూచాన్నేను.

'భర్తకు అన్నీ అందించటము, సకల సదుపాయాలు అవీ చేయటము భార్య ధర్మము. అవి నెరవేర్చకుండ...'

'మీరెప్పుడూ అలాచేయలేదా మామయ్యా

'నా వృత్తిని నేనెన్నడూ విస్మరించలేదు...'

'వృత్తిని విస్మరించలేదు. వాస్తవమే. వృత్తినే ధర్మంగా పెట్టుకుని, భార్యగా ఆమెకు మీరివ్వాల్సిన కొన్ని కనీసపు కోరికలని గూడా తీర్చకుండాపోవటం అధర్మం కాదా మామయ్యా?'

'అంటే నేను... నేను మీ అత్తయ్యనూ...?'

'అంటే మీరు. మీరు మీ భార్యను...'

'అమ్మాయ్! నీవు... కాలికేస్తే మెడకు... మెడకువేస్తే కాలికి వేస్తున్నావు.'

'ఇంతకీ... అసలు నిర్ణయం చెప్పలేదు.'

'ఓకే....ఓకే....'

వాళ్ళిద్దరూ ఎంత ఆనందంగా ఎంత హాయిగా ఎంత కలసి మెలసి ఉండేవారనీ? కానేం లాభం? ఆ పరమాత్మునికే కన్నుకుట్టింది. ఆ జంటను చూచాక ఆ ఆదిదేవుడికే అసూయ కలిగింది. ఫలితం ఆమె హఠాత్తుగా కడుపునెప్పితో.. తీసుకుని చచ్చిపోయింది.

'ఎంతపని చేసేవు మామయ్యా?' అన్నా నానాడు.

'జ్యోతీ?'

'కాకపోతే ఏమిటీ మామయ్యా! వృత్తి ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించటం మంచిదే, కానీ దానికన్నా ముందు మానవతాధర్మం ఉంది...'

'జ్యోతీ!'

'కోపం వచ్చిందా మామయ్యా! అత్తయ్య అలా బాధతో నలిగిపోతూన్నా ఏమయిందని అడగకుండా నీ వృత్తిధర్మాన్ని ఎలా నెరవేర్చావు మామయ్యా? భార్యగా ఆమె బాధ ఏమిటో కనుక్కోలేకపోయేవు సరే. కనీసం... కనీసం డాక్టరుగా కూడా ఆమె జబ్బుని డయాగ్నస్ చేయలేకపోయేవు.'



'జ్యోతి! తను నాకు చెప్పలేదమ్మా!'

'కడుపు పట్టుకుని బాధపడుతున్నప్పుడన్నా కనుక్కోవాల్సింది. ఆఖరుకు మీరు డాక్టర్లు కద మామయ్యా?'

'అవునమ్మా! నేను తప్పుచేశాను. నేను తప్పు చేశానమ్మా! ఆ తప్పు నన్నింత నష్టానికి గురిచేస్తుందని...'

'ఇది తెలిస్తే ఎవరయినా ఇక నీదగ్గరకు వస్తారా మామయ్యా?'

'పోతే పోనీమ్మా! నాకేం దిగులు? చెట్టంతది - నాది... నాదనుకున్న నా అర్థభాగమే పోయింతరువాత... ఈ వృత్తి ఉంటేఎంత పోతేయెంత? ఎవరు వచ్చినా రాకపోయినా నాకేమమ్మా!?'

'ఎవర్రాకపోయినా నేనువస్తాను మామయ్యా!'

'పిచ్చిదానా? ఇప్పుడిలాగంటున్నావు కానీ, పెళ్లయిపోయేక... నీ వెక్కడో నేనెక్కడో. నెప్పి వచ్చిందని, నా దగ్గరకు వచ్చేదాక ఆగుతావా? ఎక్కడినుంచో ఇక్కడికి రాగలవా?'

'వస్తాను మామయ్యా!'

'రామ్మా! రా! తప్పక అప్పుడు నేనే నీకు ఆపరేషను చేస్తా? నీకు ఆపరేషను చేసినచోట కుట్లుకూడా కనిపించనంత పర్ఫెక్టుగా చేస్తాను...నేను... నేనుంటే... అప్పటికి నేనుంటేనే!'

'ఉండకెక్కడికి పోతావు మామయ్యా?'

'అదేమిటమ్మా! నేనెప్పుడూ బ్రతికి ఉంటానా?'

'ఉంటావు ఉండి తీరుతావు. నాకేదయినా వస్తే నీకే... నీవే ఆపరేషను చేస్తావు...'

'ఒకవేళ చచ్చినా...వచ్చి...'

ఏదో మళ్ళీ కడుపుదగ్గర కలుక్కుమంది. నా ఆలోచనలకి స్వస్తిచెప్పినాను. మెదడులో ఏదో చల్లగా... ఏవో రంగు రంగుల పూలు తిరుగుతున్నట్లు ఎర్రగా... పచ్చగా... నల్లగా...? కట్టు కడుతున్నారు కాబోలును. కుట్లు వేశారా? ఎన్ని పడ్డాయో? ఏమాత్రం అనిపించనే లేదు సుమా? అయినా ఎలా అనిపిస్తుంది? అనెస్తీషియాలో ఉంటే...

మామయ్యా... మామయ్యా...! ఎంత హాయిగా ఉంది మామయ్యా! నెప్పి ఇలా తీసి అలా పారేసినట్లుంది. ప్రాణం ఎంతగా ఎగురుతూంది బాధపోయి...

మళ్లీ మగత...! తెల్లకోటు. ఎవరో స్టెత్ పెట్టి చూస్తున్నారు గుండెమీద. ఎవరో చెవిదగ్గరకు వచ్చి చెంపను చిన్నగా తాకుతూ జ్యోతి...జ్యోతి అంటున్నారు. మళ్ళీ మత్తు...మైకం...

** ** ** ** **

తలుపులు ఎవరో తెగబాదుతున్నారు. కలకాదు. నిజమే గబుక్కున లేచి.. పక్కమీది నుంచి దూకి చీరసర్దుకుని తలుపుతీశాను. ఎదురుగ్గా స్టేషను మాష్టారు.

'ఓ మీరా! మీరు నిన్న నాకు సహాయం చేసిన స్టేషను మాష్టారు కదూ?' అన్నాను.

'రండి...రండి'

'వస్తాను. గానీ, ఇది చెప్పండి ముందు. రాత్రి రాత్రి మీకు ఏమీ భయంగానీ బాధగానీ కాలేదు కదా?'

'అబ్బే! లేదు. మా మామయ్య గారింటిలో... అయినా నాకేం భయమండీ! మరీ విచిత్రం! కాకపోతే ఒకటి...రాత్రి మీరు వెళ్లాక కాసేపటికి విపరీతమయిన కడుపునెప్పి...'

'మీ కేకలు వినిపించాయి అని చెప్పాలండి.'

'అవునా! అవునేమో. అంతగా అరిచానేమో? కానీ మా మామయ్య అప్పటికప్పుడు నాకు ఆపరేషను చేసేశారు.'

'ఆపరేషనా?'

'ఆ... అపెండిసైటిస్ అని డయాగ్నయిస్ చేసేరు. టెస్టులన్నీ కండక్ట్ చేసి 'ఆపరేషన్ ఎ మస్ట్' అన్నారు.

'జ్యోతిగారూ?'

'మరేం కంగారులేదులెండి. అసలు మీకింకో విషయం తెలుసా? నేను వచ్చిందే అందుకోసం! నేనాయనకి ఒక ప్రామిస్ చేశానండి.'

'ప్రామిస్సా?'

'ఆ... నా జీవితంలో ఎప్పుడు ఏ బాధ వచ్చినా ఫస్ట్‌ట్రీట్‌మెంటూ... ఇఫ్ నెసెసరీ ఆపరేషనూ ఆయనే చేయాలని... చేయించుకుంటాననీ...'



## ధర్మేంద్ర – జయల స్నేహం?!

లతనతో నటించేందుకు జయప్రద ఒప్పుకోక పోవటమే కాకుండా మరీ ముసలిజోడీ అని ధర్మేంద్రను అనటంతో కోపిష్టి ధర్మేంద్ర– హేమమాలినిని ఆకట్టుకున్నట్లే జయను కూడా ఆకట్టుకోవాలని ప్రయత్నించి సఫలీకృతుడయ్యాడట. దానితో జయప్రద–ధర్మేంద్రతో సినిమాల్లో నటించేందుకు ఒప్పుకుంది. ధరమ్– జయల స్నేహం మరింత గట్టిపడి పోతుందేమోనని అటు హేమ, యిటు జయప్రద భర్త భయపడుతున్నారట.




'చేసేరా? అయితే'

'భలేవారే ఇందులో అనుమానమేముంది? పైగా అయాం సోమచ్ రిలీవ్డ్ యూసీ...! సక్సెస్‌ఫుల్...'

'ఎక్కడ చేసేరూ?'

'ఇక్కడే థియేటర్‌లో...'

'అనెస్థీషియా? లోకలా జనరల్లా?'

'జనరలే! ఎంత తీయని మైకమండీ అదీ?'

## ఆపరేషన్ ఆపెండిసైటిస్

'జ్యోతిగారూ మరేమనుకోపోతే, ఒక్కసారి మీ మామయ్యనీ, ఆ థియేటర్‌నీ చూపించుతారా?'

'ఏం...? ఎందుకనీ?' నవ్వేను నేను అదోలా...

'అబ్బే! ఏంలేదు. జస్ట్ క్యూరియాసిటీ? అంతే...'

'అంతేకదా! ఓకే! రండి! మామయ్యా! ఓ మామయ్యా! ఇలా రండి. ఇది అర్రె ఇది...' అంటూ ఆశ్చర్యపోయాను. ఎదురుగా అన్నీ పగిలిపోయి బూజుపట్టి పాడుబడ్డ థియేటర్ వెక్కిరిస్తూ నాక్కనిపించింది. మట్టీ...దుమ్మూ....ధూళీ...

'ఓహ్! గాడ్!' అన్నాను నేను.

'ఏం...? ఏమయింది?'

'ఇదేమిటి ఇలా అయిపోయింది? ఇందాక ఇక్కడ ఈ బెడ్‌మీదనే నేను పడుకుని ఉన్నది. ఈ థియేటర్... యస్ ఈ థియేటర్‌లోనే నాకు మా మామయ్య ఆపరేషన్ చేసింది. ఇదేమిటి ఇలా అయిపోయిందీ?' అన్నాను నేను. నా గొంతులో నాకే తెలియని జీర. ఏదో భయం.

'జ్యోతిగారూ! కూల్‌డౌన్ రిలాక్స్. రిలాక్స్.'

'సార్! మీకు...మీకు ఇదంతా? ఇదంతా తెలుసా?'

'ఇపుడే తెలిసింది?'

'తెలిసిందా? ఏమిటీ?'

'చెప్పనా నిన్న చెప్పాను చూడండీ రాత్రి మీకు. ఈ ప్రాంతంలో నేను వచ్చిన కొత్తలో ఒకరిని హత్య చేసేరనీ, ఆయన... ఆయనే మీ డాక్టరు మామయ్య!'

'నో... నాట్! ఇట్సింపాజిబుల్ నేను రాత్రి ఆయనతో బాగా మాట్లాడాను. ఆయన... ఆయన న్నాకు ఆపరేషన్.

'లేదు... లేదు జ్యోతిగారూ! ఇది నిజం! ఆయనని ఎవరో చంపారు. ఆయనే దయ్యం అయి తిరుగుతున్నట్లు అందరూ అనుకుంటున్నారు. ఇప్పుడు చూడండి ఈ ఇల్లు...'

'యస్! కానీ...కానీ, నాకు ఆపరేషన్...'

'పోనీ, మీరేమీ అనుకోపోతే కాస్త అక్కడ బొడ్డుపక్కన చూస్తారా? మీకు ఆపరేషన్ చేసేరన్న చోటు...'

'అలాగే...!'

జ్యోతి నడుముదగ్గర కట్టుకున్న చీరె కట్టు కొంచెం తొలగించి చూచింది. అక్కడ జర్రిపోతు ఆకారంలో.... ఆపరేషన్ చేస్తే కుట్టు కుట్టితే మానిపోయిం తరువాత ఏర్పడే మచ్చలా కనిపించీ కనిపించక గీత...

'మామయ్యా! నేను నా మాట నిలబెట్టుకుంటే... చచ్చికూడ నీ మాట నీవు నిలబెట్టుకున్నావ్ మామయ్యా!' అంది జ్యోతి... కడుపు మీదున్న గీతను అలవోకగా చేత్తో తాకుతూ... ○

శ్రీ కొండ నవీన్, గూడూరు.

* బలవంతుల స్థాయికి చేరాలంటే బలహీనుల సంఘటితం సామాన్యంగా అవసరం. సంస్కార స్త్రీలు పాటించకపోవడం మంచిదా? చెడుదా?

చిత్తం. ఈ పిల్లి మెడలో గంట కట్టడానికి పూనుకునే దెవరు? 'మంది'గా మాత్రమే ఉపయోగపడే జాతిని ఎవరూ పూనుకుని ఏక తాటిపై నడిపించలేరు.

* మతం మన కళ్లు కప్పే అభిమతం కాదు. ఓ కూనలమ్మ! అని ఆరుద్రగారు మానవ జాతికి ప్రబోధించిన గొప్ప సత్యంగా భావించుతాను. మరి మత మూఢుల మాటేమిటి?

మూఢత్వంలోనే వుంది కదండీ - వాళ్లకి తోవదు - చెప్తే వినరన్న అర్థం-

పి. టి. రాజశేఖర్, రెడ్డిగూడెం.

* వి-వాలో పాలిటెక్నిక్ కోచింగ్‌కి ఎనిమిది వందలా?

ఏం తక్కువా?! చదువు'కొన'డానికెంతేనా కర్చు చేయగల వారుంటే - ఇలాగే వుంటాయి రేట్లు!

పోలోజు వెంకటాచారి, బోడుప్పల్.

* నేటి యువత సెక్స్ విషయంలో తొందరపడుతున్నారనిపిస్తుంది. ఈ విషయంలో మీ అభిప్రాయం?

ఏవో అర్థంకాని విషయాలు బోధిస్తున్నామని సమరంవంటి అభ్యుదయవాదులే సీరియల్స్ రూపంలో అతి వర్ణనలతో అత్యంత అసహ్యమైన విషయాలు అత్యంత 'నోరూరకం'గా రాస్తుంటే- ఏం చెప్పం?!

* బూతు సాహిత్యం సినిమాలు నిరసిస్తున్నామంటూనే అందాల పోటీలకోసం ఎగబడుతున్నారు. దాని అర్థం ఏమిటి రామలక్ష్మిగారూ?

ఏం లేదు. నే కన్నంలోంచి చూడనంతవరకూ బూతు లేదని దాని అర్థం- క్షమించండి ఈ విషయాలు నాకు నచ్చవివి.

టి. వెంకటేశ్వర్లు, భీమవరం

* కె. రా. గారూ! ఎడిటర్‌గారితో మాట్లాడి ఈ ప్రశ్నావళిలో ఉత్తమ ప్రశ్నను ఎంపిక చేసి బహుమతియిస్తే బాగుంటుందని నా అభిప్రాయం. మీరేమంటారు?

- మరి సమాధానం మాటేమిటి?! అంటా.

ఇ. కృష్ణప్రసాద్, ఖమ్మం.

* పెద్దవాళ్లు గాడిదతో పోలుస్తారెందుకు?

ఓర్పుకి!

* సర్వే జనా సుఖినోభవంతు అంటే! అందరూ సుఖంగా వుండాలని.

# ప్రశ్నావళి

## - కె. రామలక్ష్మి

న్యాయపతి రమేష్‌బాబు, హైదరాబాదు

* మన దేశంలో రాజకీయ పార్టీలను బాన్ చేసి మిలిటరీ పాలన అయితే దేశం చాలా బాగుపడుతుంది. ప్రజలు సుఖంగా జీవిస్తారు.

ఒక్కటే లోపం-మీరీ ప్రశ్న రాయలేరు. నేనీ సమాధానం రాయలేను- అంత స్వేచ్ఛ కోల్పోతాం- జ్ఞాపకం పెట్టుకోండి. అష్ట అవకరాలతోనైనా సరే- ఎన్నుకున్న ప్రభుత్వం ఎప్పుడూ మేలు. మిలటరీ పాలనకన్నా! కనీసం వీరిని దింపేయగల స్వేచ్ఛ, రైట్ వుంటుంది మనకి. మిలటరీ పాలనలో- నోరెత్తితే చావుకద. ప్రపంచం మొత్తం చరిత్ర తిరగేసి చదవండి. మంచి నియంతలూ, మంచి సాయుధ పాలనా ఎక్కడా కనిపించదు. అంతటి అణచివేతలో కూడా స్వేచ్ఛ కోసం ఎక్కడో ఓ 'మండేలా' కన్పిస్తూనే వుంటాడు.




* బుద్ధుడు హుస్సేన్ సాగర్‌లో మునిగితే రామారావుగారొక్కరికేనా విచారం. ప్రజలకు లేదా?

నిజమా? ప్రపంచంలో కెల్లా పెద్ద రాయి బుద్ధుడు నా వూళ్లో లేకుండా పోయాడే అని జనం బాధపడి పోతారా? ఇక్కడ ప్రజ కాదు ముఖ్యం. ఎవరి పాలనలో అన్నది-అన్ని రకాల పునాదిరాళ్లలాగా ఇదీ చరిత్రలో వుంటుంది. ఇప్పుడూ వుంటుంది..... ఇక్కడే ఇక్కడే కదా తథాగతుడు సాగిలిన చోటు! అని చూపుతారు... రాబోయే తరాలకి!

బి.ఆర్. మూర్తి మచిలీపట్నం.

* అటు షా నుంచి యిటు మీ శ్రీవారి దాకా అటు రచనా రంగం నుంచి యిటు సినిమా డైరెక్టర్ల దాకా గెడ్డాలు పెంచుతున్నారు. పాతాళభైరవి మాంత్రికుడిలా వీటిలో నిక్షిప్తశక్తు లుంటాయని నమ్మకమా? లేక నిత్యక్షురకర్మ బారి నుండి తప్పించుకొనుటకా? లేక ఇదొక మేనియానా?

ప్రతి విషయం పరిశోధనాత్మకంగా చూస్తే వచ్చే తంటా యిదే! పాపం గెడ్డం పెంచుకునేపాటి స్వేచ్ఛ లేదా మగాళ్లకి?

జి.వి.ఎస్. రావు, కాకినాడ.

* నాగరికత పరాకాష్ట ఏది?

తీరిక వేళలు తెలివిగా నింపకల్గడమనేదే నాగరికత తుది పంట సార్. చాలా కష్టమైన పని!

* మాటకి చేతకి అర్థాలు వేరుగా ఉంటాయంటారు. ఎలాగండీ!

సింపుల్. మాట మనిషి తెలివిని చాటుతే చేత అతగాని మనస్సుని- లేకుంటే ఆ మాట అసలు అర్థాన్ని తెలుపుతుంది.

కాజ హనిత, ఏలూరు

* మీరు పాతికేళ్ల నాటిముంచి జవాబులిస్తున్నారు కదండీ! ఆనాటి ప్రశ్నలు యీనాటి ప్రశ్నలు ఏమైనా మార్పు కనిపించిందా? రచయితలలో ఆలోచనా సరళిలో మార్పు కనిపించిందా?

చాలా చాలా మార్పు వచ్చింది సోదరీ! ఈ రోజున ఆడవాళ్లు చాలా మారారు. తమ 'ఉనికి' గుర్తించిన ఆలోచనలు ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. అప్పుడూ ఇప్పుడూ మార్పు లేనిది- ప్రేమ గురించిన గోలే!





చల్లా సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

**చూ**యింగమ్ నముల్తూ శ్రీమతి సూర్యాన్నే చూస్తోంది. ఆమె కళ్ల ముందో దృశ్యం...

కాలికి బుల్లెట్ దెబ్బ తగిలిన లేడి- హఠాత్తుగా జీప్ శబ్దం వినిపించి- ప్రాణభీతితో కుంటుకుంటూ పరుగెత్తుతోంది. ఆమె గన్‌కున్న లెన్స్‌లోంచి రేంజ్ ఫిక్స్ చేసుకుంటోంది. ట్రిగ్గర్ నొక్కింది.

రెండో కాలులోకి దూసుకుపోయింది బుల్లెట్.

లేడి పరుగెత్తలేక కూలిపోయి- భయంతో నేలమీద పాకుతోంది. ఆమె జీప్ దిగి- గన్ పట్టుకుని-లేడి దగ్గరకొచ్చింది. లేడి ముఖం స్థానంలో వున్న పురుషుడు జాలిగా- భయంగా చూస్తున్నాడామెను. ఆమె లేడి మెడ మీద పొడవడానికి గన్ ఎత్తింది... సూర్యం బ్రాటిల్ మూత తీశాడు.

ఆమె ఆశ్చర్యంగా చూస్తోంది.

మరో చూయింగ్‌గమ్ వేసుకుని కసిగా నముల్తోంది.

అతను బాటిల్ పట్టుకుని అన్నాడు.

"మగాళ్లంతా దుర్మార్గులు కారనీ- మంచీ చెడూ ప్రతి మనిషిలోనూ ఉంటాయనీ- కేవలం ఆడదాని ప్రాణాలు తీయడానికే మగాడు పుట్టాడన్న మీ సిద్ధాంతం తప్పని నిరూపించి- అవసరమైతే ఓ స్త్రీ కోసం పురుషుడు తన ప్రాణాన్ని సైతం త్యాగం చేయగలడనీ నిరూపించడానికి నేనిది తాగుతున్నాను"-

మెరుపు వేగంతో అతను బాటిలెత్తి తాగుతున్నాడు.

కొయ్యబారిపోయింది శ్రీమతి.

నిశ్చేష్టురాలై- శిలాప్రతిమలా

నివ్వెరపోయి- నిస్తేజంగా- చూస్తోందతన్ని!

ఆమె మనసు అట్టడుగు పొరల మధ్య ఏదో అలజడి.

ఆమె హృదయంలో ఘనీభవించిన స్తబ్దతలో చిన్నకుదుపు.జరుగుతున్న సన్నివేశం-ఏదో కలలా-

కలలోని కలలా-

కళ్ల ముందు కనిపిస్తున్న నిజం ఆమె మెదడు రిసీవ్ చేసుకోడానికి వ్యతిరేకిస్తూ...

ఖాళీ బాటిల్ టేబుల్ మీద పెట్టి ఆమెను చూశాడతను.

ఆమె పెదవులు వణుకుతున్నాయి.

ఆమె ముఖం చెమటతో తడిసిపోతోంది-

ఆమె కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవై—ఓ అద్భుతాన్ని చూసినట్టు చూస్తున్నాయి.

"మే...డ...మ్..." మత్తుగా అన్నాడు సూర్యం.

ఓ ఉత్తుంగ కెరటంలా దుఃఖం ఆమెను చుట్టేసింది.

ఏడుపు అంటే అసహ్యించుకునే ఆమె-

ఏడ్చే ఆడవాళ్లను పురుగుల్లా చూసే ఆమె-

ఆమె ఏడుస్తోంది!!

* * * *

మోగుతున్న ఫోనందుకుని-

"హలో" అంది శ్రీమతి వణుకుతున్న స్వరంతో.

"హలో-శ్రీమతేనా?" ఆదుర్దాగా వినిపించింది.

"అవును-మీరెవరు?"

"నేనే- నవ్యను- శ్రీమతీ- ఘోరం... జరిగిపోయింది"... ఏడుస్తోంది నవ్య. శ్రీమతి చేతులు సన్నగా వణుకుతుండగా- గట్టిగా రిసీవర్ పట్టుకుని అంది.

"ఏ...ఏ...టి... ఏమైంది...?"

"సూ...ర్యం..."

"ఊ... సూర్యం?"

"ఏదో విషం మింగాడట- ఉస్మానియాలో చావు బ్రతుకుల మధ్య వున్నాడు"- ఆమె చేతిలోని రిసీవర్ అలాగే జారి కింద పడింది.

కలలో మనిషిలా ఎదురుగా చూసింది.

అంతే- ఉలిక్కిపడింది!

ఎదురుగా-

జుట్టు విరబోసుకుని- నల్లని చీర జాకెట్‌లో- కనుగుడ్లు భయంకరంగా పెద్దవి చేసి- నల్లగా నెత్తురోడుతున్న పెదవుల్తో తననే భయంకరంగా చూస్తూ...

"ఠంగ్"

పన్నెండున్నర అయినట్టు గోడగడియారం హెచ్చరిస్తుండగా-

గొంతు తడారిపోతుండగా.

"ఎవరూ..." ఆమె స్వరం కంఠాన్ని దాటలేదు.

"నన్ను గుర్తు పట్టలేదా- నేనేనే రాక్షసీ"-బొంగురుగా ఉందామె స్వరం.

కెవ్వున అరవాలనుకుని- అదీ సాధ్యపడక- నిలువునా చెమటతో తడిసిపోతూ-

ఎక్కడో తీతువు వికృతంగా కూసిన శబ్దం...

"నేనే శ్రీమతీ- నీ అత్మను..." వికృతంగా నవ్విందా ఆకారం.

"నిలువునా ఓ నిండు ప్రాణాన్ని నీ స్వార్థం కోసం బలి తీసుకున్న నీ అత్మ నిజస్వరూపం ఇది- నిన్ను చూసి నువ్వు భయపడితే ఎలా..."

చితిమంటల చిటపటల్లా నవ్విందా ఆకారం.

"ఇప్పుడు నేనేం చేయబోతున్నానో తెలుసా- నన్ను

**ఇంతవరకూ సాగిన కథ–19:–** భార్య నవ్యను దారికి తెచ్చుకునే విషయంలో స్వాగత్‌కు మేనమామ భాగ్యరాజ్ సహకరిస్తాడు. శైలజ హత్యకేసులో చిక్కుకున్న నవ్యను స్వాగత్ విడిపించుకు వస్తాడు. ఆ హత్య స్వాగత్ చేసి వుంటాడని నవ్య భావిస్తుంది. నగల షాపులోంచి ఓ యువతితో బయటకి వస్తున్న స్వాగత్‌ని సూర్యానికి చూపిస్తుంది శ్రీమతి. శైలజ హత్యకేసులోనుంచి నవ్యను విడిపించేందుకు పబ్లిక్ ప్రాసిక్యూటర్ స్వాగత్‌కు కొన్ని సలహాలిస్తాడు.

నేను చంపుకుంటాను. ఆత్మ- ఆత్మహత్య చేసుకుంటే- నువ్వేమవుతావో ఎప్పుడైనా ఆలోచించావా? నీకు ఆలోచించే వ్యవధి కూడా ఇవ్వను. చంపుకుంటాను. నన్ను నేను చంపుకుంటాను. అనుభవించు శ్రీమతీ- ఆ నరకం ఎలా వుంటుందో అనుభవించు...''

ఆమె రెండు చేతులకున్న పదునైన గోళ్ళు ఆమె కంఠాన్ని బలంగా పట్టుకుని- శ్రీమతి చూస్తుండగానే- కసుక్కున వాడైన ఆ గోళ్ళు- నల్లటి ఆమె గొంతు మీద దిగి- రక్తం చిప్పన



ఎందుతుండగా- పక్కనే వున్న పేపర్ వెయిట్ అందుకుని- బలంగా విసిరింది శ్రీమతి. భళ్ళున ముక్కలయింది డ్రస్సింగ్ టేబుల్ అద్దం.

వణికిపోతూ చుట్టూ చూసింది.

గదిలో జీరో వాట్స్ బల్బ్ నీలిరంగు కాంతిని జల్లుతుంది.

నెమ్మదిగా వచ్చి- ఫ్రిజ్ తీసి చల్లటి నీళ్ళు తాగింది.

అప్పుడు గుర్తొచ్చింది నవ్య ఫోన్‌కాల్!

''సూ...ర్యం...''

భూనభోంతరాలు దద్దరిల్లేలా అరిచి- ఉన్మాదంలా- విసురుగా తలుపు తీసుకుని-బయటకు పరుగెత్తింది శ్రీమతి.

పోర్టికోలో ఆగివున్న కారును కూడా పట్టించుకోలేదామె.

ఆమె కళ్ళ ముందు-

బాటిల్ ఎత్తి సైనేడ్ కలిపిన కూల్‌డ్రింక్ తాగుతున్న సూర్యం...

అతని కళ్ళలో కనిపిస్తున్న నిజాయితీ-

అతని ముఖంలో ప్రతిఫలిస్తున్న అనురాగం-

సెలైన్ బాటిల్స్ మధ్య- ఆక్సిజన్ సిలిండర్స్ మధ్య- చావుకీ బతుక్కీ మధ్య- కేవలం ప్రేమించే మనుషులున్నారు. అని తనను నమ్మించడానికి రాయిలాంటి తన హృదయాన్ని కరిగించడానికీ- ఓ ఆశయం కోసం ప్రాణాలు అర్పించే ఆదర్శవంతుడిలా- గర్వంగా మృత్యువుతో పోరాడుతున్న 'సూర్యం!!

"గెలుపు నీదే సూర్యం- అంతిమ విజయం నీదే- కానీ- కానీ- నువ్వు చేసిన త్యాగానికి నేను అర్హురాల్ని కాదు సూర్యం. ఎందుకు- ఎందుకంత ఘోరం చేశావ్....''

వేగంగా నడిరోడ్డు మీద పరుగెత్తుతున్న ఆమె మనస్సు మూగగా రోదిస్తోంది. రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది.

వీధి దీపాలకాంతిలో- ఆమె నీడ పొడవుగా సాగి-అంతలోనే ఆమె వెనక్కి తిరిగి- ఆమెను వెంటాడి-తిరిగి ఆమె ముందు పరుగెడుతూ...

హఠాత్తుగా వీధి లైట్లు ఆరిపోయాయి.

గడ్డకట్టిన కటిక చీకటి-

ఆమె ఇవేమీ గమనించకుండా- అలాగే పరుగెడుతోంది.

''సూర్యం- సూర్యం-''

ఆమె పెదవులు ఆయాసంతో వణుకుతున్నాయి.

హఠాత్తుగా ఆ ప్రదేశమంతా- ఎర్రటి వెలుగులో నిండిపోయింది. ఆశ్చర్యంగా చూసింది శ్రీమతి.

పక్కనే ఉన్న ఓ పధ్నాలుగు అంతస్తుల భవనం అగ్నిశిఖల మధ్య నిలువునా ఆహుతైపోతోంది.

జనం కకావికలై పరుగెడుతున్నారు.

ఆర్తనాదాలు

హాహాకారాలు-

కేకలు- ఏడుపులు-

శ్రీమతి ఆగలేదు. వేగంగా పరుగెత్తుతూనే వుంది. అరగంట తర్వాత- గణగణ శబ్దం చేస్తూ ఆమెకు ఎదురయ్యాయి ఫైరింజన్లు.

సరిగ్గా ఓ గంట తర్వాత-

చీకట్లో గంభీరంగా కనిపించింది- ఉస్మానియా హాస్పిటల్-

ఆమె ఆ ఆవరణలో ప్రవేశించింది.

అక్కడ గాలి- మృత్యుదేవత- శ్వాస నిశ్వాసాల్లా ఉంది. ఆ గాలికి తలలూపుతున్న చెట్లు ఆ చీకట్లో మృత్యువును ఆరాధించే పిశాచాల్లా వున్నాయి.

ఆమె నెమ్మదిగా నడుస్తోంది.

చావు బతుకుల మధ్య సందిగ్ధంలా-

తాను చేసిన పాపం రూపుదాల్చి- సన్నివేశంగా

మారి తనను ప్రశ్నిస్తున్నట్టు- వైతరణి ఈదుతున్నట్టు-

పది నిముషాల తర్వాత-

ఆ గదిలోకి ప్రవేశించిందామె.

నవ్య తల తిప్పి- ఆమెను చూసి నవ్వింది.

చావులా చల్లగా వుందామె నవ్వు.

ఆమె నెమ్మదిగా బెడ్ దగ్గరకొచ్చి- చూసింది.

తెలుపును చూసి జీవితంలో మొదటిసారిగా భయపడింది ఆ క్షణంలో నే-

తల నుంచి కాళ్ళవరకూ- పూర్తిగా కప్పిన తెల్లటి దుప్పటి-

"సూ...ర్యం..."

నెమ్మదిగా గొణుగుతూ.... వణుకుతున్న చేతుల్తో మెల్లగా అతని ముఖం మీద దుప్పటి తీసింది.

"మగవాళ్ళలో కూడా మంచి వారున్నారని-ప్రేమించే హృదయం ఉంటుందనీ ఇప్పటికైనా నమ్ముతారా మేడం?"

తననే చూస్తూ ప్రశ్నిస్తూ- నవ్వుతున్నట్టున్న ఆ కళ్ళు.... నిర్జీవంగా- గాజుగోళాల్లా-

"సూర్యం?!"

కంఠనాళాలు తెగిపోయేలా అరిచింది శ్రీమతి.

'ఠంగ్'

ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది శ్రీమతి.

ఒక్క క్షణం ఆమెకు తనెక్కడున్నదీ అర్థంకాలేదు. గదంతా చీకటి. ఫాన్ తిరగడంలేదు. వణుకుతున్న చేతుల్తో టార్చ్‌లైట్ అందుకుని గడియారం మీద ఫోకస్ చేసింది.

మూడున్నర!!

"మైగాడ్" హాయిగా నిట్టూర్చి- బాత్‌రూంకెళ్ళి ముఖం కడుక్కుంది.

"ఇదంతా కలగా చేసినందుకు దేవుడా నీకు నా కృతజ్ఞతలు"- వచ్చి బెడ్ మీద కూర్చుని ఫోనందుకుంటున్నప్పుడు- అప్పుడొచ్చింది కరెంట్-

నెంబర్ డయల్ చేసి- చెవి దగ్గర పెట్టుకుంది రిసీవర్ని.

రింగవుతున్న చప్పుడు... క్షణాలు గడుస్తున్నాయి.

"హలో..." వినిపించిందవతల్నుంచి.



"హలో నవ్యా...?"

"యస్- మీరెవరు?"

"నేను శ్రీమతిని- సారీ ఫర్ ది డిస్టర్బెన్స్... సూర్యం ఎలా వున్నాడు?"

"వాడికేం- బాగానే వున్నాడు. రాత్రి ఇక్కడే భోంచేసి రూంకెళ్ళి పోయాడు. ఏం- ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగింది నవ్య.

"ఏంలేదు- నథింగ్- వూరికే చేశాను. గుడ్‌నైట్-" చప్పున ఫోన్ పెట్టి- బెడ్ మీద వాలిపోయి- పైన తిరుగుతున్న సీలింగ్ ఫాన్ చూస్తూ ఆలోచిస్తోందామె. ఆ రాత్రి- ఆలోచనతోనే ఆమెకు తెల్లవారింది.

* * * *

వాచీ చూసుకున్నాడు స్వాగత్.

పది దాటి ఇరవై నిముషాలు- సిగరెట్ తీసి వెలిగించి కిటికీలోంచి చూశాడు.

ఆ ఐదో అంతస్తు పైనుంచి చీకట్లో నగరమంతా జ్వాలా తోరణంలా- కనిపిస్తోంది. ఏదో ఫ్లయిట్ పెద్ద శబ్దం చేసుకుంటూ వెళ్తోంది. ఆ రోజు సాయంత్రం స్వాగత్ శైలజ ఇంటిని పరిశీలించాలని వచ్చాడు.

దాదాపు నాలుగు గంటలపాటు వెదికాడు.

అన్నీ- సర్వసాధారణంగా వున్నాయి. అంతేకాదు- అప్పుడే ఇల్లంతా నీట్‌గా సర్ది పెట్టినట్టు- శుభ్రంగా ప్రతి వస్తువూ- ఏది ఎక్కడుండాలో అక్కడున్నాయి. బెడ్‌రూమ్‌లో ప్రతి అంగుళం వెదికాడు. అలానే డ్రాయింగ్‌రూం. ఎక్కడా చిన్న క్లూ కూడా దొరకలేదు. అయినా అతను నిరుత్సాహపడలేదు. లేచి ఆ డ్రాయింగ్‌రూం మధ్యలో నిలబడి ఓసారి గదంతా చూశాడు.

ముందుగా బీరువా తీశాడు.

చీరెలు- జాకెట్లు వగైరాలు నీట్‌గా పేర్చి వున్నాయి. పట్టుచీరెలు హేంగర్స్‌కి వేలాడుతున్నాయి. ప్రతి చీరె తీసి దులిపి- మళ్ళీ బీరువాలో పెట్టసాగాడు.

అలా అన్ని రాక్స్ అయిపోయాక- లాకర్ తీసి చూశాడు. ఏవో ఫెర్‌ఫ్యూం బాటిల్స్- రెండు గోల్డ్ చెయిన్స్, రెండు జతల గాజులు, ఏవో చిట్‌ఫండ్స్ తాలూకు రెండు పాస్ బుక్స్- ఓ బ్యాంక్ పాస్‌బుక్-

పాకెట్ సైజు ఫోటో ఆల్బమ్-

ఆల్బమ్ తీసి చూశాడు. ఆమె కాలేజీనాటి ఫోటోలు. స్నేహితురాళ్ళతో కలిసి దిగిన నాలుగు ఫోటోలు- ఆ తర్వాత అన్నీ- తన కంపెనీ వార్షికోత్సవంలో కల్చరల్ ప్రోగ్రాం ఇచ్చినప్పటి ఫోటోలు- నవ్య- తాను కలిసి- తన ఇంట్లో డిన్నర్ ఇచ్చినప్పటి ఫోటోలున్నాయి-

చిరాగ్గా లాకర్ లాక్ చేసి వెనక్కి తిరిగాడు.

టేబుల్ కనిపించింది.

డ్రాయర్ లాగి చూశాడు.

పిట్‌మన్స్ షార్ట్‌హ్యాండ్ బుక్- రెండు నోట్ బుక్స్- రెండు పెన్సిల్స్- నాలుగు ఇన్‌లాండ్ కవర్స్ వున్నాయి. విప్పి చదివాడు. ఊరి నుంచి వాళ్ళమ్మ రాసిన ఉత్తరాలవి. పెళ్ళి చేసుకొమ్మని- ఇక్కడ సంబంధాలు చూస్తున్నామనీ- వీలైతే ఓసారి వచ్చి పొమ్మనీ- మిగతావన్నీ రొటీన్ విషయాలు. ఆ ఉత్తరాలన్నీ వారం పది రోజులు తేడాతో వచ్చినవి.

షార్ట్‌హాండ్ బుక్ తెరిచి చూశాడు. మధ్యలో మడత పెట్టున్న పేపర్ కనిపించింది. తీసి చదివాడు.

అది శైలజ– వాళ్ళమ్మకు రాసిన ఉత్తరం.

తన లెటర్స్ అన్నీ చేరాయనీ– సాధ్యమైనంత త్వరలో అక్కడి కొస్తున్నాననీ– అక్కడే అన్ని విషయాలు, మాట్లాడుకోవచ్చుననీ– ఆమె ఆరోగ్యం గురించి జాగ్రత్తలు రాస్తూ– "మరో ముఖ్య విషయం" అని అసంపూర్ణంగా వదిలేసింది.

లెటర్ మీదున్న తేదీ చూశాడు స్వాగత్.

పదహారు!!

ఉలిక్కిపడ్డాడతను. అంటే ఆ రోజే శైలజ హత్య చేయబడింది. ఆ రోజు ఆఫీస్ క్కూడా రాలేదామె. అంటే ఇంటి దగ్గరే వుండి– తల్లికి ఉత్తరం రాస్తుండగా...

సిగరెట్ వెలిగించాడు స్వాగత్.

అప్పుడొచ్చి వుండాలి హంతకుడు– లేదా ఆమెను

ఆ హోటల్‌కు పిలిపించి వుండాలి. రాస్తున్న వుత్తరం మధ్యలో ఆపి- ఆ హోటల్‌కు వెళ్ళిందంటే- హంతకుడు ఆమెకు బాగా పరిచయమైన వ్యక్తే అయుండాలి. ఆ పేపర్ తీసి జేబులో పదిలంగాపెట్టుకున్నాడు.

డ్రాయర్ మూసేసి- టేబుల్ మీద చూశాడు. పదహారో తారీఖు నాటి ది హిందూ న్యూస్ పేపర్- దాని మీద పేపర్ వెయిట్- అటు పక్కగా ఎర్రరంగు ఎక్స్‌టెన్షన్ టెలిఫోన్ - పక్కనే డైరెక్టరీ - దాని మీద స్క్రిబ్లింగ్‌పాడ్- ప్యాడ్ అందుకుని చూశాడు.

ఏవేవో ఫోన్ నెంబర్స్ రఫ్‌గా వేసున్నాయి.

ఏవో పిచ్చి గీతలు- కొందరికి ఫోన్లో మాట్లాడుతూ- ఎన్‌తో ప్యాడ్ మీద ఏవేవో- రాయడం అలవాటు. ఆ అలవాటు శైలజకుంది. ఓ సారి డ్రాఫ్ట్ అని మర్చిపోయి దాని మీద ఇలాగే గీతలు- నెంబర్లు వేస్తే- తాను మందలించిన విషయం గుర్తొచ్చి-

బాధగా నవ్వుకున్నాడు.

ప్యాడ్ అందుకుని చూశాడు. ఓ చిన్నపూవు- నక్షత్రం - రఫ్‌గా గీసి వున్నాయి. ఎవరితోనూ ఫోన్లో మాట్లాడుతూ అప్రయత్నంగా గీసినట్టు స్పష్టంగా తెలుస్తోంది. నాలుగు సరళ రేఖలు దాని మీద 'బాస్' అని ఇంగ్లీషులో రాసి- దాని చుట్టూ గుండ్రంగా గీసింది. దాని పక్కనే ఓ ఫోన్ నెంబర్- దాని కింద 302 దాని చుట్టూ ఓ వృత్తం- దాని కింద వరుసగా తన సంతకాలు నాలుగు. స్వాగత్ రెండు క్షణాలు ఆలోచించి ప్యాడ్ మీదున్న ఫోన్ నెంబరు డయల్ చేసి ఆతృతగా వినసాగాడు.

"గుడీవినింగ్ ప్యారడైజ్!"

ఆపరేటర్ కంఠం తీయగా వినిపించింది. ఉలిక్కి పడ్డాడు!

ఫోన్ క్రెడిల్ చేసి- ఆ ప్యాడ్ మీద కాయితం చింపి మరోసారి చూశాడు. సిగరెట్ వెలిగించి ఆలోచించాడు.

302 రూంలో నే శైలజ హత్య జరిగింది.

అంటే-

ఎవరో ఆమెకు ఫోన్ చేసి హోటల్ ప్యారడైజ్ రూం నెంబర్ 302కి రమ్మని- అక్కడ బాస్ వున్నారనీ చెప్పి వుండాలి. అందుకే- ఆ రోజు ఆఫీసుకి కూడా రాకుండా, కనీసం ఫోన్ చేసి చెప్పకుండానే- ఎటూ తనని కలుసుకోబోతోంది గదా అని హోటల్‌కి వచ్చేసి వుంటుంది.

ఆమెనలా హోటల్‌కి రప్పించి- నవ్యకు డిటెక్టివ్ చేత ఫోన్ చేయించి ఈలోగా శైలజను హత్య చేసి- నవ్య ఆ గదిలోకి రాగానే ఆమె ఆ హత్య చేసినట్టు వాతావరణం సృష్టించి....

అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"రాస్కెల్" కసిగా పళ్ళు నూరాడు.

అంతలో అతని దృష్టి బీరువా కింద నిలిచి.... వేగంగా వెళ్ళి అది తీసి చూశాడు.

ఫిల్టర్‌కు ఓ అంగుళం మేర వరకూ కాల్చి- కాలితో తొక్కి బీరువా కిందికి నెట్టి వేసిన సిగరెట్!



## 'లతా' టి. వి. చిత్రం?

రాజ్‌కపూర్ పైన, రాజీవ్‌గాంధీపైన టి. వి. ఫిలింలు పూర్తయిన తర్వాత గానకోకిల లతామంగేష్కర్‌పై టి. వి. చిత్రం తీస్తానని సెమిగ్రెవాల్ ప్రకటించింది కాని ఆ చిత్ర నిర్మాణానికి విఘాతం ఏర్పడింది. కారణం ఆమె ఎక్కువ డబ్బులు డిమాండు చేసిందట. కాని అది నిజం కాదని వేరే కారణాల వల్ల ఆ చిత్రానికి విఘాతం ఏర్పడిందని, ఒకసారి లత ఒ.కె. అన్న తర్వాత వెనక్కి తగ్గరని ఆమె సన్నిహితులు అంటున్నారు. మరి టి. వి. చిత్రం ఎప్పుడు ప్రారంభమవుతుందో?

స్నఫ్ కలర్ ఫిల్టర్ మేర చుట్టూ వున్న గోల్డ్ కలర్ గీత మీద రాసివుంది.

ఛాన్సలర్!!

అతని పిడికిళ్ళు బిగుసుకుని నుదటి మీద నరాలు పొంగాయి.

బయటకు వెళదామని గుమ్మం వేపు రాబోతుండగా-

సరిగ్గా అప్పుడు-

హఠాత్తుగా అంధకారం అలుముకుంది.

"షిట్-" కరెంటును తిట్టుకున్నాడు స్వాగత్. అగ్గిపెట్టె తీసి వెలిగించాడు.

వెంటిలేటర్ నుంచి వస్తున్న గాలికి అది ఆరిపోయింది.

బయటగాలి ఉధృతంగా వీస్తుంది. లైట్లు ఉన్నప్పుడు వినిపించని గాలి వేగం- ఆ చీకట్లో భయంకరంగా వినిపిస్తోంది.

ఆ గది కిటికీ తలుపులు గాలికి కొట్టుకుంటూ చప్పుడు చేస్తున్నాయి. అలాగే చీకట్లో తడుముకుంటూ- నెమ్మదిగా అడుగులు వేస్తూ- గుమ్మం వైపు నడుస్తున్నాడు స్వాగత్.

ఎక్కడో పెద్దగా ఉరిమింది.

హఠాత్తుగా వాతావరణంలో వచ్చిన మార్పుకు అతను ఆశ్చర్యపోయాడు.

తలుపుకు ఇంకా ఆరడుగుల దూరంలో వుండగా-

సరిగ్గా అప్పుడు వినిపించిందతనికి-

మెల్లగా-

చాలా దగ్గరగా వినిపిస్తున్న అడుగుల చప్పుడు!!

చప్పున ఆగిపోయాడు స్వాగత్-

అతని మెడమీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి. నెమ్మదిగా పక్కకు వెళ్ళి గోడకు ఆనుకుని నిలబడ్డాడు.

అడుగుల చప్పుడు ఆగిపోయింది.

స్వాగత్ ఊపిరి బిగబట్టాడు.

ఎవరు?

ఎవరు?

ఖచ్చితంగా హంతకుడే అయుండాలి. తాను ఇక్కడి కొస్తున్నట్టు గమనించి- తనను ఫాలో అయి- తీరా సాక్ష్యాలు చేతికందిన తర్వాత- వాటి కోసం- అవసరమైతే తనను కూడా హత్య చేయడానికి వెనకాడని హంతకుడు!!

ఉత్తరాన మెరుపు మెరిసింది.

ఆ తృటికాలంలో ఆ గదిలో అతనికేమీ కనిపించలేదు.

గాలికి అల్లాల్లాడుతున్న కిటికీ తెరలు తప్ప!

ఐదు నిముషాలు గడిచిపోయాయి.

అడుగుల చప్పుడు వినిపించలేదు.

ఏమై ఉంటాడు- తను బయటికొస్తే ఎటాక్ చేయడానికి సిద్ధంగా బయట నిరీక్షిస్తూ వుండొచ్చు.

లేదా- తను భ్రమ పడి వుండొచ్చు.

రెండు క్షణాలు ఆలోచించి- నెమ్మదిగా అడుగులు వేస్తూ- తలుపుదగ్గరకు రాబోయి- ఆ ప్రయత్నం మానుకుని- బెడ్‌రూంలో కెళ్ళాడు.

కాటుక లాంటి చిక్కటి చీకటి- కళ్ళకు రెండంగుళాల దూరంలో సైతం ఏముందో కనిపించనంత గాఢాంధకారం!

ఆ గదిలో వెంటిలేటర్ లేదు.

కిటికీ తలుపులన్నీ బిగించి వున్నాయి.

నెమ్మదిగా తడుముకుంటూ బెడ్ కోసం వెదుకుతున్న స్వాగత్ మెడమీద- వెచ్చగా ఊపిరి తగిలి-

అలాగే నిల్చుండిపోయాడు.

ఒకటి-

రెండు-

క్షణాలు గడుస్తున్నాయి.

ఇక ఆలస్యం చేయదల్చుకోలేదు స్వాగత్.

బలంగా విసురుగా చేయి విసిరాడు.

అతని చేతికి ఏమీ తగల్లేదు.

తను భ్రమపడుతున్నానేమో నని మరోసారి అనుమాన మొచ్చిందతనికి. వేగంగా తిరిగి డ్రాయింగ్‌రూం వేపు కదిలాడు.

అప్పుడు-

"స్స్‌స్స్‌స్స్....." నిశ్శబ్దంగా తన కుడి చెవి మీదుగా దూసుకు పోయిన సున్నితమైన శబ్దం!!

స్వాగత్ డ్రాయింగ్‌రూంలో ప్రవేశించి- గోడ వారగా నిలబడ్డాడు.

కన్నార్పకుండా చూస్తున్నాడతను.

చీకటి- చీకటి!!

అయినా హంతకుడొస్తే- ఈ గుమ్మం నుంచే రావాలి. అతన్ని ఎటాక్ చేయడానికి తనకిది అపూర్వమైన ఆఖరి అవకాశం.

# లవ్‌గేమ్

క్షణాలు గడుస్తున్నాయి.

ఎలర్ట్‌గా నిలబడి- తన సర్వ శక్తులూ కుడిచేతి మీద కేంద్రీకరించి ఎటాక్‌కు సిద్ధంగా వున్నాడు స్వాగత్.

ఎక్కడో పిడుగుపడినట్టు ఉరిమింది.

గాలి చేస్తున్న ప్రళయగర్జన భీకరంగా వినిపిస్తోంది.

కిటికీ తలుపులు అవిరామంగా కొట్టుకుంటున్నాయి-

అప్పుడు-

అది అడుగుల చప్పుడు కాదు.

ఓ మనిషి ఉనికిని తెలుపుతూ గాలిమోసు కొచ్చిన మనిషి వాసన - మెరుపు వేగంతో అతని చేయి గాలిలోకి లేచి- మరుక్షణం- అవతలి వ్యక్తిని తాకింది.

"హమ్..... మ్...."

ఊహించని పరిణామానికి- బలమైన ఆ ఎటాక్‌కు- మరొక రయితే భయంకరంగా ఆర్తనాదం చేసివుండేవారు.

పళ్ల బిగువున అంతటి బాధను భరించిన అతని నిగ్రహానికి స్వాగత్ ఆశ్చర్యపోయాడు.

మరుక్షణం మరోసారి స్వాగత్ చేయి అతన్ని తాకింది.

అంతే-

స్వాగత్‌కు కేవలం రెండు సెంటీ మీటర్ల దూరంలో అతని చేతిని రాసుకుంటూ దూసుకు పోయిందో బుల్లెట్!

అప్పుడు అర్థమైంది స్వాగత్‌కి.

శత్రువు చేతిలో రివాల్వరుంది. కేవలం తన ఉనికిని పసిగడితేచాలు- ఎంతదూరం నుంచైనా క్షణంలో తనను నేలకూల్చగలడు. కానీ తను అతన్ని స్పష్టంగా చూడగలిగినప్పుడే అతన్ని ఎదుర్కొగలడు.

అయినా చలించలేదతను.

రివాల్వర్ ట్రిగ్గర్ నొక్కబోయేముందు అది మనిషికి ఎంత ఎత్తులో ఉంటుందో మెరుపు వేగంతో ఆలోచించి- తటాలున కిందికి వంగి-

అదే వేగంతో - మెరుపులా ముందుకు దూకాడు.

అతని ట్రిక్ ఫలించింది.

ఊహించని దాడికి- అతను బాలెన్స్ తప్పి కిందపడ్డాడు.

అంతే-

ఆ అవకాశాన్ని అపూర్వంగా సద్వినియోగ పర్చుకున్నాడు స్వాగత్- అతని మీదకు లంఘించి- అందిన చోటల్లా ఉక్కు పిడికిలితో అతన్ని ఊపిరి తీసుకోనివ్వలేదు.

స్వాగత్‌కు అర్థంకాని దొక్కటే-

తానింతగా అతని మీద దాడి జరుపుతున్నా- అతను చాలా నిశ్శబ్దంగా రవ్వంత కూడా చప్పుడు చేయకుండా మౌనంగా బంధించే అతని నిగ్రహం-

యస్-

వీడు సామాన్యుడు కాదు. ప్రొఫెషనల్ కిల్లర్!

అవతల వ్యక్తి చచ్చిపోయాడో- స్పృహ తప్పాడో- లేదా- అవకాశంగా ఎదురు చూస్తున్నాడో అర్థం కాని పరిస్థితి.

ఒకేఒక్క క్షణం ఆగాడు స్వాగత్-

ఆ క్షణం చాలు అతనికి.

తన గడ్డం మీద బలంగా తాకిన అతని పిడికిలి-

విసురుగా వెనక్కి పడ్డాడు స్వాగత్-

అంతే-

వేగంగా లేచిన శబ్దం- స్వాగత్ సక్కకు దొర్లాడు-

నిశ్శబ్దం!!

క్షణాలు దొర్లుతున్నాయి.

శత్రువు నుంచి ఏ విధమైన రెస్పాన్స్ రాక పోయే సరికి- నెమ్మదిగా లేచాడు స్వాగత్-

అలాగే నిలబడ్డాడు-

ఐదు- పదీ- పదిహేను- నిముషాలు గడిచిపోయాయి.

అప్పుడర్థమైందతనికి-

కరెంట్ మొత్తం పోలేదు. కేవలం ఈ ఫ్లాట్‌కి మాత్రమే పోయింది. అగ్గిపెట్టె తీసి వెలిగించాడు.

క్షణం వెలిగి ఆరిపోయిన కాంతిలో అతనికేమీ కనిపించలేదు. డ్రాయింగ్‌రూం కుడి పక్కన వుంది మెయిన్‌స్విచ్-

మెల్లగా వెళ్లి స్విచ్ ఆన్ చేశాడు.

వెలుగు గదంతా పరుచుకుంది.

రిలాక్సింగా ఊపిరి పీల్చి- తన మీద ఎటాక్ చేసిన వ్యక్తి తాలూకు ఆధారాల కోసం మొత్తం వెదికాడు.

ఏమీ కనిపించ లేదు.

తాను సంపాదించిన సాక్ష్యాల్ని చూసుకున్నాడు. జేబులో పదిలంగా ఉన్నాయి. లైట్ ఆఫ్ చేసి- డోర్‌లాక్ చేసి- వేగంగా బయటికొచ్చి కారు దగ్గరకు వెళ్తూ ఎదురుగా చూశాడు.

అక్కడ కనిపించింది ఓ ఇరానీ హోటల్-

అక్కడికి వెళ్లి లాయర్ సక్సేనాకు ఫోను చేశాడు.

అర్జెంట్ పనిమీద వరంగల్ వెళ్లారనీ- రేపు ఉదయానికి వస్తారనీ- ఆయన భార్య చెప్పింది.

ఆ సాక్ష్యాల్ని భద్రంగా దాచి- రేపు కోర్టులో సబ్‌మిట్ చేయాలి.... తృప్తిగా అనుకుని కారు స్టార్ట్ చేశాడు స్వాగత్.

స్వాగత్ ఇంటికెళ్లే సరికి పన్నెండు దాటింది.

హాల్లో- భాగ్యరాజ్- భార్గవి- మన్మధరావ్ కూర్చునిమాట్లాడు కుంటున్నారు.

స్వాగత్‌ని చూసి అంతా సీరియస్ అయిపోయి అతన్ని స్పెసిమెన్‌ను చూసినట్టు చూడసాగారు.

స్వాగత్ తన గదిలోకి వెళ్లి బీరువా తీసి- లాకర్‌లో వున్న లెదర్ కేస్‌లో స్క్రిబ్లింగ్ పాడ్ పేపర్- సిగరెట్ ముక్క శైలజ ఉత్తరం పెట్టి- లాకర్‌కి తాళం వేసి- కీ తీసుకుని- బీరువా లాక్ చేసి- ఆ తాళం కూడా తీసుకుని బ్రీఫ్‌కేస్‌లో తాళాలు పెట్టి- బ్రీఫ్‌కేస్ లాక్ చేసి- ఆ తాళం తన తలదిండు కవర్‌లో వేసి- బట్టలు మార్చుకుని- ఆ దిండు మీద తలపెట్టి పడుకున్నాడు.

ఓ అయిదు నిముషాల తర్వాత లేచి- పిల్లో కవర్‌లో వున్న తాళం తీసి గదిలోపల గుమ్మం దగ్గరున్న డోర్‌మేట్ కింద పెట్టి తలుపు బోల్టు పెట్టి పడుకున్నాడు.

ఓ అరగంట తర్వాత అతను నిద్రపోయాడు.

ఉదయం- ఏడు గంటలకు మెలకువ వచ్చింది స్వాగత్‌కి.

వెంటనే లేచి సక్సేనాకు ఫోన్ చేశాడు.

"వెల్ మై బాయ్- యు డిడ్ ఎ నైస్‌థింగ్- వెంటనే వాటిని తీసుకురా- రేపే హియరింగ్ ప్లీజ్ బి హర్రీ-" అన్నాడు సక్సేనా.

ఉత్సాహంగా డోర్ మేట్ ఎత్తి చూశాడు.

తాళం వుంది. అది తీసుకుని- బ్రీఫ్‌కేస్ తీసి- అందులోంచి బీరువా తాళాలు తీసుకుని- లాకర్ తీసి- లాకర్‌లోని లెదర్ కేస్ తీసి చూశాడు.

అది ఖాళీగా ఉంది!!

(ఇంకావుంది)

## గాంధారికి తగని పాత్రలు



దేశవ్యాప్తంగా దాదాపు 92 వారాలు టి.వి. ప్రేక్షకులను మెప్పించిన 'మహాభారత్'లో గాంధారిగా నటించిన రేణుకాఇస్రానీకి ఆమె సత్తాకు తగిన పాత్రలు రావటం లేదుట. గాంధారి పాత్రకు న్యాయం చేకూర్చిన ఇస్రానీకి అన్నీ ముసలి పాత్రలే యివ్వ జూపుతున్నారట నిర్మాతలు. కాని యిటువంటి పాత్రలకు ససేమిరా ఒప్పుకోవటం లేదు రేణుక. "ఏక్ ఆస్మాన్-కయీ దిశాయే"లో తన పాత్ర చూసిం తర్వాత అయినా నిర్మాతలు మనసు మార్చుకొని తనకు తగిన పాత్రలు యివ్వకపోతారా అన్న ధీమాతో వుంది ఇస్రానీ. మరి ఇస్రానీ అదృష్టం ఎలా వుందో?

# యువతా! కవితా!!

## ఆడదే.....

పచ్చిచ్చి
మొగుణ్ణి కొంటున్నపుడు
తాళి కట్టాల్సింది
మగాడు కాదు-
ఖచ్చితంగా ఆడదే!!

ముఖ్యం

సుఖసంతోషాలకోసం
అశ్రులు చాస్తూ
దాన్ని వెదకటం కాదు
మన ధ్యేయం!
కష్ట నష్టాలను ఎదురీది
బ్రతకడమే- జీవితం!!

-జి. బాలాజీ

## లోకం పోకడ

నేనులేని ఈ లోకంతో
నాకులేదు ఏ బంధం!
నాతోడిదే లోకం అన్న
నా సహధర్మచారిణి
లోకం కోసం
ఉన్నవాళ్ళకోసం
ఉన్నన్నాళ్ళు బ్రతికేస్తుంది!
నా రక్తం పంచుకున్న పిల్లలు
నా అస్థినిమజ్జనానికి ముందే
ఆస్తి పంపకాల కోసం
డెత్ సర్టిఫికేట్స్
సక్సెషన్ సర్టిఫికేట్స్
సంపాదిస్తారు!
కన్నుమూసిన నేను
మరొక్కసారి కన్నుతెరిస్తే
నా సంతాపసభకు
నేనే గౌరవాధ్యక్షుడుగా విచ్చేసి
కోరుకుంటాను జన్మరాహిత్యం!
అప్పుడు జరుగుతుంది
నిజమైన కపాలమోక్షం!

–కె. సీతారామగిరి

## నేటి భారతం

ష్టపడి చదవాలనుకుంటే–
"నో అడ్మిషన్!"
ామపడి పని చేయాలనుకుంటే–
"నో వేకెన్సీ!"
ంతకలేక చావాలనుకుంటే–
"నో పర్మిషన్!"

-పి. వి. ఎన్. ఎస్. పద్మకుమారి

## "రంగులు"

చీకటి రంగు
"నలుపు"!
వెలుతురు రంగు
"తెలుపు"!
గుండె అగాధాల రంగు
"కలగలుపు"!

–వి. సూర్యారావు



## మనసు కవి

నీ చేత మనసు
నీ మాట మనసు
నీ రాత మనసు!
మనసు మీద మనసుపడి
మంచిని ఎంచావు
మానవత్వాన్ని పెంచావు!
మనసుకిన్నాళ్ళు పతిలా వుండి
సుపరిమళ సురక్షితమిచ్చావు
పదమంజుల మధు సుందర తేనెలా
మనసుకు భాష్యం చెప్పావు!
మరే దూర తీరాల మనసు రమ్మందో...
నాకు తెలియదుగాని
నీ ఆకస్మిక వీడ్కోలుకు
పతి లేని సతిలా నా మనసు
దిక్కులదిరేలా ఆక్రోశిస్తోంది!

- కర్రి రామకృష్ణారెడ్డి

## వరకట్నమా? వద్దు! వద్దు!

చెప్పించండి మాకు చదువులు
ఇప్పించండి మాకు ఉద్యోగాలు
లేదా పెట్టించండి వ్యాపారాలు!

ఇవ్వండి మాకు స్కూటర్లు
ఆపై పోయించండి వాటికి పెట్రోలు!
మా ఇంట్లోని గదులన్నిటికి
మీ డబ్బుతోనె అలంకారం
మా తల్లికి, అక్క చెల్లెళ్ళకు
మీ డబ్బుతోనె సింగారం
భరించండి మా పెళ్ళి ఖర్చు,
ఉగ్గుపాల ఖర్చు!
దించండి మా ఋణభారాన్ని
పోషించండి మా వంశోద్ధారకుల్ని!
గర్భధారణ పని మాది, పురిటిభారం మీది
పెడితే చాలదు బట్టలు మాత్రమే
టైలరు బిల్లు పెరిగింది మరి!
వస్తే మేము మీ ఇంటికి,
ఏమిస్తారు మాకు?
వస్తే మీరు మా ఇంటికి
ఏం తెస్తారు మాకు?
పండగలన్నీ మా ఇంట్లో,
వేడుకలన్నీ మీ ఇంట్లో
అవన్నీ రాసుకోండి మీ జమాఖర్చుల్లో
ఒప్పుకుంటే చాలు, మా షరతుల్ని
కోరము మేము వరకట్నాన్ని
అందాకా మీకు మేము అందము!
దిగిరాము దిగిరాము దివినుండి భువికి!!

-డి. హేమలత

## అన్యాయం

దురాచారం బ్యాంకు అది...!
పెళ్ళి పే ఇన్ స్లిప్ మీద
డబ్బు వేసే ఖాతాదారుడు
అమ్మాయి తండ్రి!

సాంప్రదాయం విత్‌డ్రా ఫారం మీద
వరకట్నం సంతకం పెట్టి
సొంతం చేసుకుంటాడు
అబ్బాయి తండ్రి!

–నారంశెట్టి ఉమామహేశ్వరరావు




మ్మంలో కాలుపెట్టగానే సుమిత్ర గొంతు గంభీరంగా పలికింది ఆహ్వానిస్తూ. నెమ్మదిగా విశాలమైన హాల్లోకి నడిచేను.

"రండి కృష్ణమూర్తిగారూ! అప్పుడే అరగంటనుంచీ మీ కోసం ఎదురు చూస్తున్నాను!" అన్నది సుమిత్ర, చేతిలో వున్న ఇంగ్లీషు నవలని పక్కన పడేస్తూ, సోఫాలోంచి లేచినిలబడి.

వాచీ చూసుకున్నాను. సాయంత్రం ఆరున్నర దాటుతోంది..

# ప్రశ్న

శ్రోపి రామమోహనశాస్త్రి

"ఆయామ్ సారీ! ముందుగానే రావాలని చాలా ప్రయత్నించేను సుమిత్రగారూ! వెధవది ఆఫీసులో పని ఓ పట్టాన తెమిలిందికాదు! ఇంటికి వెళ్లి ఆదరా బాదరా స్నానం చేసి బట్టలు మార్చుకుని బయల్దేరేసరికి ఈ వేళయిపోయింది!" అన్నాను ఆలస్యానికి నొచ్చుకుంటూ.

సుమిత్ర నవ్వింది. ఆ నవ్వులో హుషారులేదు. నవ్వలేక నవ్వుతున్నట్లు తోచింది.

"ఆరుద్రగారన్నట్లు 'నీవెక్కిన రైలుబండి ఎపుడూ ఓ జీవితకాలం లేటు!'నేనిప్పుడున్న స్థితిలో అయిదు నిముషాలు కూడా చాలా దుర్భరంగానే అనిపిస్తోంది కృష్ణా!" అన్నది సుమిత్ర, కూర్చోమని నాకు తన ఎదురుగావున్న పేముకుర్చీ చూపిస్తూ.

ఆమె పిలుపు చెవినపడి ఉలిక్కిపడ్డాను. ఒక్క క్షణం ఆమెవైపు కళ్లార్పకుండా చూసేను.

కూర్చున్నాను.

సుమిత్ర చిరునవ్వు నవ్వింది.

"కంగారుపడకు కృష్ణా! కాలేజీ వదిలి పదేళ్లయిపోయింది. ఏడాది నుంచి మనం ఈ వూళ్లో పరిచయస్థులుగా వుంటున్నాం. ఉద్యోగాలు కల్పించిన హోదాల అంతరాలనిబట్టి అర్థంలేని మర్యాదలు పాటిస్తూ ఓ రకంగా ఆత్మవంచనే చేసుకుంటూ వస్తున్నాం. అవునా? అది

ఆత్మవంచన అని తెలిసినా లోకానికో, మనుషుల తత్వాలకో జడిసి సరిపెట్టుకోవడం నిజం! కాని ఇప్పుడు ఆ రాజీధోరణి అనవసరం అనిపించి ఆ గీత చెరిపేసేను. ఇప్పుడు మళ్ళీ మనం కాస్సేపు స్నేహితులుగా మనసులు విప్పి మాట్లాడుకుందాం!" అన్నది.

తల పంకించేను.

నేను కొన్ని క్షణాలు ఏం చెప్పాలో తోచక మౌనంగా సుమిత్రవంక చూస్తూ వుండిపోయేను.

"నా ధోరణి వింతగా వున్నట్టుంది నీకు?" అన్నది సుమిత్ర.

"వింతకాదు సుమిత్రా! కాని యిప్పుడిలా మాట్లాడాల్సినంత అవసరం ఏమొచ్చిందో అర్థం కావడంలేదు" అన్నాను. ఏదో అంటున్నానేగాని నా మనసులో ఎన్నో రకాల ఆలోచనలు. క్రమపద్ధతిలో మాత్రం సాగటంలేదు. అంతా గజిబిజి గందరగోళం.

సుమిత్ర, ఆమె భర్త రామ్మూర్తీ, నేనూ ఒకే కాలేజీలో డిగ్రీదాకా కలిసే చదువుకున్నాం. కాలేజీ జీవితం సహజంగానే మమ్మల్ని స్నేహితుల్ని చేసింది. ఆ రోజులు అంతే మరి. చదువుకి ఆస్తిపాస్తుల అంతరాలు, కులమతాల తారతమ్యాలూ ఉండవు. మనుషులకి తప్ప. తెలివితేటల్నిబట్టే డిగ్రీలు వరిస్తాయి. (కొనుక్కుంటే ఏమో మరి!) కాకపోతే తెలివితేటల స్థాయినిబట్టి ర్యాంకులు. నేను తెలివిగల వాణ్ణన్న నమ్మకం నాకెప్పుడూ వుండేదికాదు. ఒకవేళ ఉన్నా నా ఆర్థిక పరిస్థితులు వాటిని సద్వినియోగం చేసుకునేందుకు తగ్గిన శ్రమకి దోహదం చెయ్యలేక పోవడాన, చదువులో నా ప్రతిమెట్టూ థర్డ్‌క్లాసు కంపార్ట్‌మెంటే అయింది. అదృష్ట దురదృష్టాలపై, ఇప్పుడు నాకు నమ్మకం లేకపోయినా, అప్పట్లో మాత్రం నా 'అదృష్టం' యింతే అనుకుని సంతృప్తిపడ్డాను. చెయ్యగలిగిందేం లేదు మరి.

ఆ రోజుల్లో సుమిత్ర అంటే నాకు వల్లమాలిన ప్రేమ వుండేది. ఎన్నడూ పైకి వ్యక్తం చెయ్యలేకపోయినా ఆమెని ఓ భక్తుడికన్న ఎక్కువగా ఆరాధించేవాణ్ణి. ఆమె ప్రతి కదలికలోనూ అపూర్వమైన సౌందర్యం, లావణ్యం దర్శించేవాణ్ణి. నిలువెల్లా పులకరించి పోతూండేవాణ్ణి. ఆమె నా సొంతమైతే లభించే మధురాతి మధురమైన జీవితాన్ని వూహించుకుని మురిసిపోయేవాణ్ణి. బహుశ ఆ వయసుకుండే సహజమైన బలహీనత అయివుండొచ్చు. కాని నాకు అదొక పగటికల అని తెలుసు. నాదొక మధ్య తరగతి జీవితం. నాన్న ఒక్కడి సంపాదన మీద బతికే ఆరుగురి జీవుల కుటుంబం. తొందరగా నేనొక డిగ్రీ సంపాదించి, ఉద్యోగస్తుణ్ణయితే తనకి చేయూతగా వుంటానని అతి కష్టం మీద చదివిస్తున్న నాన్న మనోవేదనని తల్చుకున్నప్పుడల్లా నా మనస్సు బరువెక్కేది. అందుకే కోరికలు ఎన్నివున్నా వాటన్నింటినీ హృదయంలో మారుమూల చీకటికోణాల్లోనే అణిచివేసుకుని, చదువు కొనసాగించేవాణ్ణి.

కాలేజీ జీవితం ముగిసింది. డిగ్రీ చేతికి వచ్చేసింది. ఆ తరవాత నా కథ మామూలే. కాలేజీలో చదువుతూనే సంపాదించుకున్న టైపూ, షార్ట్‌హాండ్ సర్టిఫికెట్లతో పాటు, పట్టాకూడా చేర్చి, కనిపించిన చోటికల్లా అప్లికేషన్లు పంపడం, ఇంటర్వ్యూలకని పిలుపొచ్చిన చోటికల్లా కాళ్ళకి బలపాలు కట్టుకు తిరగడం, ఆశా నిరాశల మధ్య ఊగులాడ్డం, నెక్స్ట్‌టైం బెటర్‌లక్ అని సరిపెట్టుకుని మళ్ళీ మళ్ళీ ప్రయత్నాలు సాగించడం ఓ ఏడాది సాగేక పురుషలక్షణం అబ్బింది నాకు. ఉద్యోగంలో చేరిన రోజున నాన్న ముఖంలో వెలిగిన ఆనందం యింతా అంతాకాదు. ఏనుగెక్కినట్టుందాయనకి. నిజమే మరి! ఆయనకి నిజమైన చేయూత దొరికింది. మూడేళ్ళు తిరిగేసరికి ఇద్దరి అక్కల పెళ్ళిళ్ళూ చేసేశాడాయన. అందుకోసం ఆయన చేసిన అప్పులు తీర్చే బాధ్యతని నా భుజాలమీద వేసుకున్నాను, ఆనందంగా. ఆ తరవాత నా పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించ బోయినప్పుడు నేను గట్టిగా ప్రతిఘటించేను. చెల్లెలి పెళ్ళికూడా అయిపోయేదాకా ఆ వూసెత్తొద్దన్నాను. ఆయన ఎంతగా ఒత్తిడిపెట్టినా నేను మనసు మార్చుకోలేదు. మరో రెండేళ్ళకి ఆ బాధ్యత కూడా తీర్చేసుకుని నాన్న రిటైరై పోయేరు. పెన్షను పుచ్చుకుంటూ అమ్మా, తనూ నిశ్చింతగా కాలక్షేపం చేసేస్తున్నారు. వాళ్ళ బెంగంతా నేనో యింటివాణ్ణి కాలేదని! అప్పటికే నాకు ముప్పైరెండు దాటేయి. ఇంకా ఆలస్యమైతే పిల్లనివ్వడానికెవరూ రారేమోనని వాళ్ళ అనుమానం. వాళ్ళ ఆలోచనలేవిటో నాకు తెలుసు. కాని నాకసలు పెళ్ళిధ్యాస కలగలేదు. చేసుకోవాలని కూడా లేదు.

అందుకు కారణం సుమిత్ర రామ్మూర్తిని పెళ్ళి చేసుకోవటం! అదీ ప్రేమించి మరీ! ఆ విషయం విన్న తర్వాత నేను విపరీతంగా బాధపడ్డాను. నా గుండె పగిలి పోయినట్టనిపించింది. జీవిత సర్వస్వాన్నీ పోగొట్టుకున్నట్టు లోలోపల కుళ్ళి కుళ్ళి ఏడ్చేను. నా కుటుంబ పరిస్థితులు, నా ఆర్థిక స్థితి, తప్పించుకుందుకు వీల్లేని నా బాధ్యతలు, ఏనాడూ ఆమెకి నా మనసులో వున్న అభిప్రాయాన్ని చెప్పుకోనివ్వలేదు. చెప్పి వుంటే ఇలా జరిగి వుండేది కాదేమో! పూర్తిగా అలాగనీ నిర్ధారించుకోలేక పోయాను. సుమిత్రా, రామ్మూర్తీ ఆస్తిపరులు! వాళ్ళతో నేనేరకంగానూ సరితూగను. ఒకవేళ ఆమెతో అని వుంటే.... మొహం వాచేలా చీవాట్లు పెట్టేదేమో కూడా!

ఏది ఏమైనా సుమిత్ర పరాయి సొత్తయి పోయింది. నాలో ఒకానొక భయంకరమైన శూన్యం ఆవరించేసింది. పెళ్ళి, పిల్లలూ, సంసారం.... వీటిమీద నాకో రకమైన విరక్తి కలిగింది. అందుకే ఒంటరిగానే నేటిదాకా గడుపుకొచ్చేశాను.

నేను పని చేస్తున్న పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలో, సుమిత్ర పర్సనల్ ఆఫీసర్. నేను మాత్రం యింకా చాలా మందిలాగే సీనియర్ క్లర్క్‌గానే ఆమె సెక్షన్‌లో నే పని చేస్తున్నాను. ఆమె అదృష్టం కొద్దీ.... లేదా ఆమె తెలివి తేటల కొద్దీ నాకన్నా చాలా ముందుగా అక్కడ చేరడంతో ఆ స్థాయికి వెళ్ళింది. నేను చాలా చోట్ల టెంపరరీ జాబులు చేసి చేసి ఆలస్యంగా చేరడంతో.... ఇలా వుండిపోయాను. పైగా ఆమె పట్టుదలగా క్వాలిఫికేషన్స్ పెంచుకుంది. నేను అలాంటి మంచి పన్లకి దిగలేక పోయేను ఓపికలేక.

నేటిదాకా ఆమె నన్ను తనింటి కెప్పుడూ రమ్మని పిలవ లేదు. తన సంసారం గురించీ, పిల్లా జెల్లా వివరాలూ నాకు చెప్పలేదు. నేనడగనూ లేదు. పాత స్నేహాన్ని మననం చేసుకుని అవసరం లేని విషయాలు ఆఫీసర్ దగ్గర ప్రస్తావించడం 'అవిధేయత' అవుతుందేమోనన్న భయం నాలో ఏమూలో కదులుతూండటం ముఖ్య కారణం. మనుషు లెప్పుడూ ఒక్కలా వుండరు. కాలగతిలో స్వభావాల్లో ఎన్నో మార్పులు రావడానికి ఆస్కారం వుంటుందని నా నమ్మకం.



"కృష్ణా! ఈ లోకంలో ఉన్నట్టు లేవు!" అన్నది సుమిత్ర నన్ను ఆలో చనల్లోంచి బైట పడేస్తూ.

నవ్వేను. జేబులోంచి సిగరెట్టు పెట్టి, అగ్గిపెట్టి బైటికి తీసేను. ఓ సారి ఆమె వైపు చూసేను.

[illegible]

ఓ సిగరెట్టు ముట్టించేను. గట్టిగా పొగ దమ్ములాగి గాలిలోకి వదిలేను. అంతలో వంటావిడ ట్రేతో ఉప్మా ప్లేట్లూ, నీళ్ల గ్లాసులూ తెచ్చి టీపాయ్ మీదుంచింది.

"తీసుకో కృష్ణా!" అన్నది సుమిత్ర ఓ ప్లేటు నాకు అందిస్తూ. అందుకున్నాను.

"ఇప్పుడీ మర్యాదలన్నీ దేనికి?" అన్నాను.

"నా తృప్తి కోసం! సాధారణంగా నా యింటికి గెస్టు లెవరూ రారు. నేను పిలిస్తేగా రావటానికి? ఎందుకో నా కీ ఒంటరితనమే హాయిగా వున్నట్లని పిస్తుంది. అఫ్‌కోర్స్! నువ్వు నా స్నేహితుడివి! కొన్నేళ్ళపాటు కాలేజీలో కలిసి చదువుకున్నాం! చాలా సంవత్సరాల తరవాత కలిసేం కదా" అన్నది సుమిత్ర.

"సుమిత్రా! నిన్నో ప్రశ్న అడగాలనుంది!" అన్నాను. నా గొంతు కొంచెం కటువుగా ధ్వనించే వుంటుంది. సుమిత్ర తెల్లబోయి చూసింది.

"నువ్వు ఉదయపూర్ నుంచి ట్రాన్స్‌ఫర్ అయి యిక్కడి కొచ్చి ఏడాది దాటిపోయింది. ఇంతకాలం నేను గుర్తు రాలేదా?" అని ప్రశ్నించేను.

"అదే ప్రశ్న నేను నిన్నడిగితే నీ జవాబేమిటి?" అని సూటిగా అడిగింది సుమిత్ర. ఆమె పెదవుల మీద చిరునవ్వు మెరుస్తోంది.

క్షణం ఆలో చించేను.

"కొత్తగా గుర్తు చేసుకుందుకు అసలు నిన్ను మర్చిపోవడం అంటూ జరిగితే గదా! పోతే కనీసం ఆఫీసు బైట అన్నా కొద్దిపాటి సన్నిహితత్వం చూపించలేదెందుకని అనుమానం కలగవచ్చు. ఆఫీసులో నూ, బైటా ఈ మనుషుల తత్వాలు నాకు బాగా తెలుసు. లేనివి కల్పించి ప్రచారం చేస్తూ ఆనందిస్తారు. ప్రశాంతంగా సాగిపోతున్న జీవితాల్లో కల్లోలం సృష్టించుకుని బాధపడ్డం దేనికని, మనం క్లాస్‌మేట్సమన్న విషయం కూడా నేనెక్కడా అన్లేదు" అన్నాను.

"థాంక్యూ! ఇక నేను నీ ప్రశ్నకి సమాధానం చెప్పక్కర్లేదు. అది నీ మాటల్లోనే వుంది. కాని ఓ చిన్న విషయం మాత్రం చెప్పాలి. అది చెప్పుకోడానికి. ప్రస్తుతం నాకీప్రపంచంలో నీకన్నా ఇంకెవరూ లేరు కృష్ణా! ఏకాకిని" అన్నది సుమిత్ర. ఆమె కంఠం గద్గదికమై పోయింది. ఆమె విశాలమైన కళ్లనిండా నీళ్లు. చెక్కిళ్ల మీదికి జారుతున్నై.

మౌనంగా చూస్తున్నాను. నాలో ఎన్నో ప్రశ్నలు!

సుమిత్ర ఇలా మాట్లాడుతుం దేమిటి? ఎవరూ లేకపోవడమేం? ప్రేమించి పెళ్లి చేసుకున్న భర్త రామ్మూర్తి ఉంతగా ఏకాకి ఎలా అవుతుంది? ఆస్తి పాస్తులున్నాయి. మంచి ఉద్యోగం వుంది. హోదా వుంది. ఏ బాధ్యతలూ, బరువులూ లేని వడ్డించిన

# ప్రశ్న

విస్తరి లాంటి జీవితం! ఇంకేం కావాలి? ఎందుకామె బాధపడాలి?

'అమ్మా! టిఫిన్ చల్లారి పోతోంది. తినండమ్మా! కాఫీ తెస్తాను!" అన్నది వంటావిడ వచ్చి.

ఏదో తిన్నాం అనిపించేం. కాఫీలు కూడా తాగేసేం. వంటావిడ కాఫీ ప్లేట్లూ, కప్పులూ పట్టుకు పోయింది.

మరో సిగరెట్టు ముట్టించి గట్టిగా పొగ పీల్చి వదిలేను.

"నా సంగతికేంగాని, ఇప్పుడు చెప్పు కృష్ణా! నీ గురించి", అన్నది సుమిత్ర మామూలుగా.

"చెప్పడానికేం లేదు సుమిత్రా! మా నాన్న నా మీదుంచిన బాధ్యతల్నించీ విముక్తుణ్నయ్యాను. మా అక్కయ్యలిద్దరి పెళ్లిళ్ళూ, చెల్లి పెళ్లీ చేసేం. హాయిగా వాళ్ల సంసారాలు వాళ్లు చేసుకుంటున్నారు. నాన్న రిటైరైపోయేరు. పెన్షన్ వస్తోంది. అమ్మా, ఆయనా మా వూళ్లోనే కులాసాగా వున్నారు. ఇక నేను! సత్రం భోజనం, మఠం నిద్రగాడిలాగా గడిపేస్తున్నాను. ఉద్యోగం, జీతం కలిపి నా జీవితం. రోజులు గడిచి పోతున్నాయి ఒకదాని వెంట ఒకటి! ఎవరో కవి అన్నట్టు 'దినములు పరస్పర ప్రతిధ్వనులు కాగా!'" అన్నాను.

## మమతల పొత్తు

అందరం కలిశాం
అందరం ఆడాం
కోలాటం
కోలాహలం
మనభాషలు వేరు
మనఘోషలు వేరు.
కట్టు బొట్టు వేరయినా
కట్టుబాటు ఒకటే
హృదయాల స్పందన ఒకటే!

మరిచిపోదాం
అరమరికలు లేకుండా
కలిసిపోదాం
కడవరకు
దేశం ఏ ఒక్కడి సొత్తుకాదు
నీది, నాది మనందరిదీ
అనుభవిద్దాం ఆ సమగ్రతాసొత్తుని
కొనసాగిద్దాం మనమధ్య
మమతల పొత్తుని!

-దిట్టకవి కృష్ణబాబు

"అంతేనా? ఇంకేం లేదా?" అడిగింది సుమిత్ర ఆశ్చర్యంగా.

లేదన్నట్టు తల అడ్డంగా వూపేను.

"ఈ ఒంటరితనాన్ని కావాలని ఎన్నుకున్నావా? లేక కాలక్షేపం ఏదన్నా [illegible] పూర్తిగా వ్యక్తిగతమైన ప్రశ్న అడుకో! అభ్యంతరం లేకపోతేనే చెప్పు!" అన్నది సుమిత్ర. ఆమె కంఠం స్వల్పంగా కంపిస్తోంది. గమనించేను. ఆమె కేదో సందేహం వచ్చిందని అర్థమైంది.

"చెప్పాలనే వుంది సుమిత్రా! కాని ఇప్పుడు ఇన్నేళ్ళ తరవాత చెప్పి ఏం ప్రయోజనం? అందువల్ల బాధే మిగుల్తుంది. పెంచుకున్న ఆశలూ, ఆశించిన అనుభూతులూ, మురిపించిన మధురస్వప్నాలూ.... అన్నీ ఒకేసారి అంతరించి పోయేసరికి మనసు నిండా ఒక భయంకరమైన శూన్యం ఏర్పడిపోయింది ఏనాడో! అందులోంచి బయట పడటం నా వల్ల కాలేదు! అందుకే ఇలా బతికెయ్యడం అలవాటు చేసుకున్నాను.ఇందులో ఎవరి తప్పూ లేదు. ఏదన్నా వుంటే అది నా బలహీనతే అయి వుంటుంది!' అన్నాను సాధ్యమైనంత గాంభీర్యాన్ని గొంతులో నింపుకుని.

నిట్టూర్చింది సుమిత్ర భారంగా. వాచీ చూసుకుంది. రాత్రి ఎనిమిది గంటలు దాటి పోయింది.

"వస్తాను, సుమిత్రా! చాలా పొద్దు పోయింది!" అన్నాను.

"అర్జంటు పనేమైనా వుందా కృష్ణా?" అడిగిందామె.

"అలాంటిదేం లేదు. ఏం?" అన్నాను.

సుమిత్ర లేచి నిలబడింది.

"నీకో విచిత్రమైన వ్యక్తిని పరిచయం చేస్తాను కృష్ణా! ఆ పరిచయం అయింతర్వాత నా జీవితం గురించి నువ్వు అడగని, అడగలేని వివరాలు తెలుసుకుంటావు! నా కార్లో వెళదాం! వస్తావు, గదూ?" అనడిగిందామె.

"అలాగే!" అన్నాను.

సుమిత్ర వంట గది వైపు చూస్తూ "రంగమ్మ గారూ!" అని పిల్చింది. వంటావిడ గబ-గబ వచ్చింది.

"ఏమిటమ్మా?" అన్నది.

"బైటికి వెడుతున్నాను. రావడం కొంచెం ఆలస్యం అవుతుందేమో! మీరు భోజనం చేసెయ్యండి. తలుపులు జాగ్రత్తగా వేసుకుని, హాల్లో పడుకోండి! నే వచ్చి పిలిస్తే మీకు వినిపించాలి గదా!" అన్నది సుమిత్ర.

"అలాగేనమ్మా!" అన్నదావిడ.

సుమిత్ర కారు నడుపుతోంది. నేనామె పక్కనే కూర్చున్నాను. సిగరెట్టు పొగ పీలుస్తూ మధ్య మధ్య ఆమె వైపు చూస్తున్నాను. ఆమె ముఖంలో గాంభీర్యం ఆమె చూపులు రోడ్డు మీదున్నా, వాటిలో ఆలోచనలెన్నో.

కారు సన్నగా శబ్దం చేస్తూ దూసుకుపోతోంది.

## కమల్ 'సాధన'

కమల్ హాసన్ టి. వి. సీరియల్‌లో కనిపించ బోతున్నాడు. అంబరీష్ సంగాల్ దర్శకత్వంలో తయారైన 'సాధన' అనే సీరియల్‌లో కమల్ మనకు కనిపిస్తాడు. దక్షిణ భారత సంగీత కళాకారులతోసహా మనదేశంలోని ప్రముఖ సంగీత కళాకారులను పరిచయం చేసే ఈ సీరియల్‌లో లతామంగేష్కర్, హేమమాలిని వంటి కళాకారులు సైతం మనకు కనిపిస్తారు. ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క నటుడు లేక నటి సమర్పిస్తారట. ఈ సీరియల్‌కు అనురాధ హరిప్రసాద్ చౌరసియా, సతీష్ చంద్ర చిబాలు నిర్మాతలు.



"కృష్ణా! ఎదుటి మనుషుల్ని అంచనా వేసుకోవడంలో పొరపాటు జరగడం ఎవరికైనా సహజమే ఒక్కొక్కసారి. అహంకారంతో నో, అవతలి వాళ్ళ ఆర్థిక పరిస్థితుల్ని బట్టో, వారి ఔన్నత్యాన్నో, వ్యక్తిత్వాన్నో గుర్తించలేకపోవడం క్షమించరాని నేరం. ఈ రకమైన నేరాలకి శిక్ష కూడా చాలా భయంకరంగానే వుంటుంది. ఇది నా అనుభవం!" అన్నదామె.

"నిజం సుమిత్రా! అనుభవం కన్న గొప్ప గురువు ఎక్కడుంటాడు?" అన్నాను. ఆమె ధోరణి నాకు అయోమయంగా అనిపిస్తోంది.

"నేనిప్పుడనుభవిస్తున్న శిక్ష నేను భరించలేకపోతున్నాను కృష్ణా! ఒక్కొక్కసారి నాకు చచ్చిపోవాలనిపిస్తుంది. కాని... నేను ఏకాకిని! ఈ ప్రపంచంలో నా కెవ్వరూ లేరు! అమ్మా నాన్నా పోనేపోయేరు. ఒకవేళ నేను నిజంగానే హఠాత్తుగా కన్నుమూస్తే ఈ విశాల ప్రపంచంలో రెండు కన్నీటి బొట్లు రాల్చే వాళ్ళు కూడా వుండరు. అలా చావడం నాకు యిష్టం లేదు. అందుకే యింకా యిలా జీవచ్ఛవంలా ఒంటరిగా బతుకుతున్నాను!" అన్నది సుమిత్ర.

కట్టుకున్న భర్త రామ్మూర్తి వుండగా ఎవరూ లేని ఏకాకిని అంటుందేం? ఇంతకీ రామ్మూర్తి ఏమైనట్టు? ఈ ప్రశ్న అడగాలని నోరు తెరిచేలోగానే కారు ఓ పెంకుటింటి ముందాగింది.

"కృష్ణా! ఇదే ఆ వ్యక్తి వుండే యిల్లు!" అన్నది సుమిత్ర కారు దిగుతూ. నేనూ దిగేను.

అది నగరంలో మారుమూల పేట. వీధి లైట్లు వెలుగుతున్నాయి. ఆ వెలుగులో యింటి వైపు యధాలాపంగా చూసేను. ఓ కుటుంబం వుండటానికి వీలైన పెంకుటిల్లు. ఇంటి చుట్టూ కొద్దిపాటి ఆవరణ వుంది. చుట్టూ బార్బుడు వైరుతో వేసిన కంచె, చిన్న చెక్క గేటు. ఇద్దరం గేటు తీసుకుని ఆవరణలో ప్రవేశించేం. పూలమొక్కల వరసలు అందంగా చిరుగాలికి తలలూగిస్తూ కనిపిస్తున్నాయి.

మూసి వున్న తలుపులు తట్టింది సుమిత్ర. రెండు మూడు క్షణాల తరవాత తలుపులు తెరుచుకున్నాయి. వరండాలో లైటు వెలిగింది.

"మీరా! రండమ్మా లోపలికి!" అంటూ ఆహ్వానించిందో యువతి, తడి చేతులు పైట చెంగుతో తుడుచుకుంటూ.

హాలు లాంటి ముందు గదిలో ట్యూబులైటు వెలుగుతోంది. ఆ యువతి కంగారుగా రెండు కుర్చీలు తెచ్చి వేసింది.

"కూర్చోండి!" అన్నదామె.

"భోం చేశారా మీనాక్షి! బాబేడి? పడుకున్నాడా?" అని ప్రశ్నించింది సుమిత్ర ఆప్యాయంగా.

"ఇప్పుడే భోజనం చేసి, వంటింటి పని పూర్తి చేశానమ్మా! బాబివ్వాళ ఏడు గంటలకే పడుకున్నాడు. వాళ్ళ స్కూల్లో ఆటలు పోటీలు జరిగాయట. బాగా అలిసి పోయి వచ్చేడు. పెందలాడే తిండి తిని మంచం ఎక్కేశాడు వెర్రినాగన్న!" అన్నది మీనాక్షి.

నేను మీనాక్షి వైపు పరిశీలనగా చూసేను. వయస్సు ముప్పై పైబడి వుంటుంది. సుమిత్ర కన్న ఒకటి రెండేళ్ళు చిన్నదేమో కూడా! బాగా అందమైన మనిషి కాకపోయినా ఆమెలో ఏదో ఆకర్షణ వున్నదేమో అనిపించింది నాకు. మంచి ఒడ్డూ పొడుగ్గావుంది. ఏ కారణం చేతనో బాగా కుంగి పోయినట్లు కనిపిస్తోంది.

"అన్నట్లు మీనాక్షీ! ఈయన కృష్ణమూర్తిగారు. నాతోనే పనిచేస్తున్నారు. నేనూ, ఈయనా, రామ్మూర్తిగారూ ఒకే కాలేజీలో చదువుకున్నాం. కృష్ణా! ఈమె మీనాక్షి! ఓ మగాడి వంచనకి బలైపోయి, వాడి బిడ్డకి తల్లిగా, బిడ్డ కోసమే బతకగలుగుతోంది. భవిష్యత్తు పట్ల ఏ ఆశలూ లేకపోయినా, వాడి కోసం బతుకుతోంది. ఇందాక నువ్వన్నావే... 'దినములు పరస్పర ప్రతిధ్వనులు, గాగ' అని! అలా గడిపేస్తోంది రోజులు! మగాడి దౌర్జన్యానికి, వంచనకీ దగాపడ్డ మరో అభాగిని-మీనాక్షి!" అన్నది సుమిత్ర.

"ఎందుకులెండమ్మా ఆ పాత కథలన్నీ తవ్వుకుని బాధపడటం? నా తలరాత ఇలా వున్నప్పుడు నా జీవితం ఇంకో రకంగా ఎందు కుంటుంది? ...దేవుడు నాకీ దశ కల్పించాడు!అనుభవించాలి-తప్పదు. బాబుని పదేళ్ళ నుంచీ యిలాగే సాకుతున్నాను. వాడు బాగుపడితే అంతే చాలు! వాడి భవిష్యత్తు తప్ప నాకు మరే ఆశా లేదమ్మా!" అన్నది మీనాక్షి రుద్ధ కంఠంతో.

అదీ కన్నతల్లి హృదయం! ఒక మగాడు చేసిన మోసం, అన్యాయం అన్నీ విస్మరించి, అఖరికి తన కడుపున పుట్టిన బిడ్డ ఆ నీచుడి ప్రతి రూపమే అన్న సంగతి కూడా [illegible]. ఆ పసివాడి భవిష్యత్తు [illegible] తల్లులు ఈ ప్రపంచం [illegible] నా భారతదేశంలోనే ఉన్నారు. అందుకే నా దేశం గొప్పది. సారే జహాఁసే అచ్చా! మహాకవి వాక్కు ప్రత్యక్షర సత్యం! నా కళ్ళు తడి అయ్యాయి.

సుమిత్ర హ్యాండ్‌బ్యాగ్ తెరిచింది. అయిదు వందలు తీసి మీనాక్షికి అందించింది.

"అయిదు వందలెందుకమ్మా! వద్దన్నా వినకుండా ప్రతినెలా యిస్తున్నారు. మా యిద్దరి పొట్టలకి మూడు వందలు సరిపోతున్నాయమ్మా! ఎందుకిలా నన్ను ఋణగ్రస్తురాల్ని చేస్తారు? ఈ జన్మలో ఈ ఋణం తీర్చుకోలేనమ్మా!" అంటూ మీనాక్షి పైట కొంగులో మొహం దాచుకుని బావురుమంది. నేల మీద ఒక్కసారిగా కూలబడింది. సుమిత్ర కుర్చీలోంచి లేచి వెళ్ళి ఆమె పక్కన కూర్చుంది నేలమీద. మీనాక్షిని రెండు చేతుల్తో చుట్టి దగ్గిరికి తీసుకుంది.

"తప్పు మీనాక్షీ! అలా ఏడవకూడదు. నేను నీకు అక్కలాంటి దాన్ని. నీకూ, నీ బిడ్డకీ ఏ లోటూ రాకుండా చూసుకునే పూచీ నాది. ధైర్యంగా వుండు. నిన్నీ స్థితికి తెచ్చిన ఆ నీచుడు సిగ్గుపడేలా చెయ్యాలిగాని ఇలా బెంబేలు పడిపోతే ప్రయోజనంలేదు". అంటూ తల నిమురుతూ ఓదార్చింది సుమిత్ర.

చాలా సేపటికి తేరుకుని, "నా సంగతి వదిలెయ్యండమ్మా! నా మనసులో ప్రతి క్షణం..." అని మీనాక్షి ఇంకేదో అనబోతుండగా సుమిత్ర అడ్డుపడింది.

"ప్రతి క్షణం బాబు భవిష్యత్తు గురించే ఆలోచించు మీనాక్షీ! ఇంకెవ్వరి గురించీ ఆలోచించకు! ఎవరి ఆలోచనలు వాళ్ళకుంటాయి. ఎవరి నిర్ణయాలు వారివే! అనవసరంగా మనసు పాడు చేసుకోకు. మేం వెళ్తొస్తాం! మళ్ళీ వీలు చూసుకుని వస్తాను!" అంటూ లేచింది.

"మీనాక్షిగారూ! సుమిత్ర చెప్పినట్లు చెయ్యండి! దేవతలాంటి ఆమె అండ మీకు దొరకటం నిజంగా మీ

అదృష్టం! ధైర్యంగా వుండండి!'' అన్నాను.

మీనాక్షి చేతులు జోడించింది. నెమ్మదిగా బైటికి నడిచేం. కారు తిరుగు ప్రయాణం సాగిస్తోంది.

"సుమిత్రా! నిజం చెప్పు. ఎవరీ మీనాక్షి? ఆమెకీ నీకూ ఏవిటి సంబంధం? ప్రతినెలా నీ జీతంలో అయిదు వందలిచ్చి ఆమెని ఆమె బిడ్డనీ పోషించే బాధ్యత ఎందుకు స్వీకరించావ్? ఈ త్యాగానికి అర్థం, పరమార్థం ఏవిటో వివరించు!'' అంటూ ఒక్కసారిగా ప్రశ్నల వర్షం కురిపించేను.

సుమిత్ర నవ్వుతోంది. కాని అది నవ్వు కాదు! పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోడానికి చేసే వ్యర్థ ప్రయత్నం. ఆ స్థితిలో కారు తిన్నగా వెళ్ళడంలేదు.

"సుమిత్రా! కారు పక్కకి తీసి ఆపు!'' అన్నాను.

చెప్పినట్లే రోడ్డు పక్కన కారాపిందామె. స్టీరింగ్ మీద తలవాల్చి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఓదార్చేందుకు ప్రయత్నించలేదు నేను. వెంటనే ఆపితే ఆగే దుఃఖం కాదని అర్థమైంది నాకు.

నేనో సిగరెట్టు ముట్టించేను. గట్టిగా రెండు దమ్ములాగి గాలిలోకి వదిలేను. అయిదు నిముషాలు గడిచేయి.

"ఛ ఛ! మరీ వెర్రిగా ప్రవర్తిస్తున్నాను కృష్ణా! ఒక్కొక్కసారి కంట్రోల్ తప్పిపోతుంటాను! ఏం చెయ్యను? అది నా వీక్నెస్! ఆడదాన్ని కదా!'' అన్నది.

మాట్లాళ్ళేదు నేను. వింటున్నాను.

"మీనాక్షి అనుభవిస్తున్న జీవితం, రామ్మూర్తి పదేళ్ళనాడు పెట్టిన భిక్ష! అది ఆమెకూ, నాకూ కూడా భయంకరమైన శిక్షగా పరిణమించింది. రామ్మూర్తిని ఆనాడు నేనెంతగా ప్రేమించాను! ఎంత ఆరాధించాను! అతను నన్ను కాదంటే ఆత్మహత్య చేసుకోవాలని కూడా అనుకున్నాను. అతని ప్రేమలో గుడ్డిదాన్నయి పోయేను. అతన్ని గురించి ఎవరు ఏం చెప్పినా వినిపించుకోలేని చెవిటిదాన్నయాను. ఆ నీచుడు తన నటనతో నన్ను పూర్తిగా పిచ్చిదాన్ని చేశాడు. మైకంలో పడిపోయాను. అమ్మనీ, నాన్ననీ

# ప్రశ్న

కాదని మరీ పెళ్ళి చేసుకున్నాను. నేనెంత దగా పడిపోయేనో రెండేళ్ళు గడిచాక గాని తెలీలేదు. అదీ మీనాక్షి రెండేళ్ళ మగపిల్లాణ్ణి ఎత్తుకుని మా యింటి తలుపు తట్టి రామ్మూర్తిని నిలదీసి నప్పుడు నా కళ్ళు తెరుచుకున్నాయి. మా పెళ్ళికి రెండు నెలల ముందే అతను మీనాక్షిని రహస్యంగా గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు. ఆమెకి ముందూ వెనకా ఎవరూ లేరు. అనాథాశ్రమంలో పెరిగింది. గౌరవప్రదమైన జీవితం యిస్తున్నాడు గదాని ఆశపడి వీడి వలలో చిక్కుకుంది. ఆ రోజు గుమ్మంలో కొచ్చి న్యాయం అడుగుతున్న మీనాక్షిని నిర్దాక్షిణ్యంగా గెంటేశాడు రామ్మూర్తి. అప్పుడే మొట్టమొదటిసారిగా చూసేను అతనిలోని రాక్షసత్వాన్ని! భయంతో ఒణికిపోయేను! మీనాక్షి పట్ల జాలి కలిగినా నా సంసారం పట్ల నాకున్న స్వార్థం, రామ్మూర్తి అంటే కలిగిన భయం నన్ను ఏ సాహసమూ చెయ్యనివ్వలేదు. అప్పటికే అతను పేకాటకీ, ముండలకీ తన పేర వున్న ఆస్తంతా వెచ్చబెట్టేశాడు. ఉద్యోగం చేస్తున్న నా సంపాదనా, నా పేర వచ్చిన పొలం... మొత్తం కైంకర్యం చెయ్యాలన్న ప్రయత్నాలు ప్రారంభించేడు. నా బతుకు మీనాక్షి బతుకులా కాకూడదని జాగ్రత్తపడి, ఆఫీసర్లని బతిమాలి ఉదయపూర్‌లో కొత్తగా పెట్టిన కంపెనీకి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాను. అక్కడికి వెళ్ళే ముందు మీనాక్షిని వెతికి ఈ ఇంట్లో దింపేను. అక్కడున్నన్నేళ్ళూ ప్రతి నెలా ఆమెకి డబ్బు పంపుతూనే వున్నాను. ఇప్పుడూ అదే చేస్తున్నాను. తరవాత రామ్మూర్తి నన్ను చాలా రకాలుగా వేధించేవాడు. కాని నా మనస్సు రాయైపోయింది. చివరికి విడాకులకి పెట్టుకున్నాడు. అంగీకరించేను. ఆ విధంగా మా బంధం తెగిపోయింది కృష్ణా!'' అన్నది సుమిత్ర.

'ఏకాకిని, ఏకాకిని' అని ఆమె ఎందుకు పదే పదే చెప్పిందో అప్పుడర్థమైంది నాకు. ఎప్పుడూ హుషారుగా, సెలయేటి గలగల నవ్వులతో నలుగుర్నీ అలరిస్తూ, ఆకర్షిస్తూ తిరిగిన సుమిత్ర జీవితం ఇంత విషాదమయం కావడం నన్ను కదిలించేసింది. అప్రయత్నంగా ఆమె చేతిని నా చేతిలోకి తీసుకున్నాను.

"సుమిత్రా! యూ ఆర్ రియల్లీ గ్రేట్! నిజంగా నువ్వు దేవతవి. నీ జీవితం ఏమైపోయినా పట్టించుకోకుండా, మీనాక్షికీ, ఆమె బిడ్డకీ అండగా నిలిచిన నీ ఔదార్యానికి జోహార్లు సుమిత్రా! పదేళ్ల నాడు మన కాలేజీ జీవితంలో... భవిష్యత్తు ఎలా వుంటుందో తెలియక ముందే... నిన్ను ఆరాధించేను. ఎన్నెన్నో కలలు కన్నాను. నువ్వు దూరమై పోయినప్పుడు సర్వస్వం పోగొట్టుకున్న వాడిలా కుంగిపోయేను. కాని యిప్పుడు అనిపిస్తోంది సుమిత్రా! నీ వంటి మానవతా మూర్తిని ఆరాధించటంలో నేను పొరపాటు చెయ్యలేదని! నిన్ను దక్కించుకోలేని రామ్మూర్తి నిర్భాగ్యుడు. నీ హృదయంలో స్థానం సంపాదించుకున్న మీనాక్షీ, ఆమె బిడ్డా అదృష్టవంతులు!'' అన్నాను, ఆవేశంతో.

సుమిత్ర కళ్ళు తుడుచుకుని, "కృష్ణా! నిన్ను ఇంటి దగ్గిర డ్రాప్ చేస్తాను!'' అన్నది. తల వూపేను. కారు కదిలింది. మెరిసే కళ్ళతో నా వైపు చూస్తూ, "ఇన్నేళ్ళకైనా నీ నోట్లోంచి, నా హృదయాన్ని పులకరింపజేసే నిజం వినగలిగేను కృష్ణా!'' అన్నది.

"చెప్పే అవకాశం నువ్వు యివ్వాలేగాని ఎన్ని జన్మలెత్తినా ఆ మాట చెప్తూనే వుంటాను సుమిత్రా! నా కంత అదృష్టం కలుగుతుందా అన్నదే ప్రశ్న!'' అన్నాను వణికే గొంతుతో.

పది నిముషాల్లో నా అద్దె యింటి ముందు కారాగింది.

"నా యింట్లో కాలు పెట్టవా సుమిత్రా?'' అన్నాను.

"హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నావా?'' అడిగిందామె.

"హృదయం కోసి చూపించాలా?''

"ఇంత జరిగేక ఇంకా నా కక్కడ చోటుంటుందా?''

అక్కడ ఆవరించుకున్న శూన్యంలోంచి నీ పేరే ప్రతిధ్వనిస్తూ వుంటుంది. నువ్వే నిండి వుంటావు సుమిత్రా! నమ్మకం లేదా?''

సుమిత్ర స్టీరింగ్ ముందు నుంచి నాకు దగ్గరగా జరిగింది. ఒక్కసారిగా నా గుండెల మీద వాలింది. ఈ అపూర్వ అనుభూతి కోసం, ఈ పెన్నిధిని దక్కించుకోడం కోసం ఎంత కాలం నిరీక్షించేను? మానవుడికి భగవంతుడు పెట్టే పరీక్ష యిదేనా? ఈ పరీక్షలో నేను నెగ్గేనా? సుమిత్ర నెగ్గిందా? ఇది జవాబు లేని ప్రశ్నగా నాలో మిగిలిపోయింది.



# లెటర్ బాక్స్

ఎక్కడో చెట్టు నుండి నరకబడి
మరెక్కడో చెక్కముక్కలుగా కోయబడి
వడ్రంగి సీలం బాధను భరించి
రంగుల వాడి కెమికల్ రియాక్షన్‌కు తట్టుకొని
సుందరంగా నా యింటి వాకిటని అలంకరించింది
నా కోసం కొత్తగా ఇంటాయన తగిలించిన
లెటర్‌బాక్స్
అదంటే నాకెంత ప్రేమో అంత కోపమూను
పోష్టింగ్ ఆర్డరు తెచ్చినపుడు అదెంత
ముద్దొచ్చిందో
ఊష్టింగ్ ఆర్డరు తెస్తుందేమోనని దాని మీద
అప్పుడపుడు కోపం వస్తుంది.
ముఖం మీద ముక్కులా
దాని నెత్తి మీద వేలి పొడుగంత
పొడవు పాటి కానా
శివుడి ముఖం మీద సింగిల్ వీభూధి రేఖలా
అన్పిస్తుంది
బుజ్జిగాడతికించిన టూత్ పేస్ట్ ఫ్రీ
బాన బొజ్జ, తాటికాయ తల బొమ్మ
పెళ్ళికూతురి అలంకారంలా




కళకళలాడు తుంటుంది
ఎప్పుడూ వెయ్యని తాళం
ఒక చెవ్వికి పోగు ధరించినట్లు వేలాడుతుంది
ఆశతో తెరిచిన తలుపు
ఒక్కొక్కసారి నిరాశే మిగులుస్తుంది.
ఒక్కొక్కసారి ఉత్తరాలు
పెళ్ళికొడుకు తల మీద తలంబ్రాల్లా
జలజలా రాలి పడతాయి.
మనియార్డరు రసీదుల నుండి
తిరిగొచ్చిన రచనలు
స్వీకరించిన వాటి తాలూకు కార్డ్లు
కాంప్లిమెంటరీ కాపీలు
అభిమానుల ఉత్తరాలు
నాన్న చెప్పే కుటుంబ గొడవలు
అమ్మ రాసే ప్రేమతో నిండిన చివాట్లు
చెల్లాయి వ్రాసే చిన్నిచిన్ని కబుర్లు
నానిగాడి ముద్దు మాటలు
అన్ని వార్తలు అందించే
నా ఏకైక నేస్తం!

–జాగృతీ కిరణ్

సీరియల్

# వజ్రసంకల్పం

## శాతవాహన

31

(గత సంచిక తరువాయి)

ఆ హాల్లో నగ్నదేవత ఒంటరిగా ముగ్గులో కూర్చుని వుంది. ఆమె కళ్ళు మూసుకొని వున్నాయి. ధ్యానంలో మునిగిపోయి తనలో తనే ఏవేవో మంత్రాలు వల్లించుకుంటోంది. ఆమె ఎదురుగా హోమగుండం వెలుగుతోంది.

ఇంతలో వజ్రపాణి అక్కడికి పింకీతో సహా పరిగెత్తుకుంటూ వచ్చాడు. వాళ్ల వెనకే ప్రభు, జూడా, డేవిడ్, భైరాగి కూడా లోపలికొచ్చారు. వజ్రపాణి అనుచరులెవరికీ ఆ హాలు గురించి తెలియదు. వజ్రపాణి తెలియనివ్వలేదు. కానీ, ఇప్పుడు ఆదుర్దాలో వున్న వజ్రపాణి వాళ్ళు తన వెంట రావడాన్ని అంతగా పట్టించుకోలేదు.

"నగ్నదేవతా!" లోపలికొస్తూనే ఆందోళనగా అన్నాడు వజ్రపాణి. అప్పటికతనికి తనున్న పరిస్థితి చాలా బాగా అవగతమైపోయింది. వజ్రాల గనులు శతృవుల హస్తగతమైన మరుక్షణం తన నడుము విరిగిపోయిందని అర్థం చేసుకోవడానికి అతనికి చాలాసేపు పట్టింది.

"నగ్నదేవతా!" మరోసారి ఆందోళనగా పిలిచాడు వజ్రపాణి.

నగ్నదేవత నెమ్మదిగా కళ్ళు తెరిచింది.

వజ్రపాణి ఏదో అనబోయాడు.

నగ్నదేవత అతన్ని వారించింది.

"నాకు తెలుసు. నీ వజ్రాల గనుల్ని శతృవులు ఆక్రమించుకున్నారు. అంతేనా!" చాలా శాంతంగా అంది.

వజ్రపాణి మాట్లాడలేదు.

నగ్నదేవత మొహంలో ఎలాంటి మార్పులేదు.

"సూర్యుడు నీ జాతక చక్రం నుంచి నిష్క్రమించాడు. నీ జాతక చక్రాన్నంతా శని ఆక్రమించుకుని నిన్ను వక్ర దృష్టితో చూస్తున్నాడు. వజ్రపాణీ, నీ ఉజ్జ్వల దశ నేటితో అంతరించింది".

ఆ మాటలు వింటూనే వజ్రపాణి గుండె పగిలినట్టనిపించింది.

"అలా అనకు నగ్నదేవతా! నాకు మార్గం చెప్పు! నువ్వా మాట అన్నావంటే అది జరిగి తీరుతుందని నాకు తెలుసు. చెప్పు నగ్నదేవతా, ఈ పరిస్థితి నుంచి బయటపడే మార్గం చెప్పు", వేడుకున్నాడు వజ్రపాణి.

వజ్రపాణిలాంటి వాళ్ళు సాగినన్నాళ్ళు తమని మించినవాడు లేడని విర్రవీగుతారు. తమ కథ అంతమవబోతోందని తెలిసినప్పుడు తట్టుకోలేక తమను కాపాడమని సాధువులూ సన్యాసుల కాళ్ళు, చేతులు పట్టుకుంటారు. వజ్రపాణి ప్రస్తుతం అదే చేస్తున్నాడు.

"చెప్పు నగ్నదేవతా, నాకు మార్గం చెప్పు!" మరోసారి వేడుకున్నాడు వజ్రపాణి.

నగ్నదేవత అతని కళ్ళలోకి స్థిరంగా చూసింది.

"నీకిప్పుడు ఒకే ఒక్క మార్గం వుంది- సూర్యనేత్రం! సూర్యనేత్రం నీ దగ్గరున్నంతసేపూ ఎవరూ నిన్నేమీ చేయలేరు. ఇలా రా! ఇలా వచ్చి కూర్చో", అంది.

వజ్రపాణి చప్పున ఆమె పక్కనే కూర్చున్నాడు.

పింకీ కూడా అప్రయత్నంగా అతని పక్కనే కూర్చుంది. సూర్యనేత్రం పేరు వింటూనే ఆమె గుండె చిత్రంగా స్పందించనారంభించింది.

నగ్నదేవత తన పక్కనే వుంచుకున్న వుంగరం ఒకటి చేతిలోకి తీసుకుంది. ధగధగా మెరిసిపోతోందా వుంగరం. వజ్రపాణి ఆ వుంగరాన్ని కొద్ది క్షణాలు కళ్ళప్పగించి చూశాడు.

"ఇలాంటి క్షణం వస్తుందనే ఈ వుంగరాన్ని నీ కోసమే దాచి వుంచాను. ఈ వుంగరాన్ని నీ వేలికి తొడుక్కో. నవరత్నాలు పొదిగిన వుంగరం ఇది. దీని మహిమ అపారం. నవరత్నాలకూ నవగ్రహాలకూ దగ్గర సంబంధం వుంది. నవరత్నాలు పొదిగిన వుంగరాన్ని ధరించడం వల్ల నవగ్రహాలూ నీ పట్ల ప్రసన్నంగా వుంటాయి. ఇందులోని కెంపు సూర్యగ్రహానికీ, ముత్యం చంద్రగ్రహానికీ, పగడం కుజగ్రహానికీ, పచ్చ బుధగ్రహానికీ, పుష్యరాగం గురుగ్రహానికీ, వజ్రం శుక్రగ్రహానికీ, నీలం శనిగ్రహానికీ, గోమేధికం రాహుగ్రహానికీ, వైఢూర్యం కేతుగ్రహానికీ ప్రతినిధులు. ఈ వుంగరం ధరించడం వల్ల ఈ గ్రహాలన్నీ నీకు మేలు చేస్తాయి. తీసుకో," అంది నగ్నదేవత.

వజ్రపాణి ఆ వుంగరాన్నందుకుని భక్తిగా కళ్ళ కద్దుకుని వేలికి పెట్టుకున్నాడు.

నగ్నదేవత వెంటనే తన చేతిలో వున్న మంత్రదండాన్ని ఎదురుగా వున్న హోమగుండం చుట్టూ తిప్పుతూ బిగ్గరగా మంత్రాలు చదవసాగింది.

పింకీ తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

హోమగుండంలోంచి నెమ్మదిగా ఒక కలశం పైకి లేవనారంభించింది. ఆ కలశంలో వున్న వస్తువును చూస్తూనే ఆమె కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. దాన్లోంచి వెలువడుతున్న కాంతి ముందు హోమగుండంలోంచి ఫెళఫెళార్భాటాలతో పైకి లేస్తున్న అగ్నిజ్వాలలు వెలవెల బోతున్నట్టుగా అనిపించింది.

పింకీ హఠాత్తుగా వూపిరి బిగబట్టింది.

సూర్యనేత్రం!

సూర్యనేత్రం!!

సూర్యనేత్రం!!!

అవును, సందేహంలేదు– ఇదే సూర్యనేత్రం!

ఆమె కళ్ళప్పగించి విస్మయంగా ఆ మహా వజ్రం కేసి చూస్తూ వుండిపోయింది. ముందుగా ఆ మహావజ్రం గురించి ఆమెకు తెలిసి వుండకపోతే అంత పెద్ద వజ్రం వుంటుందని ఆమె కల్లో కూడా వూహించి వుండేది కాదు.

హోమగుండం నుంచి సూర్యనేత్రం పైకి వస్తూనే నగ్నదేవత మరింత బిగ్గరగా మంత్రాలు చదువుతూ పూలతో ఆ వజ్రాన్ని అభిషేకించింది.

ఇంతవరకూ సాగిన కథ– 38: విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో దొరికిన వజ్రసంపదను అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. వజ్రపాణి హవేలీ నుంచి పింకీని శక్తిధర్ అపహరించుకుపోతాడు. శక్తిధర్, విశ్వధర వర్మలకి తానొక సి.ఐ.డి. ఆఫీసరునని తెలియజేస్తుంది పింకీ. వజ్రపాణిని దెబ్బతీసేందుకు ముగ్గురు కలిసి పథకం వేస్తారు. రెండుగూడేల ప్రజల్ని కలిపిన పులిరాజు వారి సహాయంతో వజ్రపాణి వజ్రాల గనులపై దాడిచేస్తాడు. ఈ విషయం తెలిసిన వజ్రపాణి సూర్యనేత్రాన్ని కాపాడుకొనేందుకు వెళ్తాడు.

ఆ మరుక్షణం మరొక అద్భుతం జరిగింది.

ఆ వజ్రాన్ని సోకుతూనే పూలరేకులు ఒక్కసారిగా మాడిపోయి క్రమంగా మంటలో మండిపోనారంభించాయి. కొద్ది క్షణాల్లోనే ఆ వజ్రాన్ని అభిషేకించిన పూలన్నీ భస్మమైపోయాయి. పింకీకి తను చూస్తున్నది కలో నిజమో అర్థం కావడం లేదు.

నగ్నదేవత నెమ్మదిగా ఆ కలశంలోంచి సూర్యనేత్రాన్ని బయటికి తీసి వజ్రపాణి కేసి చూచింది.

"దీన్నందుకో. ఈ మహావజ్రం ఎప్పుడూ బలి కోరుతూ వుంటుంది. దీనికి కావలసిన బలులిచ్చి ఎప్పటికప్పుడు సంతృప్తి పరుస్తూ వచ్చావు. ఇది ఇప్పుడు నిన్ను కాపాడుతుంది."

వజ్రపాణి దోసిట్లో ఆ వజ్రాన్ని భక్తిగా అందుకున్నాడు.

నగ్నదేవత మళ్ళీ చెప్పసాగింది–

"నవరత్నాల్లో గొప్పది వజ్రం. వజ్రాలో కెల్లా గొప్పది సూర్యనేత్రం. దీని శక్తి అపారం. ఇది నిన్ను తప్పకుండా కాపాడుతుంది."

వజ్రపాణి కళ్ళు వెర్రి ఆనందంతో విచ్చుకున్నాయి.

"సూర్యనేత్రం...! సూర్యనేత్రం...! సూర్యనేత్రం...! సూర్యనేత్రం నా దగ్గరుండగా ఎవరూ నన్నేమీ చేయలేరు. ఎవరూ ఏమీ చేయలేరు", అంటూ ఆ వజ్రాన్ని నెత్తిమీద పెట్టుకుని పిచ్చివాడిలా నాట్యం చేయసాగాడు.

పింకీకి ఒక్క క్షణం అతను నిజంగానే పిచ్చివాడిగా మారిపోయాడేమోనన్న సందేహం పీడించింది.





# ముఖేష్‌కు రేఖ గుడ్‌బై?

చిత్ర పరిశ్రమలో పెళ్ళిళ్ళు, విడాకులు మామూలే. ఇప్పుడు ఆ కోవలోనే వుందట రేఖ. రాత్రికి రాత్రి ఢిల్లీ పారిశ్రామిక వేత్త ముఖేష్ అగర్వాల్‌ను పెండ్లి చేసుకొని అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేసిన రేఖ యిప్పుడు విడిపోయేందుకు పథకాలు వేస్తున్నదని, ఏదో ఒక రోజున ముఖేష్‌కు గుడ్‌బై కొడుతుందని అనేక మంది అనుకుంటున్నారు. మరి వాళ్ళ మాటే నిజం చేస్తుందో? వాళ్ల నోరు మూయిస్తుందో వేచిచూద్దాం.

పోగతా వాళ్ళు కూడా అతని ఉన్మాద నృత్యాన్ని ఆశ్చర్యంతో కళ్ళప్పగించి చూడసాగారు

"వజ్రపాణీ!"... అకస్మాత్తుగా మేరు గంభీరమైన కంఠస్వరం వినిపించడంతో వజ్రపాణి తన వికార నాట్యం వున్నట్టుండి ఆపేశాడు.

ఆ కంఠస్వరం వింటూనే కళ్ళు చించుకుని తన చుట్టూ విస్మయంగా చూశాడు. ఎవరూ కనిపించలేదు.

అదే కంఠస్వరం.

అవును, అదే కంఠస్వరం.

ఎన్ని సంవత్సరాల తర్వాత మళ్ళీ వింటున్నాడా స్వరం!

కానీ...., కానీ .., ఇదెలా సాధ్యం?

అతను మరోసారి తన చుట్టూ చూశాడు.

ఈసారి కూడా ఎవరూ కనిపించలేదు.

ఏమిటిది?

తను భ్రమపడ్డాడా!

అవును, భ్రమే అయివుండాలి!

"వజ్రపాణీ!" మరోసారి వినిపించిందా కంఠస్వరం.

భ్రమకాదు. నిజం. నిజంగా నిజం!

"ఎవరు..? ఎవరు...? ఎవరది...? కంటికి కనిపించకుండా చాటున దాక్కున్నారేం? ముందుకు రండి", అరిచాడు.

మరుక్షణం బిగ్గరగా నవ్వు వినిపించింది.

"ఎటో చూస్తావేం వజ్రపాణీ? ఇటు చూడు!"

వజ్రపాణి ఆ వైపు చూశాడు.

చూస్తూనే అదిరిపడ్డాడు.

"నన్ను గుర్తు పట్టావా వజ్రపాణీ?" అన్నాడా వ్యక్తి.

"విశ్వధరవర్మ!" విస్మయంతో అన్నాడు వజ్రపాణి.

"అవును, బాగా గుర్తు పట్టావు వజ్రపాణీ! విశ్వధరవర్మనే!"

"నువ్వు... నువ్వింకా బ్రతికే వున్నావా?"

"ఏం, ఆశ్చర్యంగా వుందా? సంవత్సరాల క్రితం ఒకసారి నువ్వు నన్నిదే ప్రశ్న అడిగావు. అలాగే సంవత్సరాల క్రితం ఒకసారి ఆ వజ్రాన్ని నెత్తిన పెట్టుకుని ఇదే విధంగా వెర్రివాడిలా ఉన్మాద నృత్యం చేశావు. ఆనాడూ ఒకరి సర్వనాశనం జరిగింది. ఈనాడూ ఒకరి సర్వనాశనం జరుగుతోంది. కాకపోతే ఆ ఒకరూ ఈ ఒకరూ ఒక్కరు కారు. నాటకంలో పాత్రలు మారిపోయాయి వజ్రపాణీ ఆనాడు నా వంతు! ఈనాడు.... నీ వంతు!"

వజ్రపాణి ఒక్క పెట్టున బిగ్గరగా నవ్వాడు.

"ఇంకా ఆ కల కంటూనే వున్నావా విశ్వధరవర్మా!" వ్యంగ్యంగా అన్నాడు.

"కాదు ఇది కల కాదు వజ్రపాణీ! వాస్తవం, పచ్చి వాస్తవం! ఒకనాడు నా ప్రాణాలు నీ గుప్పిట్లో పెట్టుకున్నావు. ఈనాడు నీ ప్రాణాలు నా గుప్పిట్లో వున్నాయి. నమ్మశక్యం కావడం లేదు కదూ!" అంటూ విశ్వధరవర్మ గట్టిగా చప్పట్లు చరిచి, "శక్తీ!" అని బిగ్గరగా కేక పెట్టాడు అయన కేకతో హాలు దద్దరిల్లిపోయింది

ఆ మరుక్షణం ఆ హాల్లో మెరుపు మెరిసినట్లైంది. నెమ్మదిగా ఒక్కొక్క అడుగే వేసుకుంటూ ఆ హాల్లో డుగు పెట్టాడు శక్తిధర్. అతన్ని చూస్తూనే జ్రపాణి అదిరిపడ్డాడు.

"పు...లి....రా...జా...!" అతని నోటి వెంట ప్రయత్నంగా వెలువడిందా మాట.

విశ్వధరవర్మ మరోసారి బిగ్గరగా నవ్వాడు.

"కాదు వజ్రపాణీ! పులిరాజు కాదు. నా రక్తం. నా ంతానం. నా మనవడు శక్తిధరవర్మ!"

వజ్రపాణి తలమీద పిడుగు పడ్డట్లైంది.

"అంటే.... అంటే....!"

"ఇంకా అర్థం కాలేదా వజ్రపాణీ! నా సంతానం చేతుల్లోనే నీ సర్వనాశనం జరగబోతోంది. జరగబోతోంది కాదు- జరిగిపోయింది. నీ వజ్రాల గనులన్నీ ఇప్పుడు నా హస్తగతమై పోయాయి వజ్రపాణీ! నా మనవడు అది సాధించాడు."

ఈసారి వజ్రపాణి బిగ్గరగా నవ్వాడు

"వజ్రాల గనులు నీ హస్తగతమై పోతేనేం విశ్వధరవర్మా! ఈ దేశాన్నంతా కొనగల మహాసంపద నా దగ్గరుంది. దాంతో ఈ దేశాన్ని కూల్చి నేనే నియంతనై పోతాను. నువ్వూ, నీ మనవడూ నన్నేమీ చెయ్యలేరు".

విశ్వధరవర్మ వెక్కిరింపుగా నవ్వాడు.

"అది నీ భ్రమ వజ్రపాణీ! ఈ దేశానికి నువ్వు నియంతవి కావడం కల్ల. ఆ విషయంలో నీకు సాయం చేస్తానన్న ఈ అమ్మాయి ఎవరనుకున్నావు? నువ్వూహించినట్లు ఈమె యువరాణి జ్యోతిర్మయీదేవి కాదు. సి. బి. ఐ. ఆఫీసర్ జ్యోతిర్మయి. ముద్దుపేరు పింకీ!"

వజ్రపాణి చప్పున ఒకడుగు వెనక్కి వేసి పింకీ వైపు ఆశ్చర్యంగా చూశాడు. అతని వెర్రి చూపులు చూస్తూనే పింకీ ఒక్కసారిగా పగలబడి నవ్వనారంభించింది.

"ఎందుకలా చూస్తావు వజ్రపాణీ? ఆయన చెప్పింది అక్షరాలా నిజం. ఇంకో రహస్యం చెప్పమంటావా? నేనో పెద్ద కేడీనని నమ్మి నువ్వెంతగానో విశ్వసించే ఈ జూడా డేవిడ్ ఇద్దరూ నాతో లాలూచీపడి సూర్యనేత్రం కోసం నన్నిక్కడికి తీసుకొచ్చి యువరాణి జ్యోతిర్మయీ దేవిగా నన్ను నీకు పరిచయం చేశారు" అంది.

"నో!" అరిచాడు వజ్రపాణి.

"ఎందుకలా అరుస్తావు వజ్రపాణీ! మరొక నిజం చెబితే నీ గుండె పగిలి పోతుంది. ఇన్నాళ్ళూ నువ్వు దేవతగా పూజిస్తున్న ఈ నగ్నదేవత మైలమ్మ ఎప్పుడో నాతో చేతులు కలిపింది. ఆమె పక్కనే నిలబడిన ఆ భైరాగి ఎవరో కాదు- మైలమ్మకు స్వయానా కన్న కొడుకు."

ఈసారి వజ్రపాణి నోటి వెంట అరుపు కూడా పెగల్లేదు. తల తిప్పి నగ్నదేవత కేసి వెర్రివాడిలా చూశాడు.

నగ్నదేవత ఒక్కసారిగా తల పైకెగ రేసింది. ఆమె మొహం ఇప్పటికీ ప్రశాంతంగానే వుంది. విశ్వధరవర్మ చెబుతున్నది నిజమేనని ఆమె ముఖకవళికలే చెబుతున్నాయి.

ఊహించని ఈ పరిణామానికి పింకీ శక్తిధర్ లిద్దరూ కూడా ఆశ్చర్య పోయారు.

"బాబా!" నమ్మశక్యం కానట్టుగా చూశాడు శక్తిధర్.

విశ్వధర వర్మ తలూపేడు.

"అవును శక్తీ! ఈ నగ్నదేవత మైలమ్మ భర్త ఒకప్పుడు వజ్రపాణి దగ్గరే పని చేసేవాడు. ఒక అమూల్య వజ్రంతో తప్పించుకు పారిపోవాలని చూసినప్పుడు వజ్రపాణి అతన్ని చిత్రవధ చేసి చంపేశాడు. మైలమ్మ అడ్డుపడింది. వజ్రపాణి ఆమెని నిర్దాక్షిణ్యంగా చెరిచి అన్నపానీయాలు లేకుండా ఒక చీకటి కొట్లో పడేశాడు. తన భర్తని వజ్రపాణి చంపినప్పుడు అతని అంతం కళ్ళ జూస్తానని మైలమ్మ నాలాగే శపథం చేసింది. ఆ శపథం నెరవేర్చు కోవడానికి ఆమెకు ప్రాణాల్తో వుండడం అవసర మైంది. అందుకే ఆ చీకటి కొట్లో తిరుగుతున్న బొద్దింకల్నీ సాలీళ్ళనీ తిని కొన్నాళ్ళు




ప్రాణాలు నిలుపుకుంది. చీకటి కొట్లో ఆమె గడిపిన ఆ కొద్ది రోజులూ ఆమెను మరీ పిచ్చిదానిలా చేసేశాయి. వజ్రపాణి మీద పగ క్షణక్షణానికీ వృద్ధితమైంది. చివరికి ఆ చీకటి కొట్లోంచి ఎలాగో బయటపడి ఎవరికీ కనపడకుండా అదృశ్యమై పోయింది. ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు హఠాత్తుగా నగ్నదేవత రూపంతో మణిపురంలో అవతరించింది. ఆమె నెవరూ గుర్తించలేక పోయారు. ఆమె స్వరూపంలో భయంకరమైన మార్పులు సంభవించాయి. తనొక దేవతగా వజ్రపాణిని నమ్మించి అతని హవేలీలో ఆశ్రయం సంపాయించింది. తన కొడుకు భైరాగిని వజ్రపాణికి కుడిభుజంగా చేసింది. వజ్రపాణి మీద పగ సాధించడం అంత సులభం కాదని ఆమెకు తెలుసు. అందుకే అ[illegible] రోజుదాకా ఎదురు చూసింది. [illegible] నమ్మిస్తూనే వుంది. [illegible]వడానికి నేను చాలా కాలంగా ప్రయత్నించి చివరికి తెలుసుకో గలిగాను. ఆ తర్వాత ఆమెను కలుసుకుని ఆమె గురించి నాకు తెలిసిన నిజాలన్నీ చెప్పేశాను. నాతో సహకరించడానికి అంగీకరించింది" అంటూ విశ్వధరవర్మ వజ్రపాణి కేసి చూశాడు. "జగన్నాథరావు గుర్తున్నాడా వజ్రపాణీ! అతనే నగ్నదేవత భర్త! ఇప్పటికైనా తెలుసు కున్నావా? ఈ క్షణంలో నువ్వు పూర్తిగా శత్రువుల మధ్య నిలబడి వున్నావు" అన్నాడు.

వజ్రపాణి నోటి వెంట మాట పెగల్లేదు.

అతని కాళ్ళు నేలలో కూరుకు పోతున్నట్టుగా వున్నాయి.

విశ్వధరవర్మ అతని కేసి గంభీరంగా చూశాడు.

"అప్పుడే ఏమైంది వజ్రపాణీ! ఈసారి నేను చెప్పబోయే నిజం వింటే నిజంగా నీ గుండె పగిలి పోతుంది. చెప్ప మంటావా?" అన్నాడు వూరిస్తున్నట్టు.

"ఇంతకంటే ఏం చెబుతావు విశ్వధర వర్మా! ఏం చెప్పగలవు?" అతని గొంతు హీనంగా ధ్వనించింది.

"ఆ మాత్రానికే అంత నీరసపడిపోతే ఇక అసలు విషయం తెలుసుకున్నప్పుడు నిశ్చయంగా నీ గుండె పగిలి పోతోంది. ఈ సంగతి విని తట్టుకోగలిగితే తట్టుకో వజ్రపాణీ!"

వజ్రపాణి ఆయన కేసి ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"నువ్వింకా నీ దగ్గరే వుందనుకుంటున్న సంపద నీ దగ్గర లేదు వజ్రపాణీ! అదెప్పుడో నా హస్తగతమై పోయింది. ఇప్పుడు నీ భాండాగారంలో వున్న వజ్రాలేవీ అసలు వజ్రాలు కావు. అన్నీ కృత్రిమ వజ్రాలు. క్యూబిక్ జిర్కోనియా!"

"వాట్!!!" గొంతు చించుకుంటూ అరిచాడు వజ్రపాణి.

"అవును వజ్రపాణీ! ఇది అక్షరాలా నిజం. నగ్నదేవత సాయంతో నేను ఈ హవేలీలో వున్న అసలు సిసలు వజ్రాలన్నీ ఎప్పుడో నా స్థావరానికి తరలించాను. ఇప్పుడు నీ దగ్గరున్నవి మా శక్తిధరవర్మ సృష్టించిన క్యూబిక్ జిర్కోనియా! కేవలం కృత్రిమ వజ్రాలు!" అన్నాడు విశ్వధర వర్మ.

"అబద్ధం!" అరిచాడు వజ్రపాణి. "నువ్వు... నువ్వు అబద్ధం చెబుతున్నావు విశ్వధర వర్మా! నా హవేలీ లోంచి వజ్రాలు ఎవరూ తరలించ లేరు."

"అది నీ వెర్రి! నువ్వు సాధ్యం కాదనుకున్న విషయాన్ని నేను నగ్నదేవత సాయంతో ఎప్పుడో సుసాధ్యం చేశాను."

వజ్రపాణికి తల గిర్రున తిరిగి పోతోంది.

"ఎవరక్కడ?" బిగ్గరగా చప్పట్లు చరుస్తూ వెర్రిగా అరిచాడు.

"ఎంత వెర్రివాడివి వజ్రపాణీ! నీ పిలుపు విని మనుషులు వస్తారనే అనుకున్నావా? వజ్రకాయుడై నా మనవడు ఎప్పుడో వాళ్ళకు సమాధానం చెప్పాడు. ప్రస్తుతం నీ అనుచరు లందరూ మా బందీలు. చుట్టూ ఉచ్చు బలంగా బిగుసుకు పోయిం[illegible] వజ్రపాణీ! అటు చూడు" అన్నాడు విశ్వధరవర్మ.

(ఇంకా వుంది)

# బుల్లి తెరకు మరో కృష్ణుడు!

కృష్ణుడంటే టి. వి. కృష్ణుడు నితేష్ భరద్వాజ్ తక్కున గుర్తుకు వస్తాడు ఎవరికైనా. ఎందుకంటే 'మహాభారత్' అందరూ చూశారు. ఇప్పుడు మరో కృష్ణుడు బుల్లితెరపై కెక్కుతున్నాడు. ఆ మరో కృష్ణుడు ఎవరో కాదు 'ఆదిశంకరాచార్య' చిత్రంలో నటించిన సర్వదమన్ బెనర్జీయే!

టి. వి. రామాయణ్ నిర్మాత రామానంద్ సాగర్ నిర్మిస్తున్న మరో సీరియల్ 'కృష్ణ'లో బెనర్జీకి టైటిల్ పాత్ర లభించింది.

"ఈ పాత్రకు నేనంటే నేను బాగా నటిస్తానని" 400 మంది అభ్యర్థులు ముందుకొచ్చారట. కాని వారందరినీ కాదని ఆ పాత్ర బెనర్జీని వరించింది.

ఈ విషయం తెలిసి నితేష్ బాధ పడ్డాడు. అతను బాధ పడటం సహజమేమో కాని 'రామాయణ్' రాముడు అరుణ్ గోవిల్ కూడా బాధ పడ్డాడట. ఎంత 'రామాయణ్'లో నటిస్తే మాత్రం తర్వాత సీరియల్‌లో కూడా తననే ఎన్నుకోవాలని గోవిల్ అనుకోడం బాగుందా?

ఇదంతా అటుంచి రామానంద్‌సాగర్ నిర్మిస్తున్న మరో పురాణ గాథ 'కృష్ణ' సీరియల్‌కు సంబంధించిన కొన్ని విశేషాలను తెలుసుకుందాం.

గత ఏడాది 'రామాయణ్' సీరియల్ పూర్తి అయిన రోజునే రామానంద్‌సాగర్ 'కృష్ణ' సీరియల్ ప్రారంభించటం, ఆ రోజున భారీ యెత్తున ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేయటం జరిగిపోయాయి. అప్పుడు భోజ్‌పురి చిత్ర హీరో ఉల్హాస్‌ను కృష్ణ పాత్రకు ఎన్నుకున్నారు. కాని ఈ సరియలను ఏవిధంగా నిర్మించాలన్న పథకాలతోటే గత ఏడాది అంతా గడిచిపోయింది. టి. వి. సీరియల్‌గా తీద్దామని ప్రారంభించిన ఈ సీరియల్ చివరికి వీడియో సీరియల్‌గా రూపుదాల్చింది. దానితో దీని షూటింగ్ ప్రారంభించేందుకు క్రొత్త కృష్ణుడి కోసం అన్వేషణ ప్రారంభమైంది.

## 400 మంది 'కృష్ణు'లు

400 మంది అభ్యర్థులు 'కృష్ణ' పాత్ర పోషణకు దరఖాస్తులు పెట్టుకున్నారు. నాటకాల్లో బాగా పేరుబడిన శ్రీధర్‌ను కృష్ణుడి పాత్రకు తొలుత ఎన్నుకున్నారట. అతని నవ్వు కాస్టింగ్ డైరెక్టర్‌ను ఆకట్టుకుందట. అందుకే శ్రీధర్ ఎంపిక జరిగింది. ఇతని టెక్స్ చూసి రామానంద్ సాగర్ థ్రిల్లింగ్ పొంది శ్రీధర్‌ను అభినందించాడట కూడా. ఆ తర్వాత ఉమర్‌గావ్‌లో షూటింగ్ ప్రారంభానికి సిద్ధంగా వుండాలని శ్రీధర్‌కు చెప్పారట. కబురు కోసం ఎంతో ఆశతో ఎదురు చూస్తున్న శ్రీధర్‌కు పిడుగులాంటి వార్త కంట బడిందట. ఆ వార్త ఏమంటే... సర్వదమన్ బెనర్జీని తన బదులు ఎంపిక చేసుకున్నట్లు చదివి ఖంగుతిన్నాడు. ఈ విధంగా నన్ను మోసం చేయటానికి నేనేం తప్పు చేశాను. నా భవిష్యత్తును నాశనం చెయ్యాలని, ఎందు కనుకున్నారో సాగర్ కుటుంబం అని వాపోయిన శ్రీధర్, ఏది ఏమైనా యిది నా దురదృష్టం అని అన్నాడు. ఇంతటితో శ్రీధర్ కథ ముగిసి పోయింది.

ఇక నితేష్ భరద్వాజ్ కృష్ణుడి ఎంపిక గురించి మాట్లాడుతూ, ఎందుకూ పనికిరాని ఎస్. డి. బెనర్జీని సాగర్ ఎందుకు ఎంపిక చేసుకున్నాడో అర్థం కావటం లేదు అని వ్యాఖ్యానించాడు తనకా అవకాశం రాలేదని చింతిస్తూ.

సాగర్ నిర్మించిన 'రామాయణ్'లో నటించాను గనుక 'కృష్ణ'లో కూడా నన్నే బుక్ చేసుకుంటారనుకున్నాను కాని ఆ అవకాశం నాకు దక్కలేదు... ప్చ్... అని మిన్నకున్నాడు అరుణ్‌గోవిల్.

వీళ్ళందరి వ్యాఖ్యలు పట్టించుకోకుండా సాగర్ జూన్ 7వ తేదీన 'కృష్ణ' సీరియల్‌ను రహస్యంగా ప్రారంభించి అందర్నీ ఆశ్చర్యపరిచారు. ఈ సీరియల్ ఉమర్‌గావ్‌లో ప్రారంభమవుతుంది సిద్ధంగా వుండమని కొంతమంది జర్నలిస్టులకే కబురు వెళ్ళిందట. మరి అంత హడావుడిగా ఎందుకు ఈ సీరియల్ మొదలు పెట్టాల్సి వచ్చిందో?

కృష్ణుడు సింహాసనం మీద కూర్చొని తిలకిస్తుండగా ఆయన కెదురుగా సరస్వతి వీణ మీటుతుంటుంది. కొంతమంది నాట్యకత్తెలు నాట్యం చేస్తున్న దృశ్యాన్ని ముహూర్తపు షాటుగా చిత్రీకరించారు.

గుజరాత్ ముఖ్యమంత్రి చిమన్





ఖాయ్ పటేల్ క్లాప్ కొట్టగా ఈ దృశ్య చిత్రీకరణతో సీరియల్ నిర్మాణం ప్రారంభమైంది.

సంస్కృతంలో తాను నటించిన తొలి చిత్రం 'ఆదిశంకరాచార్య' అని, ఆ తర్వాత తాను తెలుగు చిత్రాల్లో నటిస్తున్నానని, మరికొన్ని ఎక్కువ చిత్రాల్లో నటించాలనుకుంటున్నానని బెనర్జీ తెలియజేశాడు. ఇవేగాక అనేక హిందీ చిత్రాలకు కూడా సంతకాలు చేశాడట.

వేడుక కోసం తాను ఈ కృష్ణ పాత్రను ఒప్పుకున్నానన్నాడు దమన్. "ఏ కోణం నుంచైనా నేను కృష్ణుడిగా నప్పుతున్నానంటారా?" అని ప్రశ్నిస్తున్నాడు బెనర్జీ. ఈ పాత్ర ఒప్పుకోక ముందే ఆ ప్రశ్న అడిగితే బాగుండేదేమో?

అతణ్ణి కృష్ణుడి పాత్రలో చూసిన సాగర్ బృందం ఆదమనిషిలా వున్నావని బెనర్జీని మేళామాడారు.

"బ్లూ ఫిలింస్"లో నటించకూడదని సాగర్ ముందే షరతు పెట్టాడు?! కారణం బ్లూ ఫిలింస్‌లో నటించే మరో ఎస్. డి. బెనర్జీ అనే నటుడు వున్నాడట. అతన్ని అద్దు పెట్టుకొని ఈ బెనర్జీ కూడా వాటిల్లో నటిస్తాడనుకున్నాడు కాబోలు శ్రీ సాగర్ ఆ షరతు విధించాడు.

రెండున్నర సంవత్సరాల పాటు షూటింగ్ జరిగే ఈ దిక్కుమాలిన గ్రామం ఉమర్‌గాంవ్‌కు ప్రతినెల 15 రోజుల పాటు షూటింగ్‌కు హాజరవు తుంటానని, మిగిలిన 15 రోజులు యితర చిత్రాల షూటింగ్‌లకు వెళ్తుంటానని చెప్పాడు బెనర్జీ.

బాసు భట్టాచార్య నిర్మించే "స్వామి వివేకానంద"లోను, బర్వేలుని నిర్మించే "బుద్ధ"లోను నటిస్తున్న బెనర్జీ రామానంద్‌సాగర్ 'కృష్ణ'లో తన పాత్రకు ఏ మేరకు న్యాయం చేకూర్చగలడో వేచి చూడాల్సిందే. అంతేగాదు, సాగర్ యూనిట్ వాళ్ళ చేతే ఆదమనిషని కామెంట్ చేయించుకున్న ఈ నటుడు హావభావాలు మరి కెమెరాలోకి ఏ విధంగా ఎక్కుతాయో, అది చూసి ప్రేక్షకులు ఏ విధంగా ఆనందానుభూతిని పొందుతారో వెటజ్ వెయిట్ అండ్ సీ!! మరి సీరియల్ ప్రేక్షకుల సహనానికి ఎటువంటి పరీక్ష పెడుతుందో?!

—తిలక్

## రంగస్థలం చిన్నబోయింది

## సి. రామమోహనరావు మరిలేరు

ప్రముఖ రంగస్థల, రేడియో కళాకారులు రేడియో ప్రయోక్త శ్రీ సి. రామమోహనరావు తమ 65 వ యేట యిటీవల కన్నుమూసారు. బాల్యం నుంచే కళారంగంలోకి ప్రవేశించిన శ్రీ రామమోహనరావు 1961 లో ఆకాశవాణి విజయవాడ కేంద్రం నటనా విభాగంలో చేరి అనేక నాటకాలను రచించటమే కాకుండా నటించారు కూడా. ఆనందభైరవి, సీతారామ కళ్యాణం, ధర్మపత్ని వంటి చిత్రాల్లో నటించారు. ఆకాశవాణి నుంచి రెండు సార్లు జాతీయ అవార్డులను కూడా అందుకున్న శ్రీ రామమోహనరావు శ్రీ నండూరి సుబ్బారావుతో కలిసి చెప్పిన 'బావగారి కబుర్లు' రేడియో శ్రోతలను ఎంతో ఆకట్టుకొనేవి. ఢిల్లీ అంతర్జాతీయ థియేటర్ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన శ్రీ రావు అనేకమంది ఔత్సాహికులకు శిక్షణ నిచ్చారు. ఆయన ఉచ్చారణా దోషాలు క్షమించేవారు కాదు. 65 ఏండ్లకే మృత్యు వాతపడ్డ యీ కళాకారుని కోల్పోయిన దృశ్య, శ్రవ్య ప్రక్రియలు రెండూ చాలా కాలం దాకా అతను లేని లోటును భర్తీ చేసుకోలేవు.



# న్యాయచట్టం ప్రశ్నలు-జవాబులు



అడ్వొకేట్: బి.భాస్కరరావు ఎం.ఎ., ఎల్.ఎల్.బి.

**ఎన్. వెంకటేశ్వర్లు, రంగంపేట. (తూర్పు గోదావరి జిల్లా)**

ప్రశ్న: నేను రంగంపేట జిల్లా ప్రజా పరిషత్ ఉన్నత పాఠశాలలో 9-5-84 నుండి నేటివరకు రోజువారి జీతంపై వాచ్‌మేన్‌గా పని చేస్తున్నాను. జిల్లా అభివృద్ధి అధికారి ఆర్డర్ ద్వారా నన్ను నియమించి యున్నారు. నా ఆర్డర్ ప్రకారం మా జిల్లా ప్రజా పరిషత్‌లో 50 మందిని నియమించి యున్నారు. మా అందరి సర్వీసు కూడా 5 సంవత్సరములు నిండి యున్నవి. ఇంత వరకు మా సర్వీసులో బ్రేక్ లేదు. కాని 1-4-90 నుండి 2 రోజులు జీతం తగ్గించి వేస్తున్నారు. 14-3-90 తేదీ గల 193 జి. ఓ. ప్రకారం షోకాజ్ నోటీసు ఇచ్చియున్నారు. 15 రోజులలో మిమ్మల్ని ఎందుకు ఉద్యోగం నుంచి తొలగించ కూడదో తెలుపమని షోకాజ్ నోటీసు ఇచ్చి యున్నారు. మా 50 మందిని డి. డి. ఓ. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి ద్వారా కాక డైరెక్ట్‌గా నియమించి యున్నారు. మేము ఏమి చేయవలెనో తెలుప వలసినదిగా కోరుచున్నాను.

జవాబు: మీరు షోకాజ్ నోటీసు కాపీ పంపలేదు. అయినా మీరు ఏమీ నేరము చెయ్యకుండా మీకు షోకాజ్ నోటీసు ఇవ్వడం అన్యాయమే కాకుండా రాజ్యాంగ విరుద్ధము కూడా 5 సంవత్సరములు దాటి బ్రేక్ లేకుండా ఉద్యోగం చేస్తున్న మిమ్ములను ఉద్యోగం నుంచి తొలగించడం అన్యాయం అవుతుంది. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి నుంచి గాక డి. డి. ఓ మీకు డైరెక్ట్‌గా ఉద్యోగం ఇచ్చినప్పుడు ఎంప్లాయిమెంట్ ఆఫీసర్‌కు రాస్తూ వారి అనుమతి తీసుకొన వలసినది అది డి. డి. ఓ. యొక్క బాధ్యత. పుల్లయ్య కేసులో ఆంధ్రప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్ 5 సంవత్సరములు ఉద్యోగం చేసినందు వలన రెగ్యులర్ ఉద్యోగులు క్రింద పరిగణించాలి అని 1987లో తీర్పు చెప్పింది. అంతే కాకుండా 5 సంవత్సరముల వరకు ఉద్యోగం చేస్తున్నందు వలన ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి నిబంధనల నుంచి మినహాయింపు ఇచ్చినట్లు భావించాలి అని తీర్పు చెప్పింది. కాబట్టి ఈ తీర్పు ప్రకారం మీకు కంటిన్యూ చెయ్యాలి తప్ప ఉద్యోగం నుంచి తొలగించ కూడదు. ప్రసాదరావు కేసులో కూడా ట్రాక్టర్ డ్రైవర్‌గా 4 సంవత్సరములు ఉద్యోగం నుంచి తొలగించడం ఏకపక్ష నిర్ణయమని చెప్తూ తిరిగి ఉద్యోగంలో చేర్చుకొన వలెనని 1987లో అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్ తీర్పు చెప్పింది. ధీరేంద్ర చమోలీ కేసులో 1985లో సుప్రీంకోర్టు నెహ్రూ యువక్ కేంద్రాలలో రోజువారీ వేతనంతో పని చేస్తున్న వారికి క్లాస్ 4 ఉద్యోగుల వారితో సమానంగా వేతనం ఇవ్వవలెనని తీర్పు చెప్పింది. పోస్టులు మంజూరు చేసి వారి సర్వీసులు రెగ్యులరైజ్ చెయ్యవలెనని కూడా తీర్పు చెప్పింది. సురిందర్ సింగ్ కేసులో కూడా 1986లో సుప్రీంకోర్టు ఇదే విధంగా తీర్పు చెప్తూ 6 మాసాలు దాటి ఉద్యోగం చేస్తున్న వారి సర్వీసులు రెగ్యులరైజ్ చెయ్యవలెనని ఆదేశాలు జారి చేసింది. కాబట్టి మీకు షోకాజ్ నోటీసు ఇచ్చినందు వలన ఆలస్యం చెయ్యకుండా మీకు కంటిన్యూ చెయ్యవలెనని హైదరాబాద్‌లోని ఆంధ్రప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో మీరు అంతా కలిసి పిటిషన్ పెట్టండి.

**వి. రవీంద్రకుమార్, మిర్యాలగూడ.**

ప్రశ్న: మా తండ్రి వి. డి. ఓ.గా ఉద్యోగంచేసి 1983లో వలంటరీగా రిటైర్ అయ్యారు. అప్పటికి నా డిగ్రీ పూర్తి కాలేదు. నా డిగ్రీ 1988లో పూర్తి అయినది. నాకు మండల ప్రజా పరిషత్‌లో ఉద్యోగము వచ్చునా ? దయచేసి తెలుపగలరు.

జవాబు: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ప్రభుత్వోద్యోగి వైద్య కారణాలవలన రిటైర్ అయినప్పుడు అతని భార్యకుగాని, పిల్లలకుగాని ఉద్యోగం ఇవ్వవలెనని 30-7-1980 తేదీగల 504 నెంబరుగల జి.ఓ.లో ఉత్తర్వులు జారి చేశారు. ప్రభుత్వోద్యోగి పదవీ విరమణ చేసిన సంవత్సరం లోపల మాత్రమే ఉద్యోగం కొరకు దరఖాస్తులు స్వీకరించాలని ఈ ఉత్తర్వులో పేర్కొన్నారు. కాబట్టి మీరు ఇప్పుడు ఉద్యోగం ఇవ్వవలెనని దరఖాస్తు పెట్టుకుంటే ప్రభుత్వం అనుమతించదు. ఇక ప్రభుత్వోద్యోగి పదవీ విరమణ వయస్సుకు 5 సంవత్సరములకు ముందు మెడికల్ గ్రౌండ్స్‌మీద రిటైర్ అయి వుండాలని 1985లో (జి.ఎ.డి.) 309 జి.ఓ. జారి చేశారు. మీ తండ్రి ఈవిధంగా రిటైర్ అయివుంటే మీకు ఉద్యోగం ఇవ్వవలెనని పంచాయితీరాజ్‌శాఖ కార్యదర్శికి రిజిష్టర్డ్ పోస్టులో దరఖాస్తు పంపండి. ప్రభుత్వం నిరాకరించినట్లయితే అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో పిటిషన్ పెట్టండి.

**ఏ. వి. గురుప్రసాదరావు. గుంటూరు.**

ప్రశ్న: మా ఆస్తి మా తండ్రి స్వార్జితం. మా అమ్మకు పూర్వీకులనుండి వాటాగా వచ్చిన ఆస్తిని మా అమ్మ అనుమతితో మా తండ్రి అమ్మినారు. ఆ డబ్బును నాపై చదువులకు వినియోగించాలని అనుకొన్నాను. కాని మా తండ్రి ఇవ్వనన్నారు. నాకు ఇద్దరు చెల్లెళ్ళున్నారు. ఆ ఆస్తి లో నాకుగాని నా చెల్లెళ్ళకుగాని వాటా వుంటుందా?

జవాబు: మీ అమ్మకు వాటా వచ్చిన ఆస్తిని మీ అమ్మ అమ్మినపుడు మీరు చేయవలసినదేమీ లేదు.

ఆంధ్రసచిత్ర వారపత్రిక
న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..........................................................
పేరు: ..........................................................
పూర్తి చిరునామా: ..........................................................
..........................................................

# ఈ వారంలో మీ యోగం

## 3-8-1990 శుక్రవారం మొదలు

## 9-8-1990 గురువారం వరకు

**మేషం:** పదుగురిలో ప్రతిష్ఠ ఏర్పడగలదు. వారాంతాన చిత్రరంగాన అవకాశం కొందరకు లభ్యం. క్రమంగా మీ వృత్తి యందు పెంపు చేకూరుట గమనింపదగిన ముఖ్యాంశం. ఆరోగ్యలోపం రాదు. కొందరకు వాహన సేకరణకు అవకాశమున్నది. స్త్రీలకు: అపూర్వ వస్తు సేకరణ, ధనాగమనం.

**వృషభం:** వారాంతాన వ్యాపార విషయంగా ఏదో అనుకూలత చేకూరగలదు. విద్యార్థి వర్గానికి మేలైన వారం. స్థితి యందు పెంపు చేకూరుట గమనింపదగిన అంశం. వ్యాపార నిమిత్తం కొందరకు దూర ప్రాంతాలకు వెళ్లవలసిన అగత్యమున్నది. సుప్రసిద్ధుల పరిచయమున్నది. స్త్రీలకు: అభిమానించే వారున్నారు. వృత్తి యందు వికాసమున్నది.

**మిథునం:** ధనయోగం, శుభదాయకం, ఇంట శుభం జరిగే అవకాశమున్నది, గ్రహించాలి. ప్రభుత్వపరంగా మీకు రావలసిన పైకం ఏదైనా ఉంటే వారాంతంలో సాను కూలం కానున్నది. ఆరోగ్య లోపం రాదుగాని, ఏదో కారణంగా అధిక వ్యయం చేయవలసిన పరిస్థితులుంటాయి. స్త్రీలకు: శుభ సమయం, వృత్తి రీత్యా మేలు, గ్రహించండి.

**కర్కాటకం:** దూరభారాల నుండి బంధుమిత్రులు రానున్నారు. శ్రద్ధతో పనులు సేకరించగలుగుతారు. అపూర్వ వస్తు సేకరణకు అస్కారం. రాజకీయంగా ఏదో మేలు జరుగనున్నది, గ్రహించండి. వ్యవహార రీత్యా అనుకూల వారం. శుభదాయకవారం, గ్రహించాలి. స్త్రీలకు: వస్తు వాహన సౌకర్యం, ధనవసతి, ఉద్యోగరీత్యా అనుకూలం చెప్పదగిన వారయోగ్రప్రదాయక అంశాలు.

**సింహం:** సక్రమంగా ఒక్క వ్యవహారం జరిగి రాలేదని బాధ, మరి గ్రహచారం సరిలేనపుడు అంతేగా! ఎవరి వలన ఏ పని జరగాలని కాంక్షిస్తారో అది జరుగకపోవటం గమనిస్తారు. దూరప్రాంతాల నుండి బంధు సమాగమం, వారిగ్గా శ్రమించవలసిరావటం జరుగుతుంది, గమనిస్తారు. స్త్రీలకు: వృత్తి ఉద్యోగాలందు విశేష ఆదరణ, వస్తు సేకరణకు సదవకాశం, లభ్యం కానున్నది.

**కన్య:** చలనచిత్ర రంగాన శ్రమించువారికి, రాజకీయ వాదులకు, ప్రభుత్వోద్యోగులకు, యిటీవల ఉద్యోగంలో చేరిన వారికి అనుకూలవారం. ఆర్థికంగా మీ స్థితి బాగా మెరుగవుతుంది. స్త్రీలకు: సజ్జన సాంగత్యం, యుక్తితో పనులు నెరవేరుట, యిత్యాది అనుకూలత, ఆదాయ వృద్ధి, ఆనందసమయం.

**తుల:** పాత్రికేయులకు, పంపిణీదారులకు చక్కని అవకాశాలున్నాయి. చిత్రరంగాన కొందరకు, సంగీత మార్గాన కొందరకు, రచనా విధానాన కొందరకు చక్కని అవకాశాలు. ప్రతి వ్యవహారం చక్కగాసాగిపోయి లాభ ప్రదమగుట గమనించగలరు. స్త్రీలకు: శుభదాయకం, వృత్తి పెంపు, ఆరోగ్యానుకూలత.

**వృశ్చికం:** ధనవసతిలో ఎలాంటి యిబ్బందిలేదు. వృత్తి వికాసానికి ఏ లోపంరాదు. ఆప్తమిత్రుల సహాయం ఉండనే ఉన్నది. కష్టాలలో మిమ్ము ఆదుకొన్న వారున్నారు, ఆదరించు వారున్నారు. ఇంకా కొన్ని నెలలు జరిగితే గాని 'రాశి' చక్కబడదు. అపూర్వ వస్తు సంగ్రహణం కొందరకు, వ్యాపారానుకూలత కొందరకు. స్త్రీలకు: వారాంతాన సదవకాశాలు.

**ధనుస్సు:** పూర్వ పరిచయాలు, లాభప్రదం కానున్నవి, అయినా 'రాశి యందలి వక్రకళని' కొంత బాధాకరుడుగాకపోడు. విరోధి వర్గమున్నది, దాయాదుల వలన ఒడిదుడుకులు ఉన్నవి, గ్రహించాలి. చాలా కాలంగా యింటికి రాని వారు, హఠాత్తుగా రానున్నారు, అతిథి అభ్యాగతులను ఆదరించవలసిన సమయం కూడా యిదే. ప్రయాణ సూచనలున్నాయి, కాని మాను కొనుట శ్రేయం. స్త్రీలకు: వృత్తి యందు ఆదరణ.

**మకరం:** ఎంతో కాలంగా యోగదాయకం కాగలవనుకొన్న వ్యవహారాలు తారుమారవుతాయి. బంధుమిత్రుల సమాగమం, యత్నకార్యసిద్ధి, 'లాటరీ' లందు ఊరకితాపత్రయమేగాని, కలసిరాగలదనుకోటం సాధ్యం కాని వ్యవహారం. చలన చిత్రరంగానుకూలత కొందరకు సాధ్యం. స్త్రీలకు: ఉద్యోగమందు పెంపు, రాజకీయరంగానుకూలత.

**కుంభం:** ధనలోపంరాదు. యత్నకార్యసిద్ధి, ప్రజాదరణ, ఉత్తముల సహవాసం, రాజకీయంగా మేలు చేకూరుట గమనింపదగిన ముఖ్యాంశం. స్థితిగతులందు పెంపు చేకూరుట, రాజకీయరంగాన మేలు చేకూరుట గమనిస్తారు. స్త్రీలకు: ధనలాభం, వృత్తి పెంపు.

**మీనం:** వృత్తిరీత్యా మేలు. ప్రచారంగాన ప్రసిద్ధి. దూరభారాల నుండి ఉత్తరాల మూలంగా పలు విషయాలు గ్రహించగలుగుతారు. గనులందు, కార్ఖానాలందు శ్రమించు వారికి, పని పాటలు చేయువారికి, ఆదాయమందు పెంపు కనిపించునున్నది. ఏమయినా ఆదాయాన్ని మించిన వ్యయం చేయవలసిన అగత్యం కూడా ఉన్నది. స్త్రీలకు: క్రితం చెదిరిన వ్యవహారాలు సానుకూలంకానున్నవి.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



## అభిమన్యు డవ్వాలని...

నితిష్ భరద్వాజ్ యిప్పుడు "మహాభారత్" కృష్ణునిగా యింటింటా కీర్తింపబడుతున్నాడు. పత్రికలలోయింటర్వ్యూలు దంచేస్తున్నాడు కాని అసలు మొట్టమొదట అతణ్ణి పిలిచింది "విదురుడి" వేషం కట్టమని అని చాలా మందికి తెలియదు. "నాకు అభిమన్యుడి వేషం యిప్పించండి చాలు" అంటూ నితిష్ ప్రాకులాడాడు - కాని విధి చిత్రమైంది కదా అతనికి "వాసుదేవు"ని వేషం చిక్కింది.

ఇంతవరకూ సాగిన కథ—4:— శౌరి, ధీరల ప్రేమకు మొదట ఒప్పుకున్న పెద్దలే తుదకు అడ్డుగోడలై నిలుస్తారు. ధీర, శౌరి తాము ఉద్యోగాలు సంపాదించుకొని తమ కాళ్లపై తాము నిలబడితే కానీ తమ ప్రేమ ఫలించదనే నిర్ణయానికి వస్తారు. కాని ఉద్యోగాల వేటలో వాళ్ళు విఫలమవుతారు. ధీర తండ్రి శౌరిని కాదని వేరొక సంబంధం చూస్తుంటాడు. తను ప్రేమించిన శౌరి మరొక అమ్మాయితో వుండటం ధీరకు అసహ్యం కల్గిస్తుంది.

(గత సంచిక తరువాయి)

## ఎప్పుడు ఎలా వచ్చాడో ఏమోగాని సన్న సన్నగా సన్నాయి నొక్కులు నొక్కుతున్నాడు యోగి.

"నేను వూహించినట్టుగానే జరుగుతున్నది. నీకు, నీ ప్రేమకి టాటా చెప్పి హైదరాబాద్ దొరతో వూరేగుతున్నది ధీర. ఆడదాన్ని నమ్మి బాగుపడిన వాడు ఈ భూప్రపంచంలో లేడు. కలిమి అయినా, లేమి అయినా, నీతో నే నా జీవితమంటూ డ్యూయెట్ సాంగ్ పాడిన ధీర ఎంత మారిపోయింది. అంతా డబ్బు మహత్యం. పదిలక్షల కట్నంతో అల్లుడ్ని కొంటున్నట్టు టాం టాం వేస్తున్నాడు సప్తగిరి."

అతని ధోరణికి అడ్డు వస్తూ "ఇదంతా నిజమేరా" తన కళ్లని, చెవుల్ని నమ్మలేకపోతున్నాడు శౌరి.

"ఇంటి బూజులు దులుపుతున్నాడు. ధీర పెళ్ళికి ముహూర్తం పెట్టేశాడు. రేపు అప్పడాలు ఎండబెట్టడానికి ఎండ వస్తుందో రాదో తెలుసుకోవడానికి నా కళ్లెదుటే, మా ఆఫీసు నుంచి ఆకాశవాణికి ఫోన్ చేశాడు సప్తగిరి"

విరివిగా అబద్ధాలు అల్లుతున్నాడు యోగి.

"ఇంత జరిగాక ఇక నాకెందుకురా ఉద్యోగం" ఏడ్చినంత పని చేశాడు శౌరి.

"నీకోసంరా. తాను లేకుండా నువ్వు బ్రతకగలనని నిరూపించడానికి. స్వార్థం పేట్రేగిపోతున్నది. నువ్వు మడికట్టుకుంటే ప్రయోజనంలేదు. ధీర కాకపోతే మరో గంభీర. మొగ వెధవ్వి. నీకు పెళ్ళి కాకపోదు. చేతికందుతున్న ఉద్యోగాన్ని జారవిడుచుకోకు. మన్మధమూర్తి వచ్చేశాడు. విష్ యూ ఆల్ ది బెస్ట్".

శౌరిని బలవంతంగా హొటల్ గదిలోకి తరిమి చేతులు దులుపుకున్నాడు యోగి.

ఆ గదిలో ముసలి పీనుగ మన్మధమూర్తి వున్నాడు. యోగి నూరి పోసిన డైలాగులు యాంత్రికంగా వల్లించాడు శౌరి.

"మా పెళ్ళి మూడు నెలలు దాటింది. నాకు జాబ్ లేక చేయి నోటివరకు పోవడం లేదు. కడుపు కాలుతూంటే కాపురమెలా చేస్తాం. నా శ్రీమతి పతివ్రత. నా మాట జవదాటదు. మనస్ఫూర్తిగా అంగీకరించింది. మీరొక్కసారి మా శ్రీమతిని కనికరిస్తే చాలు. మా కష్టాలు గట్టెక్కుతాయి".

"ఉపోద్ఘాతం అనవసరం. యోగి అంతా చెప్పాడు. నీకు ఉద్యోగం ఖాయం. నువ్వలా వరండాలోకి వెళ్ళు. నీ ఆవిడ్ని నేనేం కొరుక్కు తినను. గో మేన్" అంటూ అమ్మాయికేసి చూస్తూ లొట్టలు వేశాడు మన్మధమూర్తి.

బాల్కనీలో నిల్చుని క్రిందికి చూస్తున్న ఆ అమ్మాయి వెనక భాగమే అతనికి కన్పిస్తున్నది.

"అమ్మీ. నువ్వేం కంగారుపడకు. బ్లూ ఫిలిం తీసి నిన్నేం బ్లాక్‌మెయిల్ చేయను. మీ ఆయనతో వున్నట్టు నాతో వుండాలి." అంటూ ఆబగా ఆమెని సమీపించాడు.

వయ్యారం ఒలకపోస్తూ వెనక్కి తిరిగింది ఆ అమ్మాయి. మన్మధమూర్తి చెంప ఛెళ్ళు మన్నట్టయింది.

అప్పుడే రూం తలుపులు దగ్గరికి వేస్తున్న శౌరి చొక్కా పట్టుకుని కసి కసిగా, అతి క్రూరంగా వార్నింగ్ ఇచ్చాడు మన్మధమూర్తి.

"మిస్టర్. ఏమిటీ నాటకం? ఫ్యామిలీ లేడీస్‌కి పచ్చి వ్యభిచారిణికి తేడా తెలియని పసివాడిని కాదు. ఈ ఐదు రూపాయల సరుకు నీ పెళ్లామా? ఈ తిరుగుబోతు పతివ్రతా? ఈ అమ్మాయి నాకేం కొత్త కాదు. నీలాంటి బేరాలు దొరకనప్పుడు ఐదు రూపాయల ఈ అమ్మాయే నాకు గతి. నన్నింత దారుణంగా దగాచేసిన నీకు ఉద్యోగం రాకుండా చేస్తాను జాగ్రత్త" అన్నాడు వ్రేలెట్టి మరీ బెదిరించి.

* * * * *

శౌరి ప్రేమ జ్ఞాపకాల్లొంచి తేరుకోలేక అబ్బిగాడు ఎక్కిన సిటీ బస్ యాంత్రికంగా ఎక్కింది ధీర. అరగంట ప్రయాణం చేశాక అతను దిగమనగానే దిగింది.

ఇద్దరూ కలిసి కొంత దూరం నడిచారు.

అబ్బిగాడు గబుక్కున ఆగి అన్నాడు-

"ఎక్స్‌క్యూజ్ మీ. మా బామ్మ బాయ్ ఫ్రెండ్ పక్క సందులో వున్నాడు. ఇప్పుడే రెండు క్షణాల్లో వస్తాను.

ధీరకి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా తుర్రుమన్నాడు అబ్బిగాడు.

అరగంట గడిచినా అతను రాకపోయేసరికి కంపెనీ లొకేషన్ గురించి దారినపోయే దానయ్యని అడిగింది.

"ఊర్లో కంపెనీ పెట్టుకుని ఊరి శివార్లకి వచ్చావేం. అయిదు గంటలకి గాని సిటీ బస్ రాదు. ఆటోలు రిక్షాలు దొరకవు". మెత్త మెత్తగా చీవాట్లు వేశాడు దానయ్య.

హతాశురాలయింది ధీర.

★ ★ ★ ★ ★

ఘొల్లుమంటున్నది ఫోన్. నిర్జీవంగా కూర్చున్న ధీర గాఢంగా నిట్టూర్చింది.

"ఏమిటీ గోల" అంటూ రిసీవర్ అందుకుంది మంగమ్మ.

"అలానా. సరే. ఇక్కడే వుంది" అంటూ రిసీవర్ ధీర చేతికిచ్చి "సప్తమి మాట్లాడుతున్నది. రేపు మళ్ళీ రమ్మంటున్నది" అంది మంగమ్మ.

"ఎవరూ, ధీరేనా" అని అవతలి వైపు నుంచి వినబడగానే "వూ" అంటూ బిగ్గరగా మూలిగింది ధీర.

"సారీ ధీరా. లేడీ ఎంప్లాయీస్ పట్ల డ్యూటీ అండ్ నాటీ కంపెనీ అసభ్యంగా ప్రవర్తిస్తుందని విని నిన్నా దుశ్శాసనుల బారి నుండి తప్పించాలని కిరాయి అబ్బిగాడితో నాటకం ఆడాను. వెరి వెరీ సారీ".

"రేపు ఏ నాటకం ఆడుతున్నావో చెప్తే గానీ థాంక్స్ చెప్పను" కొంచెం కరుగ్గానే అంది ధీర.

"పిచ్చి మొద్దా. నీకు ఉద్యోగం వచ్చిందే. చిట్‌ఫండ్ కంపెనీలో నీకు క్యాషియర్ జాబ్ వచ్చింది. కవరు విప్పి ఇప్పుడే ఆర్డర్ చదివాను. ఇరవై వేల జీతం సంవత్సరానికి. హార్టీ కంగ్రాట్యులేషన్స్".

అవతల వైపు ధోరణికి కొంచెం చలనం వచ్చిన ధీర "థాంక్యూ... థాంక్యూ.... అంది ఆనందంగా.

"హోటల్ కంట్రీ పక్కన చిట్‌ఫండ్ కంపెనీ ఉంది. రేపు ఉదయం పదిన్నరకల్లా వస్తే జాబ్‌లో చేరవచ్చును. నీ కోసం అపాయింట్‌మెంట్ ఆర్డర్‌తో హోటల్ కంట్రీ దగ్గర వెయిట్ చేస్తూ వుంటాను".

"తప్పక వస్తాను." అంటూ ఫోన్ పెట్టేసింది ధీర సాలోచనగా.

★ ★ ★ ★ ★

"సారీ మన్మధమూర్తి ఇంత లేకి వాడని తెలియదు. ఫుట్‌పాత్ సరుకు స్థితికి దిగజారాడని తెలియదు. ఏదో అమ్మాయితో పాచిక వేశాను. పారలేదు."

శౌరి చేతులు పట్టుకుని బ్రతిమాలే ధోరణిలో అంటున్నాడు యోగి.

"ఈ సోది చెప్పడానికా మా ఇంటికి వచ్చి నన్ను నిద్ర లేపింది. కొట్టానంటే పళ్ళన్నీ జలజలా రాలాలి వెధవా" అంటూ ఒంటి కాలిపై లేచాడు శౌరి.

"ధీరపై కోపాన్ని నాపై కుమ్మరించకు. నీకో కమ్మని వార్త చెప్పాలని కిరాయి సైకిలుపై వచ్చాను బ్రదర్".

"వూరించకు. ఇప్పటి వరకు ఉద్ధరించింది చాలు. అసలు విషయం కక్కేయ్".

"కక్కేస్తాను. ఇక పచ్చి మంచినీళ్ళు ముట్టను. రేపు హోటల్ కంట్రీలో నాకు బ్రహ్మాండమైన పార్టీ యివ్వాలి".

"నీ ఏడుపుని బట్టే పార్టీ వుంటుంది". వాగ్దానమివ్వలేదు శౌరి.

"నీకు నచ్చిన రాగమే. ఆనందంతో తాండవం చేస్తావ్." ఇంకా వూరిస్తూనే వున్నాడు యోగి.

"నీకు పార్టీ తగలేస్తాను గానీ విషయం చెప్పి చావరా".

శౌరి కోపం పెరగక మునుపే తన





## అశోకచక్ర అందుకున్న ప్రథమ మహిళ



అశోకచక్ర అవార్డు అందుకున్న మొట్ట మొదటి మహిళ గ్లోరియాబెర్రీ. 20 సంవత్సరాల వయసప్పుడే ఆమెకు 1956లో ఈ అవార్డు లభించింది. అది కూడా ఆమె మరణానంతరమే. ఎయిర్ హోస్టెస్‌గా పనిచేస్తున్న సమయంలో బొంబాయి వద్ద జరిగిన 'కాశ్మీర్ ప్రిన్సెస్' విమాన ప్రమాదంలో ఆమె అసువులు బాసారు. ఆమె సేవలకు గుర్తింపుగా ఈ అవార్డు వచ్చింది. ఆ తర్వాత 1986లో పాన్‌ఆమ్ విమానాన్ని హైజాకర్లు హైజాక్ చేసినప్పుడు వారి తూటాలకు బలైపోయిన నీర్జామిశ్రాకు మరణానంతరం ఈ అవార్డు లభించింది. అంతేగాక మిశ్రా పాకిస్తాన్ అవార్డు నిషాన్- ఎ- ఇన్ సానియత్‌ను కూడా అందుకున్న ప్రథమ భారతీయ మహిళ అయ్యారు కూడా.

జేబులో నుంచి పేపరు తీసి అతనికిచ్చి అన్నాడు యోగి.

"ఇది మొన్నటి పేపరు. నీ నెంబర్ 001100. నువ్వు గ్రేడ్ త్రీ బి ఆఫీసర్‌గా సెలెక్ట్ అయినావు".

పేపరు వంక చూస్తున్న శౌరి తన కళ్ళని తానే నమ్మలేక పోతున్నాడు.

★ ★ ★ ★ ★

సిటీ బస్‌లోంచి దిగుతూ హోటల్ కంట్రీ వంక చూసింది ధీర.

తన కోసం నిరీక్షిస్తున్న సప్తమిని చూడగానే ఆమె ఆనందానికి రెక్కలొచ్చినాయి.

రెప్పపాటులో కారు యాక్సిడెంట్ నుంచి తప్పించుకుని ఒక్క ఉరుకులో స్నేహితురాలి దగ్గరికి వచ్చింది ధీర.

"ఏమిటే ఆ తొందర" మందలించింది సప్తమి.

"ముందు అపాయింట్‌మెంట్ ఆర్డర్ ఇవ్వవే.

"వూరికే ఇస్తానేంటి? ముందు పార్టీ ఇవ్వాలి".

"ఇస్తాలేవే. ముందు కవరివ్వవే. నామీద నమ్మకం లేదా".

"అసలు నీ మీద నీకు నమ్మకం వుందా? నిన్నెంతగానో ఆరాధించిన శౌరిని అనవసరంగా అనుమానిస్తున్నావు".

ఏదో పంతానికి పోయి బింకంగా వుంది గాని, గత ప్రేమ స్మృతులని మరిచిపోలేక పోతున్నది ధీర. సీరియస్‌గా బిగుసుకు పోయి కఠినంగా అంది.

"ఇక శౌరి ప్రస్తావన నా దగ్గర ఎప్పుడూ తేకు. గతం గతః. పద పార్టీయిస్తాను."

ఇద్దరూ మౌనంగా హోటల్లోకి వెళ్లారు. కుర్చీలో కూర్చుంటూ "సిగ్గులేకపోతే సరి" అంటూ పక్కలైన్‌లో కూర్చున్న శౌరిని ఈసడించింది సప్తమి.

బేలనయనాలతో అతని వంక చూసింది ధీర.

"అతనిప్పుడు పూర్వపు శౌరికాదు. ఆఫీసర్‌గా సెలక్టైనాడు. యోగికి పార్టీఇస్తున్నాడు" సన్న సన్నగా నసిగింది సప్తమి.

"ఎంత ఆఫీసరైనా కట్నానికి అమ్ముడు పోయేవాడేగా... మనసులేని మృగం. లక్షల లక్షలు కట్నానికి అమ్ముడు పోయే ఆ దగాకోరుకే అంత గర్వముంటే, అటువంటి నీచుల్ని కొనగల మనకెంత అహం వుండాలి."

ధీర ధోరణికి అడ్డువస్తూ "అతన్ని నువ్వు పూర్తిగా అపార్థం చేసుకున్నావు-" ఇక మాట్లాడలేక పోయింది సప్తమి.

ఆమె నోటిని తన చేత్తో మూసిన ధీర గర్జించింది.

"నాకు ఆర్డర్ ఇచ్చి తరువాత నువ్వు కడుపారా తిను. నా మనసు మార్చడానికి ప్రయత్నించకు."

ఆమెకి అపాయింట్‌మెంట్ ఆర్డర్ కవరిచ్చి భారీగా టిఫెన్లకి ఆర్డరిచ్చింది- సప్తమి.

ఇక్కడ పరిస్థితే అక్కడ కూడా వుంది.

యోగి మాట వినకుండా ఆలోచనా శూన్యుడై ఉద్రేకంగా అంటున్నాడు శౌరి.

"నా అసమర్థతని ధీర ఏవగించుకుంది. నా వల్ల తన జీవితానికి భద్రత లేదని భావించింది. అందుకే తండ్రి తెచ్చిన పై అంతస్థువాడిని వరించింది. ఆమె మనసు అంచనా వేయలేక ఇంతవరకు మోసపోయాను."

"అదికాదురా" దీర్ఘం తీయబోయిన యోగి నోరుమూసి "పార్టీ అంటూ ఏడ్వావుగా. తిన్నంత తిని మోసుకు పోగలిగినంత పార్సిల్స్ కట్టించుకో" అంటూ టేబుల్‌పై వున్న పేపరు విసురుగా అందుకున్నాడు శౌరి.

తాను తెచ్చిన టిఫెన్ ప్లేట్స్ టేబుల్‌పై సర్దబోయాడు సర్వర్.

"మిస్టర్.... ఇవన్నీ తీసుకు పోయి రెండు గ్లాసుల ఐస్ వాటర్ తీసుకురా" కోపంగా అంది ధీర.

"నాచేత నీళ్ళు తాగిస్తావా" మాటలు సాగదీసింది సప్తమి.

"తాగించను. స్నానం చేయిస్తాను. క్యాషియర్ జాబ్‌కి అరవై వేల సెక్యూరిటీ డిపాజిట్ కట్టాలిట. ఇంతోటి గొప్ప ఉద్యోగం వచ్చినందుకు నీకిచ్చే పార్టీ యిదే" అంటూ నీళ్ళ గ్లాసు వొంచేసి చివ్వున లేచింది ధీర.

పేపరు చూస్తున్న శౌరి ఉగ్రుడై ఉక్రోషంతో ఉన్మాదైనాడు.

మొన్నటి పేపరులో 0011100 బదులు 001100 సెలక్టు అయినట్టు ప్రచురించినందుకు చాలా చింతిస్తున్నాం. 0011100కి శుభాకాంక్షలు తెలియబరుస్తూ 001100కి మా ప్రగాఢ సానుభూతి ప్రకటిస్తున్నాం. అచ్చు తప్పువల్ల

## కెరటాలు-కేరింతలు

పాఠకులకి గలిగిన అసౌకర్యానికి విచారం వ్యక్తపరుస్తూ - మీ ఎడిటర్-

ఆ ప్రకటన చదవగానే కోపం దుఃఖం సమపాళ్ళలో ఫౌంటెన్‌లా లేచేసరికి ఆ తాకిడికి తట్టుకోలేక కుర్చీలోంచి లేచాడు శౌరి.

ఓపెన్ ప్లేట్స్ ఖాళీ చేయడంలో నిమగ్నుడైన యోగి "వాంటెడ్ కాలమ్స్ చూస్తున్నావా? పూర్వపు వాసనలు ఇంకా పోలేదా" పరాచికాలు ఆడసాగాడు.

మొహాన్ని కందగడ్డ చేసుకుని రుద్రతాండవం చేస్తూ పేపరుతో అతని తలబాది ముందు కురికాడు శౌరి.

విషయం గ్రహించిన యోగి "నీ అదృష్టం తగలడ... తెగ మెక్కేశాను... బిల్లెవరిస్తారు దేవుడో" అని విలపించసాగాడు.

అదే దుస్థితిలో వుంది సప్తమి.

"ఆర్డరిచ్చి వద్దంటే ఎలా? మీరు తిన్నా తినకపోయినా బిల్లు చెల్లించక తప్పదు" సర్వర్ మొండికేశాడు.

చిమచిమలాడుతూ చరచరా వస్తున్న ధీరా, శౌరి హోటల్ పోర్టికోలో ఢీకొన్నంత పని చేశారు.

ఆ యిద్దరూ మనసున్న మనుషుల్లా ముచ్చటించుకోలేదు. బుద్ధీ జ్ఞానం లేని పొట్టగిత్తల్లా హుంకరించారు.

ఒకరి నొకరు ఛీకొట్టి తూర్పు పడమరలుగా చీలిపోయారా వివేకశూన్యులు.

మూడో మనిషి మాటకే విలువ నిచ్చి నిజానిజాలు తెలుసుకునే ఇంగితం, సంస్కారం, సహనం వాళ్ళలో లేకపోవడానికి కారణం ఆవేశం. ఆ ఆవేశంలో నే ప్రేమించుకున్నారు, విడిపోయారు.

ఆలోచనా శూన్యమైన ఆవేశమే అన్ని అనర్థాలకి మూలం. ఎంత ప్రేమికులైనా వాళ్ళిద్దరూ అరుదైన వ్యక్తులు కారు. సగటు మనుషులు మరి. అందుకే అపార్థం చేసుకున్నారు.

(ఇంకా వుంది)

## వీక్లీ పోస్ట్

( 4 వ పేజీ తరువాయి)

### మాయ

మీరు ప్రచురించిన పాముల భక్షకుడు "శ్రీ నాగభైరవ చౌదరి" గారితో 'కాకాని కమల'గారి స్పెషల్ ఇంటర్వ్యూ చదువుతూంటే ఆఫోటోలు చూస్తుంటే ఇది కలయా, లేక వైష్ణవ మాయయో అనిపించింది. బహుశా నాగభైరవ చౌదరిలాంటి అపర గరుత్మంతుణ్ణి చాలా చక్కగా ఇంటర్వ్యూచేసిన కాకాని కమలగార్కి నా ?నయ పూర్వక ధన్యవాదములు, ప్రచు ?చిన మీకు నా శతకోటివందనములు. నాగభైరవచౌదరి గారి పేరు త్వరలోనే "గిన్నీస్ బుక్ ఆఫ్‌వరల్డ్"లోనికి ఎక్కాలని మనసారా కోరుకుంటున్నాను. మరియు నాగభైరవగారి యొక్క అపురూపమైన, ?తమైన, అత్యంత భయంకరమైన తలచుకొంటేనే శరీరము భయంతో వణికిపోయే విధంగావున్న మీయొక్క స్పెషల్ ఇంటర్వ్యూ (మా) మీ ఆంధ్ర సచిత్రవార పత్రికకే మకుటాయమానంగా వున్నది. శ్రీ నాగభైరవగారి యదార్థ గాథను ఇంటర్వ్యూగా ప్రచురించిన మీకు నాయొక్క ధన్యవాదాలు.

మునగాల వేంకటేశ్వర్లు,
శ్రీకాళహస్తి

### ముఖచిత్రం మీద శ్రద్ధ

'రూపిణి' ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. "ముఖచిత్రం" విషయంలో మీరు చూపించే శ్రద్ధకు మా అభినందనలు.

'మన్నెం శారద గారి'"సూపర్ హీరో" పత్రికకు హైలైట్ శాతవాహన గారి "వజ్ర సంకల్పం" సీరియల్ బాగుంది. ఈ వారం శీర్షికలు ఆనందదాయకంగా ఉన్నవి. ఎడిటర్‌గారికి మా కృతజ్ఞతలు.

(నగళ్ళ మోహన్‌కృష్ణ, నెల్లూరు)

### సీరియల్స్

ఈ వారం మీ(మా) పత్రిక క్రొత్త అందాల్ని సంతరించుకొని ఆకర్షణీయమైన ముఖచిత్రంలో చాలా బావుంది. ముఖ్యంగా క్రొత్త సీరియల్ "కెరటాలు కేరింతలు" ఆదిలోనే ఆకట్టుకుంది. అలాగే మన్నెం శారదగారి" సూపర్ హీరో" సీరియల్ సూపర్‌గా వుంటోంది... 'వజ్రసంకల్పం' సీరియల్ అనూహ్యమైన మలుపులతో ఆసక్తిదాయకంగా సాగుతోంది. 'పాము పగ' కథ ముగింపు చాలా బావుంది. శీర్షికల్లో 'ప్రశ్నావళి' 'టిట్ ఫర్ టాట్' శీర్షికలు చాలా బావుంటున్నాయి. టోటల్‌గా చెప్పాలంటే మీ (మా) పత్రిక రియల్లీ సూపర్బ్.

-మహమ్మద్ రఫీ
అయితానగర్, శ్రీకాకుళం

### ధర్మవీర

ఖుష్బూ ముఖచిత్రంతో వెలువడిన ధర్మవీర చాలా అద్భుతంగా ఉన్నది. ఎందుకంటే ఆ కథలోని తీరు నన్ను అంతగా ఆకట్టుకున్నది. పిల్లలలో తప్పువప్పులకు కారణం మనమేనని తల్లిదండ్రులు తెలుసుకొని, కృష్ణమోహన్ గారిలా సరిదిద్దితే ఈ సమాజం ఎప్పుడో బాగుపడేది. ఇంకా ఇలాటి మంచి కథలు మాకు అందిస్తారు అని నా కోరిక. ఇంక సీరియల్స్ సంగతి చెప్పనక్కర లేదు ఎందుకంటే ఒకదాన్ని మించి ఒకటి పోటీపడుతున్నాయి. మన పత్రిక ఎందుకు లేటు అవుతోందో నాకు అర్థం కావటంలే. మన పత్రిక లేటు అవటం నేను సహించ లేక పోతున్నాను. ఇక నుంచి అయిన మన పత్రిక వారం- వారం మా చేతులలో ఉంచుతారని నా ఆశ.

కొచ్చెర్ల రాగవకుమారి (కాకినాడ)

# సినిమా... సినిమా...




## ఆగస్టులో "శ్రావణపౌర్ణమి"

"భక్తిరస ప్రధాన చిత్రం. కొంత కాలం క్రితం గురువాయూర్‌లో కేశవన్ అనే గజం పలువింతలు, మహిమలు చూపి భక్తులను ఆకట్టుకుంది. వాటిని అపూర్వంగా తెరకు మలిచారు. 'వైశాలి' ఖ్యాతి డైరెక్టర్ భరతన్ స్వామి గురువాయూరప్ప మహిమలు అందర్నీ తన్మయుల్ని చేస్తుంది. ఆగస్టు రెండో వారంలో విడుదల", అన్నారు. పాలడుగు వెంకట్రావు ఈయనా, ఇ. వి సుబ్బారావు కలిసి నిర్మిస్తున్న శ్రీ చైతన్య ఆర్ట్ ప్రొడక్షన్స్ "శ్రావణ పౌర్ణమి" చిత్రంలో కేశవన్ అనే ఏనుగుతో పాటు సోమన్ జయభారతి, వెన్నిరాడై నిర్మల, సుకుమార్, అదూర్ బాసి ప్రభృతులు పాల్గొన్నారు. సత్యవాది సంభాషణల కర్త దేవరాజ్ స్వరకల్పనలో డి నారాయణవర్మ, మిక్కిలినేని జగదీశ్ బాబు, అమరేశ్వరరావు పాటలు రాశారు అశోక్‌కుమార్ చాయ, ఎం. జె విజయ్ ప్రొడక్షన్, కట్బా శ్రీకరప్రసాద్ కూర్పు, పి. వేణుగోపాల్ నిర్వహణతో కె. ఉమా మహేశ్వరరావు నిర్మాణ సారథి.

-జి.వి.జి.

ఆంధ్రసచిత్రవారపత్రిక 3-8-'90